# పారసీక వాఙ్మయ చరిత్ర

రచన :

కీ. శే. బూర్గుల రామకృష్ణరావు

సంపాదకులు :

కీ. శే. డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి



తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు

PAARASEEKA VANGMAYA CHARITRA,
A Concise History of Persian Literature in Telugu
by Late BURGULA RAMAKRISHNA RAO,
Edited by Late Dr. Iriventi Krishna Murthy.

---

తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు - 500 004.

ప్రథమ ముద్రణ : 1989

ప్రతులు : 1000

**వెల : రూ. 11/-**

ముఖచిత్రం : శీలావీర్రాజు

ప్రతులకు :
**తెలుగు విశ్వవిద్యాలయం**
కళాభవన్, సైఫాబాద్
హైదరాబాదు - 500 004.

ముద్రణ :
**పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్**
హైదర్‌గూడ, హైదరాబాదు - 500 029.



గ్రంథకర్త

కీ. శే. బూర్గుల రామకృష్ణరావు గారు

**డా॥ బూర్గుల రామకృష్ణరావు గారి**
**'పారసీక వాఙ్మయ చరిత్ర'**

# ప్రకాశక విజ్ఞప్తి

తెలుగు భాషా సాహిత్యాలు దేశభాషలతోనే కాక అన్యదేశీయములైన భాషలతో కూడా సంబంధ బాంధవ్యాలు ఏర్పరుచుకొన్నాయి. ద్రావిడ భాషలతోపాటు సంస్కృతాన్ని తెలుగునుండి విడదీయరానట్లే పారసీకం, ఉర్దూ, ఇంగ్లీషు మొదలైన భాషల్ని కూడా తెలుగునుండి పూర్తిగా విడదీయలేము. తెలుగు భాషా సాహిత్య స్వరూపాల అవగాహనకు అన్యదేశీయములైన భాషలచరిత్ర కూడా అవగతం చేసుకోవలసిన ఆవశ్యకం ఎంతైనా ఉంది.

ఈ ఆవశ్యకం గుర్తించి తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణకు స్వీకరిస్తున్న గ్రంథాలలో తెలుగుతో సంబంధమున్న ఇతరభాషల చరిత్ర గ్రంథాలు కూడా సముచిత ప్రాధాన్యం పొందుతున్నాయి. లోగడ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ తెలుగులో ప్రచురించిన 'ఉర్దూ కవుల కవితాసామగ్రి', 'ఇక్బాల్ ఔర్ ఇన్సాన్', ఇటీవల తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురించిన 'జాతీయ కవి ఇక్బాల్', 'ముఖ్దూమ్ మొహియుద్దీన్' మొదలైన రచనలు ఈ లక్ష్యంతో వెలువడినవే.

పారసీ భాషతో అనేక భారతీయ భాషలకు అంతస్సంబంధం ఉంది. ఇది ఒకనాటిది కాదు. దాదాపు ఎనిమిది శతాబ్దుల అనుబంధం. 'హిందూస్థాన్' అని మన దేశానికి వచ్చిన పేరు పారసీ భాషలోనిదేనంటే ఆశ్చర్యపడనక్కరలేదు. భారతీయములైన వేదపురాణాలు, మహాకావ్యాలు కొన్ని పారసీ భాషలోకి చాల కాలం క్రిందటే అనువదించబడినాయనేది మనం విస్మరించరాదు. అక్బరు కొలువు నలంకరించిన అబుల్‌ఫజల్ సంస్కృత భారతం చాలవరకు పారసీకంలోకి పరివర్తనం చేశాడు. దారాషికో ఋగ్వేదం, అథర్వవేదం కొంతమేర పారసీకంలోకి అనువదించాడు. 'నాసికేత్ పురాణ్' అనే పేరుతో కఠోపనిషత్తులో కొంతభాగం, 'గ్యాన్‌ప్రకాశ్' అనే పేరుతో భగవద్గీత ఉర్దూలోకి అనువదించ

బడినాయి. ఈ మహాగ్రంథాల వ్రాతప్రతులు 'ఆంధ్రప్రదేశ్' ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో ఉండి విజ్ఞులైన ప్రపంచ పరిశోధకులెందరినో ఆకర్షిస్తున్నాయి. భిన్న సంస్కృతులను పరస్పరం మేళవింపజేసే భవ్యభావనకు ఈ మహా గ్రంథాలు అనునిత్యం నాందిగీతం ఆలపిస్తాయి.

పారసీక సాహిత్యంలో ఫర్దౌసి మహాకవిని శ్రీ బూర్గుల రామకృష్ణరావు గారు మన కవిబ్రహ్మ తిక్కనతో పోల్చారు. అభినవ కవి చక్రవర్తి జాషువా గారి 'ఫిరదౌసి' కావ్యం ఆ మహాకవిని తెలుగువారి గుండెల్లో శాశ్వతంగా ప్రతిష్ఠించింది.

అట్లాగే కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారి 'పానశాల' ఉమర్‌ఖయ్యామును తెలుగువారికి చిరస్మరణీయుణ్ణి చేసింది.

ఖయ్యామును తెలుగువారికి పరిచయం చేసిన గౌరవం శ్రీ బూర్గుల రామకృష్ణరావు గారికి కూడా దక్కింది. ఆదిభట్ల నారాయణదాసు, ఉమరలీషా, రాయప్రోలు సుబ్బారావు, కరుణశ్రీ మొదలైనవారు కూడా ఖయ్యాముపై వలపు వెల్లువలు పొంగించిన వారే.

శ్రీ బూర్గులవారు ఫర్దౌసి ఖయ్యాములనేకాక పారసీక వాఙ్మయ చరిత్రనే తెలుగు వారికి పరిచయం చేయాలని సంకల్పించారు. ఆ మహాసంకల్ప ఫలమే ప్రస్తుత పారసీక వాఙ్మయ చరిత్ర. ఇది ఆ వాఙ్మయానికి సర్వసమగ్రచరిత్ర కాకపోయినా రేఖామాత్రంగానైనా పారసీక ప్రముఖ కవుల సాహిత్య కృషిని కరతలామలకం చేస్తుంది.

తమ 'సంపాదకీయం'లో డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి గారు అన్నట్లు 'మన పొరుగుదేశమైన ఈరాన్ సాహితీస్వరూపాన్ని డా॥ బూర్గులవారు పరిచయం చేసినతీరు అపూర్వం'. సి. పి. బ్రౌను మహాశయుడు రచించిన "ఎ లిటరరీ హిస్టరీ ఆఫ్ పెర్షియా" గ్రంథాన్ని కూడా బూర్గులవారు యథావసరం పేర్కొనటం విశాలదృష్టితో బ్రౌన్ చేసిన ప్రపంచ సాహిత్యసేవను బూర్గులవారు గౌరవించారనటానికి గొప్ప గుర్తు.

బ్రౌనువలెనే బూర్గులవారు కూడా అనేకవిధాలైన పాలనా బాధ్యతలతో తీరికలేనివారైనా బహుభాషలలో పాండిత్యం గడించి బహుగ్రంథాలను రచించి భాషాసాహిత్యసేవ చెయ్యగలిగారు. రాశిలో వాసిలో భేదం ఉండవచ్చు.

తెలంగాణా జాతీయోద్యమ ప్రముఖులలో సురవరం ప్రతాపరెడ్డి గారు, కొండా వెంకటరంగారెడ్డిగారు, మందుముల నర్సింగరావుగారు, రావి నారాయణ రెడ్డిగారు మొదలైన వారిలో బూర్గులవారి ప్రత్యేకతను నిరూపించేవి వారి గ్రంథాలే. వాఙ్మయచరిత్రకారుడుగా కూడా బూర్గులవారిని పరిచయం చేసేందుకు ప్రకృత పారసీక వాఙ్మయచరిత్ర ఎంతైనా ఉపకరిస్తుంది.

ఈ గ్రంథమే కాక ఇటీవలనే 'బహుముఖప్రజ్ఞాశాలి బూర్గుల' (డి. రామలింగంగారి రచన) అనే గ్రంథాన్ని కూడా తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురించింది.

పరమప్రజ్ఞామూర్తి డా॥ బూర్గులవారికి తెలుగు విశ్వవిద్యాలయం సమర్పించిన చిరుకానుకలుగా ఈ గ్రంథాలను భావించవచ్చు.

పారసీక వాఙ్మయచరిత్రకు సమగ్రమైన 'సంపాదకీయం' సంతరించిన మహామనస్వి, మధురవచస్వి, సాహిత్యోద్యమచిరతపస్వి ఇటీవలనే కీర్తిశేషుడైన డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారికి కృతజ్ఞతాపూర్వకమైన నివాళి నిస్తున్నాం.

ఈ గ్రంథం వ్రాతప్రతిని మా కందించి ముద్రణకు అవకాశం కలిగించిన శ్రీ బూర్గుల రంగనాథరావు, లక్ష్మీనారాయణరావు (కీ॥ శే॥ బూర్గులవారి పుత్రులు) గార్ల ఔదార్యసౌజన్యాలకు అభినందనశతం.

ఈ ప్రచురణ భాషా సాహితీ జిజ్ఞాసువులకు ప్రమోదహేతువు కాగలదని నమ్ముతున్నాం.

ప్రకాశకులు
**తెలుగు విశ్వవిద్యాలయం**
ప్రచురణ విభాగం

హైదరాబాదు-4
ది. 6-6-1989

# మనవి

అస్మత్పితృపాదులు స్వర్గీయ డా. బూర్గుల రామకృష్ణరావుగారు "పారసీక వాఙ్మయ చరిత్ర"ను క్రీ॥ శ॥ 1920 ప్రాంతమున వారు బొంబాయి నగరంలో న్యాయవాద పరీక్షకు చదువుచూ, అక్కడి 'అన్జుమన్ ఇస్లామ్ హైస్కూలు'లో పారసీ భాషాధ్యాపకులుగా పనిచేస్తున్న కాలములో వ్రాసియుండిరి. అది కార ణాంతరాలవల్ల ఇంతవరకు అముద్రితంగానే ఉండిపోయినది. వారి స్వహస్త లిఖిత వ్రాతప్రతిని కొందరు విద్యాధికులు వివేచనాశీలురు— కీ॥ శే॥ ఆచార్య దివాకర్ల వెంకటావధానితో సహా చూచి, అది ఇంతవరకు ముద్రింపబడకుండుటకు తమ ఆశ్చర్య విచారములను తెలిపియుండిరి. ప్రాథమికోన్నత పాఠశాల నుంచి ఇంటర్మీడియేటు పరీక్షవరకు మా నాయనగారు పారసీని రెండవ భాషగా అభ్య సించి యుండుటే గాక ఆ భాషయం దభిమానము గలిగియుండినవా రగుటచే ఆ భాషా సాహిత్యాన్ని, దాని చరిత్రను అధ్యయనంచేసి ఈ సుదీర్ఘ వ్యాసమును వ్రాసియుంచుకొని యుండిరి. చాలాకాలంగా ఈ రచనను ప్రకటింపవలెనని నాకును తోచినది. ఇట్లుండగా ఇటీవల నా మిత్రులు సాహితీపరులైన శ్రీ డి. రామ లింగంగారిలో ఈ విషయం ప్రస్తావించగా, వారి సూచనమేరకు, నేనూ వారూనూ కలిసి ఒక రోజు తెలుగు విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులైన ఆచార్య తూమాటి దొణప్పగారిని సందర్శించి వారికి నావద్దనున్న వ్రాతప్రతిని చూపించితిమి. దానిని పరిశీలించి, విహితులు విబుధులునైన ఆచార్య దొణప్పగారు తమ విశ్వ విద్యాలయము తరపున దీనిని ప్రకటించుటకు సంతోషముతో అంగీకరించిరి. కావున వారికి నేనెంతో ఋణపడియున్నాను. వారి కివే నా సవినయ కృతజ్ఞతాభి వందనములను అర్పిస్తున్నాను.

అయితే ఈ సందర్భమున ఒకటి రెండు విషయములను ప్రస్తావించుట నా విధి యని తలంచినాను.

ఒకటి : మూలప్రతిలో కవుల కాలము జనన మరణాదుల సంవత్స రము తెలుపు సందర్భాల్లో కొన్ని చోట్ల కేవలం హిజ్రీ శకము, కొన్ని చోట్ల కేవలం క్రీ॥ శ॥, మరికొన్ని తావుల రెండు శకములు సూచింపబడినవి. కావున ఈ రెండు శకముల సమన్వయము చేసి ఏదో ఒకే శకమును బ్రాకెట్లలో వ్రాసినయెడల - ముఖ్యంగా క్రీ॥ శ॥ నే సూచించినచో - పఠితలకు సౌకర్యముగా నుండుననుకొంటున్నాను. ఈ శకసమన్వయము కొంచెము కష్టమైనా బొత్తిగా అసంభవము కాదని మనవి చేస్తున్నాను. హిజ్రీ శకము ఇస్లాం మతప్రవక్త మహమ్మద్ మక్కానుండి మదీనాకు వెళ్ళిన తేదీనుండి ఆరంభమైనది. అనగా సుమారు క్రీ॥శ॥ 622. అయితే కాలపరిణామముల వలన

వివిధ దశలలో ఇవే నిష్పత్తిలో(1-622)ఈ రెండు శకాలలో తేడా ఉండుట లేదు. క్రీ॥ శ॥ 622 నుండి 1920 వరకు అనగా దాదాపు ఈ పదమూడు శతాబ్దాలలో ఈ రెండు శకములలోని కాలభేదము 570 నుంచి 580 వరకు ఉన్నట్లు కన పడుచున్నది. ఆంధ్రపత్రిక విభవనామ పంచాంగములో క్రీ॥శ॥ 1988-89 సంవ త్సరము హిజ్రీశకము 1408-1409తో సమన్వయించబడియున్నది. కనుక హిజ్రీశకమే తెలుపబడిన చోట్ల సగటున 575 సంవత్సరాలు కలిపి క్రీ॥శ॥మును బ్రాకెట్లలో వ్రాసి CIRCA అని వేస్తే పాఠకులకు సహాయకారిగా ఉండునని తలుస్తున్నాను. ఉదాహరణకు '550 హిజ్రీ' అన్నప్పుడు 'క్రీ॥ శ॥ 1125 CIRCA' లేక 'A. D. 1125 CIR' అని సూచించవచ్చునేమో! దైవజ్ఞులు సిద్ధాంతులు నాతో ఏకీభవించక సరియైన ప్రత్యామ్నాయ మార్గము సూచించిన, నేను శిరసావహిస్తాను. సహృదయులైన పాఠకులు ఈ యంశముపట్ల శ్రద్ధ వహించగలరని ఆశిస్తున్నాను.

రెండవది : మా తండ్రిగారు క్రీ॥శ॥ 1920 ప్రాంతములో ఈ పుస్తకము యొక్క వ్రాతప్రతిని ప్రప్రథమంగా వ్రాసి దానిని మరల వారి జీవితకాలములో పరిష్కరించ లేదు. అందుచేత వారి "పారసీక వాఙ్మయ చరిత్ర" లోని 'నవయుగము' క్రీ॥శ॥ 1906 తోనే ప్రారంభమగునట్లు వారే తమ అధ్యాయ శీర్షికలో సూచించినారు. కనుక ఆ 'నవయుగము'వారు వ్రాసిన కాలము 1920 వరకే దీనిలో కలదని అనుకోవలసి వస్తుంది. అందుచేత ఈ గ్రంథములో 1920-1989 వరకు అనగా దాదాపు ఈ 70 సంవత్సరాల కాలంలో పారసీక వాఙ్మయము సాహితీ ప్రక్రియలు భాషావిధానము లెట్లున్నవో, ఎట్టి పరిణామము జెందినవో నేటి పారసీక పండితులు, పరిశోధకులు మాత్రమే తెలుపజాలుదురు.

చివరగా నావద్దనున్న వ్రాతప్రతిని ప్రెస్ కాపీగా (Press Copy) తయారు చేసి Xerox చేయించి ఇచ్చిన సహృదయులు డా॥ మద్దాలి నాగ భూషణరావు గారికి (కాకతీయ విశ్వవిద్యాలయము) నా కృతజ్ఞతలు తెలుపుచూ, ఈ గ్రంథము పారసీక వాఙ్మయమును గూర్చి చిహ్నామాత్రముగానైన పాఠకులకు తెలిపిన, విశేషంగా భాషా చరిత్రలలో అభిరుచి కలవారికి ఈషణ్మాత్రమైన సహాయపడిన మా నాయన గారి కృషిఫలించినట్లే అని భావిస్తూ మరియొకసారి గౌరవనీయులైన ఆచార్య దోణప్ప గారికినీ, తెలుగు విశ్వవిద్యాలయ ఇతర సంబంధిత అధికారులకూ నా కృతజ్ఞత లందజేస్తూ శలవు తీసుకుంటున్నాను.

హైదరాబాదు
మార్చి 1989.

ఇట్లు
బూర్గుల రంగనాథరావు

# విషయసూచిక

# సంపాదకీయం

దాదాపు ఎనిమిది నూరేండ్ల నుంచి భారతీయులకు అత్యంత సన్నిహితంగా మెలిగిన భాష పారసీ. చారిత్రిక, సాంస్కృతిక పరిస్థితుల ప్రాబల్యం వల్ల ఒక భాషకు మరొక భాషతో సంబంధం ఏర్పడుతుంది. కొన్ని సందర్భాల్లో ఒక భాషకు అనేక భాషలతో అతి మాత్రమైన సంబంధం ఏర్పడుతుంది. అన్యభాషా సంపర్కం లేకుండా ఏ భాషకూడా సమృద్ధం కాదు. స్వతంత్ర భాష ఉండదు. ఒకవేళ ఉన్నా పరిమిత కాలానికీ, పరిమిత ప్రాంతానికీ, పరిమిత ప్రజా సమూహానికీ ఉంటుంది. జనం ఉన్న చోటినుంచి మరో చోటికి తరలి పోయే అవసరం ఏర్పడితే ఆ జనం మాట్లాడే భాష కూర్పులకూ, చేర్పులకూ లోనుగాక తప్పదు. కొన్ని సందర్భాల్లో భాషా స్వరూపంలో వచ్చే మార్పులు ఆ భాషనే లేకుండా చేస్తాయి.

అతి ప్రాచీన చరిత్ర మన భారతదేశానికి ఉన్నది. ఈ దేశానికి క్రీస్తు పూర్వం కొన్ని నూర్ల ఏండ్ల నుంచి పరదేశాలతో, పర సంస్కృతులతో సంబంధం ఉంది. ఇప్పటి భారత దేశం నిన్నటి పురాణాల్లో పేర్కొనబడిన జంబూద్వీపం అనే విశాల భూభాగంలోనిది. నిన్నటి చరిత్రలో మన దేశపు-టెల్లలు ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించే విధంగా ఉంటాయి. అఫ్ఘనిస్తాన్, ఈరాన్, నేపాల్, టిబెట్టు, బర్మా, సింహళం ఇంకా ప్రాచ్య ద్వీపాలు అన్నీ జంబూద్వీపం లోనివే. భరత ఖండానికి సంబంధించినవే. మన పురాణేతిహాసాలలో ఈ దేశాల ప్రసక్తి అనివార్యంగా వస్తుంది.

పారసీక దేశం, పర్షియా, ఫారస్ ఇప్పటి ఈరాన్‌కు నామాంతరాలు. ఈరాన్ మన పొరుగు దేశం. ఈరాన్ భాష ఫారసీ. అయితే పారసీ ఈరాన్‌కు మాత్రమే చెందిన భాషకాదు. ఇరానియా పీఠభూమి అంతటా విస్తరించిన భాష. మధ్య ప్రాచ్య దేశాల్లోనూ, సోవియట్ రష్యా పశ్చిమ ప్రాంతాల్లోనూ, పారసీ ప్రత్యక్షంగా, పరోక్షంగా తన ఉనికినీ తన ఆనవాళ్ళనూ వ్యక్తం చేస్తూఉంటుంది. పారసీ శబ్దజాలం, పారసీ ఛందస్సులు, పారసీ జానపద గాథలు, పారసీ జనుల

విశ్వాసాలు మధ్య ప్రాచ్యంలోని పలుదేశాల్లో ప్రచారంలో ఉన్నవి. పారసీ ఇండో-యూరోపియన్ భాషా కుటుంబానికి చెందినది. క్రీస్తుపూర్వం ఇంచుమించు వెయ్యి సంవత్సరాల క్రితం జొరాస్టర్ 'జిందావెస్తా' అనే గ్రంథం ద్వారా తన మతాన్ని ప్రచారం చేసినాడు. ఆ గ్రంథంలో ఐతిహ్యాములు, దైవస్తుతి గీతాలు, ప్రార్థనలు, ఉపదేశాలు ఉన్నవి. జిందావెస్తాలోని భాషకూ, సంస్కృతానికీ చాలా పోలికలు ఉండటం గమనింపదగిన విషయం. నేటి పారసీ భాషలో కూడా అనేక పదాలకు సంస్కృత పదాలతో సామ్యం మనకు కనిపిస్తుంది. ఈరాన్‌లోని పలు నగరాల నామాలు సంస్కృత భాషాగతములే. బౌద్ధుల కాలంలోనూ ఈరాన్‌తో మనకు ఎన్నో అంశాల్లో సామ్యం ఉండేది.

పారసీ భాషా వాఙ్మయాలతో కడచిన శతాబ్దాల్లో భారతదేశములో సృజియింపబడిన పారసీ సాహితితో తలస్పర్శి పరిచయం లేకపోతే భారతేతిహాసాన్ని సమగ్రంగా అవగాహన చేసుకోవడం కష్టసాధ్యమే. పన్నెండవ శతాబ్ది నుంచి పారసీ భాషతో మనకు సంబంధం మరీ దగ్గరైంది. అప్పటినుంచి పశ్చిమ దిశనుంచి మనదేశానికి యాత్రికులుగానో, శత్రువులుగానో వచ్చినవారిలో పలువురు పారసీ భాషవారే. పన్నెండో శతాబ్దినుంచి భారతదేశంపై దండెత్తి ఇక్కడ స్థిరపడిపోయిన ముసల్మాను ప్రభువులు ప్రభుత్వభాషగా పారసీనే చెలామణి చేసినారు. పాలకులభాష పాలితులభాషను ప్రభావితం చేయగలుగుతుంది. ఈ యాథార్థ్యాన్ని అందరూ అంగీకరిస్తారు. ఏడవ శతాబ్దంలో అరబ్బులు ఈరాన్ దేశాన్ని ఆక్రమించుకొని తమ భాషను రుద్దడానికి ప్రయత్నాలు చేసినారు. కాని పారసీలోని సహజసౌందర్యం నాటి దినాల్లో ఆసియా అంతటా పరిమళించింది. అరబ్బులు ఇస్లాం మతాన్ని, ఆ మతభాష అయిన అరబ్బీని ఈరాన్‌లో ఎంత ప్రచారం చేసినా, ఇస్లాం గట్టిపడింది కాని అరబ్బీకి అంత ప్రాచుర్యం రాదు. బ్రిటిషువారు భారతదేశాన్ని హస్తగతం చేసుకునేవరకూ ముస్లిం పరిపాలకుల పోషణలో పారసీ భారతదేశంలో, విశేషించి ఉత్తరభారతంలో బాగా వ్యాపించింది. హర్యానా, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, పంజాబు, మధ్యప్రదేశ్ రాష్ట్రాలలో అనేక నగర, గ్రామాల, వీథుల పేర్లు పారసీవే. ఎన్నో కుటుంబాల పేర్లు, వ్యక్తుల పేర్లు పారసీవే. హిందీ పండితుల రచనల్లో ఎలా ఉన్నా, ఉత్తరాది రాష్ట్రాల్లో పారసీ ముద్రతో ఉన్న ఉర్దూ జనబాహుళ్యంలో ప్రచారంలో వుంది. ముస్లి

మేతరులు ఎందరో పారసీలో సాహితీ సృష్టి చేసినారు. చరిత్రకూ, మతానికీ శాస్త్రాలకూ సంబంధించిన అనేక గ్రంథాలు భారతదేశంలో పారసీ భాషలో పుట్టుకొచ్చినవి. అవిభక్త భారతదేశాన్ని దృష్టిలో పెట్టుకొని పరిశీలిస్తే ఈరానీ తర్వాత పారసీ భారతదేశంలోనే బాగా ఎదిగింది. భారతదేశంలో అన్ని భాషల్లోనూ పారసీ పదజాలం, ఉచ్చారణాభేదాలతో, అర్థ భేదాలతో చొచ్చుకొని పోయింది. ఈనాడు భారతదేశంలోని జానపదుల భాషలో, శిష్టుల భాషలో పారసీనుంచే వచ్చి స్థిరపడిపోయిన కొన్ని పదాలకు ప్రత్యామ్నాయంగా దేశీయ పదాలు లేకుండాపోయినవి. హిందూ ప్రభువులు కూడా పారసీని ఆదరించి లబ్ధిని పొందినారు. 'హిందూస్తాన్' అని మనదేశానికి వచ్చిన పేరు పారసీ భాషదే. గోలకొండ, ఆదిల్‌షాహీ, ఆసఫ్జాహీ ప్రభువుల పోషణలో పారసీ సాహితి అభ్యున్నతిని పొందింది. గోలకొండ ప్రభువుల్లో పలువురు పారసీ, అరబ్బీ భాషల్లో నిష్ణాతులు పారసీలో దక్కనీ (ఉర్దూ)లో కవితలను వెలయించిన వారు, నిజాంనవాబు మహబూబ్ అలీఖాన్, ఉస్మాన్ అలీఖాన్ పారసీ ఉరుదు కవితలను వెలయించినవారే. నిజాం దివాను సర్ కిషన్‌ప్రసాద్ గొప్ప పారసీ విద్వత్కవి. గొప్ప గొప్ప ఉర్దూ కవులందరూ పారసీలో కూడా కవితలు చెప్పి విద్వత్కవులుగా ప్రసిద్ధి వడసినారు. అచ్చమైన భారతీయభాషలు ఉర్దూ, కాశ్మీరీ, సింధి, పంజాబీ భాషల్లో అతివేలమైన, ప్రామాణికమైన పాండిత్యం సంపాదించాలంటే నేటికీ పారసీ నేర్చుకోనిదే సాధ్యంకాదు. విశ్వవిద్యాలయ స్థాయిలో పారసీ భాషా సాహిత్యాధ్యయనం మనదేశంలో ఇప్పటికీ సాగుతున్నది.

పారసీ సాహితి, ఛందస్సు, కవి సమయాలు, ఉపమా సామగ్రి వంటివి హిందీ,ఉర్దూ సాహిత్యాలను విశేషంగా ప్రభావితంచేసినవి.మొన్నటి తరంలోఉత్తర భారతంలో, దక్షిణాన తెలంగాణంలో, మహారాష్ట్రలో సంస్కృతం, దేశభాషలతో పాటు పారసీ కూడా నేర్చుకునేవారు. పండిత్ మోతీలాల్‌నెహ్రూ, జవహర్‌లాల్ నెహ్రూ, రాజా రాంమోహన్‌రాయ్ ఇంకా ఎందరో చిన్నతనంలో పారసీ చదువుకున్నవారే. గత శతాబ్దం చివరి రోజుల్లో తెలంగాణంలో ఆసఫ్జాహీల పరిపాలనలో పారసీ ప్రభుత్వ భాషగా ఉండటంవల్ల తెలంగాణా ప్రముఖుల్లో, ముస్లిములు సరే, హిందువులు కూడా పారసీని చిన్నతనంలో చదువుకున్నవారే. మన తెలంగాణా జాతీయోద్యమ ప్రముఖులు మందుముల నర్సింగరావు,

బూర్గుల రామకృష్ణరావు, కొండా వెంకటరంగారెడ్డి, సురవరం ప్రతాపరెడ్డి చిన్నతనంలోనే పారసీ చదువుకున్నవారు. ఆసఫ్షాహీలకు పూర్వం గోలకొండ ప్రభువుల అధికారులు హిందువులైనా- అక్కన మాదన్నల వంటివారు, కంచర్ల గోపన్న వంటివారు (ఈయనే భక్తరామదాసు అని ప్రతీతి.పారసీ భాషా నిష్ణాతులే.

పారసీతో తెలుగువారికి పదునాల్గవ శతాబ్దినుంచి పరిచయం, అభిని వేశం ఉండేవని తెలుగు సాహిత్య చరిత్ర చెప్పుతున్నది. ఉర్దూతో సంబంధం ఏర్పడి కేవలం నూరేండ్లు కాలేదు. ఫారసీతోనే తెలుగు వారికి సంబంధం.నేటి వ్యవహార భాషలో పారసీ శబ్దజాలం వేల సంఖ్యలో ఉందంటే అబ్బురపాటు అనావశ్యకం. నూరేండ్ల క్రింద వచ్చిన 'కన్యాశుల్కం' నాటకంలో పారసీ మాటలు నూటికి మించినవి.

నిన్నటి తరంలో మన తెలుగు పడింతులు కొందరు పారసీ నేర్చుకొని పారసీలోని ఉత్తమ కవితలను, రచనలను నేరుగా తెలుగులోనికి దించినారు. ఆదిభట్ల నారాయణదాసు, దువ్వూరి రామిరెడ్డి, ఉమర్ అలీషా, బూర్గుల రామ కృష్ణారావు వంటి వారిని పేర్కొనవచ్చు.

పారసీ ఛందస్సులకు, ప్రక్రియలకు తెలుగు వేషం వేసి నూత్న ప్రయోగాలు చేసి రసికులను అలరిస్తున్నారు దాశరథి, నారాయణరెడ్డి వంటి ఆధునిక కవిసత్తములు.

మన స్వాతంత్ర్య సమరం ముమ్మరంగా జరుగుతున్న రోజులలో బ్రిటిషువారినీ, సంస్థానాధీశులనూ ఎదిరించిన వీర యోధులలో పలువురు మంచి పాండితీ ప్రాగల్భ్యంతో ప్రకాశించిన వారు. వారు సమరంలో దూకకపోతే సాహిత్య కేదారాలనూ, శాస్త్ర సాహితినీ పండించే కృషీవలురుగా రాణకెక్కగలిగేవారు. దాదాపు జాతీయోద్యమంలోని అగ్రేసరులందరూ మూడు నాల్గు భాషలతో మంచి పరిచయం సంపాదించుకున్నవారు. తిలక్, గోఖలే, టాగూర్, గాంధీ, నెహ్రూ, సుభాష్, రాజాజీ, ప్రకాశం, పటేల్, సరోజినీదేవి వంటి ప్రముఖులు రెండు భాషలలో చక్కని పరిచయం సంపాదించి యావద్భారత ప్రజావళిలో ప్రాంతీయ భాషా మర్యాదలను దాటి తమ భావాలను

వ్యక్తం చేసేవారు. 'నాభాషే గొప్పది', 'చిన్ని నా బొజ్జకు శ్రీరామరక్ష', 'నా భాష తప్ప మరో భాష నాకెందుకు?' వంటి భావాలకు ఆనాడు చెల్లుబాటు ఉండేది కాదు. ఆ కోవలోనివారే డా. బూర్గుల రామకృష్ణారావుగారు. ఆయనకు తెలుగుతో బాటు సంస్కృతం, పారసీ, ఉర్దూ, హిందీ, ఇంగ్లీషు, కన్నడం, మరాఠీ భాషలు వచ్చేవి. ఆయా భాషల వారితో మనసువిప్పి మాటాడి ఉత్తమ సంస్కృతిని అలవరచుకున్న మనీషి ఆయన. పారసీ కవుల రచనలను తెలుగువారికి అందించాలన్న మహత్వాకాంక్షతో ఆయన ఉమర్ ఖయ్యాం, సరమద్ వంటి మహాకవుల రచనలను తెలుగువారికి పరిచయం చేసినారు. న్యాయశాస్త్రంలో నిష్ణాతులై, స్వాతంత్ర్య సమరయోధులై, పరిపాలనాదక్షులై, బహుభాషా కోవిదులై, ప్రజా జీవితంలో అనేక సమస్యలతో సతమతమవుతూనే సాహితీ సృష్టి చేయగలిగిన అరుదైన మనీషులు.శ్రీ రామకృష్ణారావు.

భారత ఇతిహాసాన్నీ, భారత జీవితాన్ని, భారతీయ సాహిత్యాన్నీ అతి వేలంగా ప్రభావితం చేసిన పారసీ వాఙ్మయ చరిత్రను తెలుగువారికి అందించాలని ఆయన ఈ 'పారసీ వాఙ్మయ చరిత్ర'ను రచియించినారు. భాషావైమనస్యాన్నీ, భాషా దురభిమానాన్నీ తొలగించడం ఉత్తమ రచయిత లక్ష్యం కావాలె. నిన్నటి భారతీయ రచయితల్లో ఈ మహదాశయం ఉన్నందుకే వారి సాహిత్యం ద్వారా దేశాన్ని ఒకే జాతిగా, ఒకే ఆలోచనగా,ఒకే ఊపిరిగా తీర్చిదిద్దగలిగినారు. రచయితకూపస్థ మండూకం కాకూడదు. రచయిత తన ఊరనీ, తనప్రాంతమనీ తలపోయకూడదు.తన గ్రామంలో తనకు గౌరవంరావాలని కోరుకునేవారు గ్రామ సింహాలే. 'వసుధైక కుటుంబకమ్మ'నే భావవ లేనివాడు రచయిత కాకూడదు. అట్టివారి రచనలకు ప్రాచుర్యం కలుగకూడదు. నన్నయభట్టు సహాధ్యాయి నారాయణభట్టు. అష్టభాషా సుకవి రాజశేఖరుడు, శ్రీనాథుడు, రాయలు, పాల్కురికి సోమనాథుడు, నన్నెచోడుడు, వేదంవారు, వేటూరి ప్రభాకరశాస్త్రి, చిలుకూరి నారాయణరావు, పుట్టపర్తి నారాయణాచార్యులు వంటివారి బహుభాషా పాండిత్యం సాహితిని ఎంత సమృద్ధం చేయగలిగిందో!

రామకృష్ణారావుగారి సాహిత్య వ్యక్తిత్వంలోని వైశిష్ట్యం, బహుభాషా పాండిత్యం, సువిశాల దృక్పథం. సాహిత్యం, అంతర్జాతీయోపాసనమం అని నమ్మిన రచయితలు వారు.

'పారసీక వాఙ్మయ చరిత్రము' ఆయన వేసుకున్న ఒక బృహత్ ప్రణాళిక సూచిస్తున్న ప్రతీకలాగుంది. పారసీకీ, భారతీయ భాషలకూ ఉన్న సంబంధాన్ని గూర్చికాని పారసీ వాఙ్మయం భారతీయులకు అందించిన విలువలను గూర్చికాని భారతీయ రచయితలలో పారసీ సాహితిని సృష్టించిన వారిని గూర్చిగాని ఈ చిన్న పుస్తకంలో వివరాలు లేవు. అమీర్ ఖుస్రూను గూర్చి మాత్రం గొప్పగా విరచించి ధన్యులైనారు.

మన పొరుగుదేశం ఈరాన్‌లోని సాహితీ స్వరూపాన్ని డా॥ బూర్గులవారు పరిచయం చేసినతీరు అపూర్వం. కవితా సృష్టిలో, దార్శనిక భావనా విలసనంలో, నైతిక భావనిరతిలో, అభివ్యక్తీకరణంలో, ప్రణయ వర్ణనంలో, ప్రకృతి పరిశీలనంలో పారసీ కవులు సాధించిన సిద్ధులను సోదాహరణంగా పరిచయం చేసిన తీరులో ఈ పుస్తకం హృద్యంగా ఉంది.సరళమైన భాషలో ఉంది. డా॥ బూర్గుల వారు ఉమర్‌ఖయ్యాం రచనలకు స్వీయానుసరణాన్ని ప్రదర్శించినారు.

ఈరాన్‌ను ధన్యంచేసిన కవులను, రచయితలను ఎంపిక చేయడంలోనూ డా॥ బూర్గుల ఎంతో మెలకువను చూపినారు.పారసీ కవితలోని ప్రణయ మాధురీ మహిమను చూపించి పఠితృలోకాన్ని ఉర్రూతలూగించవచ్చు. కాని ప్రణయంతో పాటు తాత్త్విక చింతను ప్రస్తుతించి పారసీ సాహితి గాంభీర్యాన్ని సువ్యక్తపరచినారు. డా॥ బూర్గుల కేవలం ఒక సాహిత్య జిజ్ఞాసువువలె, కవితాప్రియునివలె కాక ఒక దార్శనికునివలె ఈ వాఙ్మయచరిత్రమును తీర్చిదిద్దినారు. ప్రసక్తానుప్రసక్తంగా ఈరాన్, భారతదేశాల్లో జరిగిన కొన్ని చారిత్రిక సంఘటనలనూ, ఈరాన్ ప్రజల చిత్తవృత్తులనూ పారసీ సాహిత్య ప్రక్రియల స్వరూప స్వభావాలనూ పరిచయం చేసినారు. ఒక భాషలో వెలసిన సాహిత్య స్వరూపాన్ని వ్యాఖ్యానిస్తున్నపుడు ఆ సాహిత్యం అందుకున్న ఉన్నత ప్రమాణాలనూ, ప్రసాదించిన తాత్త్విక స్వరూపాన్ని ప్రముఖంగా ప్రదర్శించాలి. అందుకే కవులనూ, కావ్యాలనూ పేర్కొని వివరించే పద్ధతికి స్వస్తి చెప్పి భావగాంభీర్యాన్నీ, సాహిత్య వ్యక్తిత్వాన్నీ, సమకాలిక ప్రజా జీవితాన్ని సుసంపన్నం చేసిన వైనాన్ని ఈ పుస్తకంలో మనం దర్శించగలుగుతాము.

"ఈరాన్ దేశమునందును, భారతదేశము నందును గత ఆరు శతాబ్దముల నుండియు అమీర్ ఖుస్రూవంటి విద్యావిశారదులు, భాషాభిజ్ఞులైన కవులు ముగ్గురు నలుగురు కంటె ఎక్కువ జన్మించలేదని అనినచో నతిశయోక్తి గాదు."

ఈ వాక్యము చాలు. బూర్గుల వారి ఆలోచనా సరళిని అవగతం చేసుకోవడానికి. అనేక భాషలలో పాండిత్యం ఉన్నవారు గాని ఈ మాట అనలేరు. "కవిత్వము, పాండిత్యం, వైశ్వైకాత్మ భావన ఒక దేశం సొత్తుగాదు. ఉత్తమ సాహితికి ఎల్లలు లేవు. కాలావధులులేవు. తనవంటివాడు, తనకు సమాన ధర్ముడు విపుల ప్రపంచంలో అనంతకాలం, ఎక్కడైనా,ఎప్పుడైనా పుట్టకపోతాడా" అన్న భవభూతి హృదయం ఎవరికి ఉంటుందో వారు మాత్రమే సాహిత్య చరిత్ర రచనకు పూనుకోవాలి అన్న యాథార్థ్యాన్ని భంగ్యంతరంగా ఈ చిన్న పుస్తకంలో చూపించినారు బూర్గుల వారు.

తమకు అలవడిన పద్యరచనా సౌష్ఠవాన్ని ప్రదర్శించుకొన గలిగినారు అనువాదాలను ఉదాహరిస్తూ.

డా॥ బూర్గుల వారు తమ బహు భాషాభినివేశాన్ని దేశ సమైక్య శక్తులను బలపరచడానికి వినియోగించి లోకోత్తరమైన, అభిలషణీయమైన, అనుకరణీయమైన, విద్వజ్జన రంజకమైన, సాహితీ కృషి బహుధా ప్రశంసా పాత్రం.

ఈ పుస్తక ప్రచురణకు ఉద్యమించిన తెలుగు విశ్వవిద్యాలయాధికారులు, విశేషించి ఉపాధ్యక్షులు ఆచార్య తూమాటి దొణప్ప గారు అభినందనీయులు.

ఫారసీతో కొంత పరిచయం, ఉర్దూలో కొంత అభినివేశం ఉన్న నాకు ఈ పుస్తకానికి సంపాదకీయం వ్రాసే సదవకాశాన్ని ప్రసాదించిన విశ్వ విద్యాలయ నిర్వాహకులకు కృతజ్ఞుడను.

నేను విద్యార్థిగా ఉన్నప్పుడు డా॥ బూర్గుల వారి ప్రసంగములను విన్నాను. ఆయన ఉత్తమ సాహిత్య సంస్కారాన్ని చవిచూసినాను. ఈరాన్ నుంచి వచ్చిన పత్రికా విలేఖరులతో ఆయన ఫారసీలో సంభాషించినారన్న వార్త పత్రికల్లోచదివి ఎంతో సంతోషాన్ని ఆశ్చర్యాన్ని అనుభవించిన సందర్భం నాకిప్పటికీ జ్ఞాపకం ఉంది. ఆయన వ్రాసిన సాహిత్య వ్యాసాలనూ, కవితలనూ చదివి లాభపడిన నావంటి వానికి ఈ అవకాశం లభించినందుకు ఎంతో తృప్తిగా ఉంది.

బహు భాషలదేశం భారతదేశం. ఈ దేశానికి నాయకత్వం వహించ దలచినవారు నాలుగైదు భాషలనైనా నేర్చుకోవాలన్న పాఠాన్ని చెప్పిన డా॥ బూర్గుల రామకృష్ణరావు గారు నేటి తరానికి ఆదర్శపాత్రులు.

23-2-1989<br>హైదరాబాదు

డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి<br>ఎం.ఎ. పి.హెచ్.డి.

# పారసీక వాఙ్మయ చరిత్ర

## ప్రవేశిక

'పర్షియా', 'పర్షియన్' అను పదములకు విదేశీయుల వాడుకలో వాటి మూలార్థమున కంటె విస్తృతమైన అర్థము కలదు. పర్షియన్‌లు స్వయముగా తమను 'ఈరానీ' లనియు, దేశమును 'ఈరాన్' అనియు నిర్దేశించుకుంటారు. నిజముగా ఈరాన్ దేశము యొక్క ఒక ప్రాంతమునకు మాత్రమే 'పర్సిన్' లేక 'పర్స్' అని పేరు. ఇది ఈరాన్ దేశము యొక్క అనేక ప్రాంతములలో నొకటి. కాని ఆ దేశమును పరిపాలించిన సుప్రసిద్ధ 'అఖిమీనియన్' (Achaemenian) మరియు 'సాసానియన్' (Sasanian) అను రాజవంశములీ ప్రాంతమునకే చెందినవగుటచే నీ ప్రాంత్రము యొక్క పేరు సుప్రసిద్ధమై దేశమున కంతకును అన్వర్థముగా రూఢియైపోయినది. ఆంగ్లులు, సాక్షన్‌లు (Saxons) జ్యూటులు అను మూడు తెగలవారు కలిసిన వారిని ఆంగ్లేయులను విఖ్యాత నామము కలిగినట్లు పార్థియా, మీడియా, 'పర్గిసు' లేక 'పర్సి' అను మూడు ప్రాంతముల ప్రజలకందరికీ 'పర్షియన్'లను నామము రూఢియైనది. ఆ విధముగానే ఈ మూడు ప్రాంతముల కలయికచే కలిగిన బాష 'పర్షియన్' భాషయని గుర్తింపబడుచు వచ్చినది. ఈ పదములోని ప్రథమాక్షరము 'ప' కారము. కాని అరబ్బీ భాషలో 'ప' కారము లేనందున ముస్లిం ఆక్రమణానంతరము 'ప' కారమును అరబ్బీలోని అక్షరమగు 'ఫ' తో మార్చి ఆ దేశమును 'ఫర్స్' లేక 'ఫారిస్' అనియు, భాషను 'ఫార్సీ' అనియు ఉచ్చరించడము ప్రారంభమై వాడుకలోకి వచ్చినది.

ఈనాటి 'ఫార్సీ' భాష క్రీ. పూ. 550 నుండి ఆ దేశమును పరిపాలించుచున్న అఖిమీనియన్ వంశీయులను రాజుల కాలములో శాసనములందు ప్రయోగింపబడిన భాషకు సూటిగా సంతానమని చెప్పవచ్చును. సైరసు (Cyrus), డేరియసు (Darius) లేక వారా మున్నగు సుప్రసిద్ధ రాజులు మాట్లాడు

చున్నట్టియు, వారి యాజ్ఞానుసారము చెక్కబడిన బెహిస్తున్ (Behistun) లేక బీస్తూన్, నక్షెరుస్తం (Naqshe Rustam) పర్సిపోలీస్ (Persi Polis) మున్నగు శిలా శాసనము లందుపయోగింప బడినట్టి భాష నేటి పారసీ భాష యొక్క ప్రాథమిక స్వరూపమనియు, అందువల్ల ఈ బాష యొక్క ప్రాచీనత (2500) రెండువేల ఐదువందల సంవత్సరముల పరిమితి కలదనియు పరిశోధ కుల యభిప్రాయము. ఐనను ఈ ప్రాచీన చరిత్ర, మధ్యకాలములో గ్రీకులు అరబ్బులు ఆక్రమించుకొని పరిపాలించు కాలములందు విచ్ఛిన్నమైనందున అసంపూర్ణమై యున్నది. విచ్ఛిన్నమైన ఈ చరిత్రకాలము క్రీ. పూ. 330 నుండి క్రీ॥శ॥ 226 వరకు అలెగ్జాండరు దండయాత్రతో ఆరంభమై పార్థియన్ వంశీయరాజులు సాసానీ రాజులచే పరాజితులగువరకు గడచిన ఐదున్నర శతాబ్ద ములు. రెండవ వెలితి కాలము అరబ్బుల(ముస్లింల) ఆక్రమణతో (క్రీ.శ. 635) ఆరంభమై దాదాపు 250 సంవత్సరముల వరకు, అనగా పర్షియాకు చెందిన తాహెరీ, సఫరీ, సామానీ వంశీయులగు రాజులు బాగ్దాదు (Baghdad) రాజ ధానిగా పరిపాలించు ఖలీఫాల (Caliphs) సామంతత్వమును నామమాత్రమ వశిష్ట మొనర్చి స్వయంగా అధికారములను స్వీకరించువరకు, పారసీకులు విదేశీయ దాస్య శృంఖలాలచే బంధింపబడిరి. ఈ రెండు కాలములలోను పారసీక వాఙ్మయ చరిత్ర విచ్ఛిన్నమైనది. కాని క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దము నుండి తిరిగి పునరుద్ధరింపబడుచు నిరంతరాయముగా నేటివరకు ఉన్నత శిఖరాల నందుకొనుచున్నది. గ్రీకుల యాక్రమణము వల్ల ఈరాన్ దేశీయుల భాషా సాంస్కృతిక ప్రమాణము లంతగా దెబ్బ తినలేదు. కాని ముస్లిం అరబ్బుల యాక్రమణ పరిణామముగా వారి మత సంప్రదాయములు గాఢముగా చిల్చబడి మహత్తరములైన సాంస్కృతికములగు మార్పులకు లోనైనవి. అప్పటి నుండియే పర్షియా దేశపు ప్రజానీకమందలి అధిక సంఖ్యాకులు యిస్లాం మతమును స్వీక రించుటయే గాక తమ ప్రాచీనలిపిని కూడా త్యజించి అరబ్బీ లిపిని స్వీకరించిరి. యథార్థముగా విచారించినచో ఆధునిక ఫారసీ భాషా చరిత్రము క్రీ. శ. తొమ్మి దవ శతాబ్దమునుండియే ఆరంభమగుచున్నది.

ఫారసీ భాషయొక్క చరిత్రమును మూడు యుగములుగా విభజింప వచ్చును. 1. అఖీమినియన్ యుగము (క్రీ పూ. 550-330). ఈ యుగము యొక్క వాఙ్మయము ఆ కాలపు రాజ శాసనముల రూపములో కనపడుచున్నది.

400 పదముల కంటె అధికమగు పదజాలము లభించదు. ఇదియే ప్రాచీన ఫారసీ (Old Persian) అని గుర్తింపబడు చున్నది. 2 రెండవయుగము సాసాని యుగము (క్రీ. శ. 226-652). ఈ యుగపు వాఙ్మయమునందు శాసనములు, ముద్రలు, నాణెములు మున్నగునవి కాక దాదాపు Old Testament కు సమాన ప్రమాణము గల సాహిత్యము చేరియున్నది. ఈ సాహిత్యమంతయు జొరత్రుష్ట (Zorastrian) మతమునకు చెందినదే. ఈ వాఙ్మయము యొక్క భాష ఈనాటి ఫారసీ భాష నుండి అరబ్బీ భాగమును విడదీసినచో మిగిలినది దాని పూర్వరూపమని చెప్పవచ్చును. ఇదియే పహ్లావీ (Pahlawi) లేక మధ్య కాలపు ఫారసీ (Middle Persian) యని వ్యవహరింపబడుచున్నది. ఈ పహ్లావీ భాషయొక్క లిపి వేరు. అరబ్బుల పరిపాలనలోను ఈ లిపి నాణెముల పైనను మరికొన్ని యవసరముల కొరకును వాడబడుచుండెడిది. కాని ఈ భాషా లిపులు రెండును నేటికి వేయి సంవత్సరముల నుంచి వాడుకలో లేక అంతరించి పోయినవి. 3. మూడవయుగము మహమ్మదీయ యుగము (క్రీ.శ. 900 నుండి నేటివరకు) ఇదియే ఆధునిక ఫారసీ భాషయొక్క యుగమని చెప్పవచ్చును.

## ఫారసీ కవితయొక్క ప్రారంభ యుగము

అరబ్బుల విజయానంతరం (క్రీ.శ. 641-651) ఇరాన్ దేశస్థులందరును ఇస్లాం మతమును స్వీకరించిన పిదప అరబ్బీ భాషయే రాజభాషగను, సాహిత్య భాషగను పరిగణింపబడియెను. ఇస్లాం మతమును స్వీకరించిన తరువాత సుమారు క్రీ.శ. 8 వ శతాబ్దమున పర్షియా దేశపు క్రొత్త ముసల్మానులు తమ దేశభాషను అరబ్బీ లిపియందు వ్రాయుట కారంభించి యుందురు. తొలుదొల్త వీరు కేవలము క్రొత్త మత సూత్రములను, ధార్మికోపదేశములను పొందుపరచి యుందురు. అరబ్బీ గ్రంథకర్తల ప్రాచీన వాఙ్మయమందు దక్కడక్కడ ఫారసీ వచనముల ముక్కలతికింపబడి యున్నవి. ఉపలబ్ధములగు ప్రాచీన గ్రంథము లలో 'తబరీ' (Tabari) యను అరబ్బు చరిత్రకారుని చరిత్రగ్రంథము యొక్క ఫారసీ తర్జుమా ప్రథమ మన్సూర్ కొరకు గావింపబడినది (క్రీ.శ. 963) ఒకటి. రెండవది అరబ్బీ (Materia Medica) వైద్య గ్రంథము యొక్క యనువాదము. మూడవది ఖురాన్ షరీఫ్ యొక్క ప్రాచీన వ్యాఖ్య యొక్క రెండవ భాగము. ఇవియే ముఖ్యములైన గ్రంథములు.

ఫారసీక వాఙ్మయ చరిత్రమందు అరబ్బుల యొక్క ఆక్రమణానంతరము రెండువందల సంవత్సరముల ఖాళీ కనపడుచున్నదని తెలిపియుంటిమి. అరబ్బుల విజయము, ఇస్లాం ప్రచారము నీ రెంటితో నీ ఖాళీ కెట్టి సంబంధము గలదను విషయము చర్చనీయము. దౌలత్ షాః సమర్ఖందీ యొక్క 'తజుకిరా' యను ప్రాచీన గ్రంథమున అబ్దుల్లా బిఙ తాహరు ఈరాఙయొక్క గ్రంథముల నన్నింటిని కాల్పించి వేసినందున తిరిగి సామానీ రాజుల కాలమువరకు ఫారసీ కవితకు స్థానము దొరకలేదని వ్రాయబడియున్నది. బహుశః 1284 హిజ్రీలో నాసరుద్దీన్‌షాఃఖాచారు కాలమున హిదాయత్ ఖులీఖానుడు వ్రాసిన 'మజుకు ఉల్ ఫసహా' యను గ్రంథమునను పై వాక్యమునే యాధారముగా గొని ప్రాచీన ఫారసీ కవుల, చరిత్రకారుల, శాస్త్రజ్ఞుల గ్రంథములన్నియు అరబ్బులచే కాల్పింపబడినందువలన ఫారసీ కవిత యణగదొక్కబడి శిథిలములైన సాహిత్యోపకరణములు పునర్బద్ధములగు వరకు రెండు శతాబ్దములు కావలసి వచ్చెనని తెలిపియున్నాడు. కాని మౌలానా షిబ్లీ తన 'షేరుల్ ఆజం' గ్రంథమున అరబ్బులపై మోపబడిన యీ నింద యసత్యమని వ్రాయుచున్నాడు. ఈ రెండు శతాబ్దములందు ఈరానీయులు స్వయముగా నవీన మతభాషయగు యరబ్బీభాషా సాహిత్యముల యున్నత స్థితిని గుర్తించి ఫారసీ భాషయందు వ్రాయుట మాని, అరబ్బీ భాషా పాండిత్యమలవడజేసికొని యనేకోద్గ్రంథములను స్వయముగా అరబ్బీ భాషయందు వ్రాసిరనియు హజ్రతు ఉమరు కాలమునుండి హజ్జీజుబిన్‌యూసఫు కాలమువరకు ఫారసీ భాషయే ప్రభుత్వ భాషగానుండెననియు, తరువాత అరబ్బీ భాష ప్రభుత్వ భాషగా నేర్పడి రానురాను అరబ్బీ భాష యొక్క ప్రవర్థమానమగు సమ్మేళనమువలన భారతదేశమునందలి ఉర్దూవలె ఈ క్రొత్త ఫారసీభాష యేర్పడెననియు మౌలానా షిబ్లీ అభిప్రాయపడుచున్నాడు.[1] ప్రొఫెసర్ బ్రౌన్ గారును ఈ యభిప్రాయముతో నేకీభవించుచు ఈరానీయులీ రెండు శతాబ్దముల కాలములో స్తంభీభూతులు కాలేదనియు, బుద్ధిబలము, చురుకుదనముగల జాతి వారగుటచే అరబ్బులు శాస్త్ర విజ్ఞానమును వశపరచుకొనుటతో నా భాషయందే యనేక గ్రంథములను రచించిరని వచించియున్నాడు.[2] ముఖ్యముగా అరబ్బులు

---

1. షేరుల్ - ఆజం మొదటి భాగం పేజి 16 నుండి 19 వరకు.

2. "A Literary History of Persia" by C. P. Brown Vol-1, Pages 204-206.

ఈరానీయుల గ్రంథ జాలమును కాల్పించి అత్యాచారములు గావించి వారి భాషా వాఙ్మయముల నుద్దేశ పూర్వకముగా నణచివేయకపోయిననూ, విదేశీయులగు వారి యాక్రమణము పర్షియా రాజకీయ సాంఘిక పతనమునందును, జాతీయ సంస్కృతి యొక్క తాత్కాలిక విచ్ఛిన్నత యందును పరిణమించెనని యొప్పు కొనక తప్పదు. పర్షియా వాసుల పూర్వ సంస్కృతి, ఆర్యజాతికి చెందిన వారి మేధా బుద్ధులు, మూడు శతాబ్దములలోనే అరబ్బుల మోటుదనమును తొలగించి సంస్కృతి, మత సహనము, శాస్త్ర జిజ్ఞాస మున్నగువానికి దారితీసెను. అబ్బాసీ ఖలీఫాల కాలమును ఇస్లామీయ చరిత్ర యొక్క (Golden-age) 'స్వర్ణ యుగమని' చరిత్రకారులు పేర్కొనెదరు. ఈ కాలమునందు ఖిలాఫత్ కేవల మిస్లాం మతమును స్వీకరించిన దేశముల హద్దులలో నుండక, ఇతర దేశములపై యధికారము కలుగజేసుకొనుట తోడనే యరబ్బుల యుద్ధ సంరంభమును భయావహమగు వీరత్వమును తగ్గిపోయి వారికి ఇస్లాం చరిత్ర యందు తొల్లింటి ప్రాధాన్యత లేకుండెను. కేంద్ర ప్రభుత్వమున మొదట పర్షియన్‌లకును తరువాత తుర్కులకున్ను ప్రాముఖ్యము లభించినది[1]. హారూను రషీద్ మమూన్ కాలములలో ఈరానీ పద్ధతులు, వేషభాషలు, జాతీయమగు పండుగలు, ఆచారములు తిరిగి పునరుద్ధరింపబడినవి. వీనితోపాటు ఫారసీ కవితకును స్థానము లభించినది. అంతకు పూర్వ మపజయమందిన పర్షియన్‌లు వెంటనే పాలకుల యొక్క అరబ్బీ భాషను తమ క్రొత్త మత భాషయైనందువలన మరింత పట్టుదలతో నేర్చి అరబ్బు పండితులకు కవులకు నేమాత్రము వెనుదీయక అరబ్బీ వాఙ్మయమును వృద్ధిపరచిరి. అబ్బాసియా ఖలీఫాల కాలములోను, తరువాతను పర్షియన్‌లు అరబ్బీ భాషకు గావించిన యపారమైన సేవ యొక్క వివరములు సమకాలీనములగు అరబ్బులు వ్రాసిన గ్రంథములందే కృతజ్ఞతా పూర్వకముగా తెలుపబడియున్నవి. ఆ కాలపు 44 గురు గొప్ప పండితులలో 18 గురు పర్షియా దేశస్థులు. మొదటి శాస్త్రీయమగు వ్యాకరణ మరబ్బీ భాషకు వ్రాసినవాడు పర్షియా దేశస్థుడు. పర్షియన్లు తమ పహ్లవీని అరబ్బీతో చేర్చి లిపిని మార్చుకొని రెండు మూడు శతాబ్దములలో తమ భాషను పునరుద్ధరించు

---

1. 'A Literary History of Persia' by C. P. Brown, Vol-1, Chapter VII, Page 251 to 253.

కొనిరి. ఆ కాలపు ఫారసీ వాఙ్మయమును గురించిన చరిత్ర నిజామ్ సమర్ ఖందీజౌఫీ మున్నగు పండితులు వ్రాసిన గ్రంథములవలన తెలియుచున్నది. వాటి యాధారము పైననే బ్రౌన్ దొరగారును,మౌలానా షిబ్లీ గారునూ తమ గ్రంథములను రచించిరి. ఈ జౌఫీ పండితుడు చిరకాలము భారతదేశములో నివసించెను. అల్తమష్ దర్బారులో నాదరణ గాంచెను. ఇతని గ్రంథము దాదాపు క్రీ.శ. 1228 లో వ్రాయబడినది. అప్పటికే దాదాపు 286 మంది ఫారసీ కవుల నామములను, వారి కావ్యములను పేర్కొని, కావ్య స్వరూపములను, లక్షణములను గూడ విమర్శించినాడు. ఇవ్విధములగు గ్రంథము లనేకములు 'Tajhkeras' 'తజ్కెరా' అను పేరుతో అరబ్బీ, ఫారసీ భాషలలో గలవు. ఇవే కవి జీవితములను, వాఙ్మయ చరిత్రములను వ్రాయుట కాధారములు.

అరబ్బుల యాక్రమణానంతరము అబ్బాసీ ఖలీఫాల కాలములో ఖలీఫా అల్ ముతవక్కిల్ కాలమున నీ వంశముయొక్క పతన మారంభమయ్యెను. మామున్ కాలమున తాహెర్ అను విఖ్యాత సేనాని ఖలీఫాచే మెప్పువడసిన వాడుండెను. అతనికి "జుల్ యమినైన్" (సవ్యసాచి) యను బిరుదము నొసంగి యుండెను. ఖురాసాన్‌కు గవర్నరుగ నియమించి తాహెరియా వంశస్థులను మిగుల గౌరవముతో చూచుచుండిరి. ఈ తాహెరియా వంశమువారు 54 సంవత్సరములు ఖురాసాన్‌ను పాలించిరి. అరబ్బుజాతికి చెందిన వారైననూ పర్షియా వాసులతో కలిసిపోయి అల్ ముతవక్కిల్ ఖలీఫా తరువాత నామ మాత్రముగా ఖలీఫా యధీనమందుండి స్వతంత్రముగా ఖురాసాన్ ప్రాంతమును పరిపాలించిరి. ఈ వంశపు కాలముననే ప్రస్తుత ఫారసీ భాషయొక్క పూర్వ కవిగా స్మరింపబడు 'హంజలీ' పేరు వినబడుచున్నది. ఇతడు మొట్టమొదట ఫారసీ భాషలో శాస్త్రీయమగు కవిత నారంభించెనని చెప్పవచ్చును. ఇతని కాలము క్రీ.శ. 820-872 మధ్యన. ఈ కవి తాహెరియాన్ వంశపు రాజుల యనుగ్రహమునకు పాత్రుడైననూ, వారు ఫారసీ కవుల నాదరించి భాషను పునరుద్ధరించిరని చెప్పుటకు వీలులేదు. దౌలత్ షాః వలన నీ వంశపు అబ్దుల్లా బిన్ తాహెర్ 'వామిఖ్-అజ్రా' యను పేరుగల ఫారసీ కావ్యమును నీటముంచి ఇతర గ్రంథములను నాశనము గావించుట కాజ్ఞ యొసంగెనని తెలియుచున్నది. ఇది యెట్లున్నను ఖలీఫా అల్ ముతవక్కిల్ చనిపోయిన సంవత్సరమే (క్రీ. శ.

861) యాకూబ్ బిన్‌లైస్ సఫార్ అను కంసాలి హెరాత్ పట్టణముపై దండు వెడలి క్రీ. శ. 869లో కిర్మాన్‌ను హస్తగతము గావించుకొని కొలది కాలములో తన సీస్తాన్ ప్రాంతమునే గాక పర్షియా దేశము యొక్క యధిక భాగము నాక్రమించుకొనెను. బాగ్దాద్ వరకును వెళ్ళెను. ఇతడు షియా సంప్రదాయములందు సానుభూతి గలవాడనియు, నితడు ఖలీఫాలకు వ్యతిరేకముగా తిరుగుబాటు గావించి దేశీయమగు స్వతంత్ర రాజ్యమును స్థాపించి జాతీయ పునర్నిర్మాణమునకు దారి దీసెననియు చరిత్రకారు లభిప్రాయ పడుచున్నారు. కాని క్రీ. శ. 900లో సామానీ వంశస్థుడగు యిస్మాయిల్ వలన యాకూబ్ తమ్ముడగు అమ్ర్ బిన్‌లైస్ సంహరింప బడుటతో సఫారీ వంశమంతరించెను. కాని తాహెరియా సఫారియా రాజుల కాలములో నలుగురి కవుల నామములు మాత్రము తెలియుచున్నవి. 1. హంజలా 2. మహమూద్‌వర్రాఖీ (పుస్తక-విక్రేత) 3. ఫేరోజ్ మష్రఖీ 4. అబూ సలేక్ గూర్గానీ. ఈ సఫారీ రాజుల కాలములో ఫారసీ కవితయందొక గొప్ప మార్పు మాత్రము కలిగినది. 'రుబాయీ' యను క్రొత్త వృత్తమపుడే బయలుదేరినది. యకూబ్ సఫారీ యొక్క చిన్న కుమారుడొకడు అక్రోటు కాయతో నాడుకొనుచుండెను. అందులో నొకటి దొర్లిపోయి నొక గుంటలో బడనా బాలుడు 'రుబాయీ' వృత్తము యొక్క ప్రథమ పాదమునకు సరిపోవునట్లు ఛందోబద్ధమగు భాషలో అక్రోటు కాయ దొర్లి పడిపోయిన వార్తను దెలిపెను. తండ్రి యాశ్చర్యచకితుడై కవులను రావించి మూడు పాదములు పూర్తి గావించి దానికి 'దొబైతీ' యను పేరొసంగెను. చాలా కాలము తరువాత 'దొబైతీ' కి 'రుబాయీ' యను పేరు కలిగినది. ఈ వృత్తమునందే సుప్రసిద్ధులగు ఉమరు ఖయ్యాం, హకీం సర్మద్, బాబా తాహెర్ మున్నగు సూఫీ కవులు తమ భావములను ప్రకటించిరి.

# ప్రథమ యుగము

## సామానీ రాజుల కాలము

## (క్రీ.శ. 874-999 వరకు)

ఈ సామానీ రాజులు బహరాంచూబీన్ యొక్క వంశమువారు. నౌషీర్వానె ఆదిల్ యొక్క మనుమడగు హుర్ముజ్వ చక్రవర్తి కాలమున నతని యన్యాయములకును, యవినీతికిని విసిగి బహరాంచౌబీన్ అనువాడు గొప్ప తిరుగుబాటు గావించెను. ఈ రాజుల యొక్క మూలపురుషుడగు అసద్‌బిన్‌సామాన్, తిరుగుబాటు నాయకుడగు నీబహ్రాం యొక్క వంశీయుడు. ఈరాన్ యొక్క సుప్రసిద్ధ వంశమునకు జెందినవాడగుటచే ఖలీఫా అల్‌మామూన్ గౌరవమునకు పాత్రుడయ్యెను. అసద్ యొక్క కుమారులు 'నూహీ', 'అహమద్', 'యాహియా', 'ఇలియాస్' నలువురును 'సమర్ఖంద్', 'ఫర్గానా', 'బష్నాన్', 'హెరాత్' నాల్గు ప్రాంతములకు గవర్నరులుగా నియమింపబడిరి. నలువురిలో మొదటివాడగు 'నూహీ' మరణానంతర మతని కుమారుడు 'అహమ్మద్' గవర్నరుగా నుండి తన కుమారుడగు 'నసర్' కధికారమప్పగించి వానప్రస్థుడయ్యెను. ఇతని తమ్ముడగు యిస్మాయిల్ కాలమున ఖలీఫాల నామమాత్రమగు యధికారము మరింత సడలినందున స్వతంత్రమగు నీ రాజవంశమున కీ యిస్మాయిల్‌నే వంశకర్తగా పరిగణింతురు. ఇస్మాయిల్ మనుమడగు రెండవ 'నసర్' కాలముననే ఫారసీ కవితా వాఙ్మయమునకు నన్నయభట్టారకుడనదగిన 'రూదగీ' యను ప్రథమ కవి యవతరించెను. 'రూదగీ' కవి 'నసర్' యొక్క యాస్థాన కవి. 'మలికుష్షోఅరా' (కవిసార్వభౌముడు) అను బిరుదము పొందినవాడు 'నసర్' తర్వాత 'నూహీ', 'అబ్దుల్ మలిక్', 'మన్సూర్ బిన్ నూహీ', 'నూహీ బిన్ మన్సూర్', 'మన్సూర్ బిన్ నూహీ', 'అబ్దుల్ మలిక్' 'యిస్మాయిల్ బిన్ అబ్దుల్ మలిక్' అను వారు పరిపాలించిరి. 125 సంవత్సరముల కాలము పర్షియా యొక్క ఉత్తర ప్రాగుత్తర భాగములను స్వతంత్రులుగా పాలించి

ఆ కాలమున విజ్ఞాన సాహిత్యాభ్యుదయమున కత్యంతాశ్రయము నొసంగి యపారమైన సేవ గావించిన నీ రాజవంశము క్రీ. శ. 999న గజ్నీ రాజులకు లోబడి యంతరించెను.

ఈ సామానీ వంశపు రాజులు పర్షియా యొక్క పూర్వ రాజవంశము లతో సంబంధము గలవారు. విద్యాప్రియులు, దేశాభిమానము గలవారు. స్వదేశము యొక్క సంస్కృతి యణగిపోవుచు దేశమందలి కవులును దమ కవితాశక్తుల నన్యభాషయగు అరబ్బీకై ధారవోయుచున్నందుకు చింతిల్లసాగిరి. వారు పరిపాలించు ఖురాసాన్, బుఖారా పట్టణములలో వందలాది కవులున్నను ఖలీఫాల ముఖ్య పట్టణమగు బాగ్దాద్‌కు లోబడి అరబ్బీ భాషలోనే వారు పలుకు చుండుట జూచి దేశభాషయగు ఫారసీని ప్రోత్సహించుటకై నిశ్చయించు కొనిరి. ఫారసీలో వ్రాసిన కవులకు ఎక్కువ జీతముల నేర్పరచి యనేక విషయములపై కావ్యములను వ్రాయించిరి. మన పంచతంత్రము యొక్క ఫారసీ తర్జుమా 'కలీలాదమనా' అరబ్బీలోని కనువదింపబడిన తరువాత మూలమగు ఫారసీకి విలువ తగ్గిపోయినది. 'నసర్' ప్రభువు 'రూదగీ' మహాకవిచే దానిని పద్య కావ్యముగ వ్రాయించెను. పర్షియా దేశము యొక్క పూర్వచరిత్ర నిదివర కెవ్వడును కూర్చి వ్రాసియుండలేదు. 'దకీకీ' యను కవిపుంగవుని కావ్యరూపమున దేశచరిత్రమును వ్రాయుటకై నియ మించెను. ఈ కవి వ్రాసిన వేయి పద్యముల గ్రంథమే తరువాత ఫర్దూసీ' మహాకవిచే రచింపబడిన సుప్రసిద్ధమగు 'షాహనామా'కు మూలమై తనరెను. సామానీ రాజుల కాలమునందు వరలిన వందల కొలది కవులలో ప్రముఖులైన వారి నామములివి. 1. అబుల్ అబ్బాసీ 2. అబుల్ మిస్లీ 3. అబూయిన్ హాక్ 4. జూ యెబారీ 5. అబుల్ హసన్ 6. ఖబ్బాజీ నైషాపూరీ 7. అబుల్ హసన్ కసాయీ 8. షహీద్ బలఖీ 9. అబుల్ మూయద్ 10. అబూ అబ్దుల్లా ఫరాలావీ 11. రూదగీ 12. దకీకీ 13. రాబియాఫర్వారీ (కవయిత్రి) 14. అబూ జర్ 15. మొఅమ్మర్ జర్జానీ 16. అబుల్ ముజఫర్ నసర్‌బిన్ మహమ్మద్ నైషా పూరీ 17. అమ్మరా మర్వజీ 18. తెఖారీ 19. మురాదీ.

ఈ కాలపు ప్రథమకవి యెవరో నిశ్చయించుటకు వీలులేదు. కాని అబూ అబ్దుల్లా ఫరాలావీ, మురాదీ, షహీద్ వీరందరిలో ప్రథములయ్యుందురని

యూహించుటకు కారణములు గలవు. ఈ ముగ్గురినీ ప్రశంసించుచూ 'రూదగీ' మహాకవి దుఃఖించినందున నిట్లూహించ వచ్చునని షిబ్లీ గారు దలచుచున్నారు. ఈ కాలపు కవులతోపాటొక కవయిత్రిని గూడ బేర్కొనవలసియున్నది. ఆ కవయిత్రి పేరు పైన పేర్కొన్న 'రాబియా ఖర్వారీ'. ఈమె 'రూదగీ' మహాకవికి సమకాలికురాలు, ప్రతిభావంతురాలు. తలిదండ్రు లరబ్బులైననూ ఈరాన్ దేశమున జననమొందినందున ఫారసీ భాషలో మంచి పాండిత్యమును సంపాదించి విఖ్యాత కవయిత్రి యయ్యెను. ఉభయ భాషలందును కావ్యములను రచించి పేరొందినది. సుకుమారియు, సుందరియు, విదుషీమణియునగు నా కవయిత్రి 'యెక్తాషీ' అను తుర్కీ గులాంను ప్రేమించెను. ఆ ప్రేమ రాను రాను భగవద్భక్తి క్రిందికి మారిపోయి మీరాబాయి మున్నగు భక్తురాండ్ర యాధ్యాత్మిక స్థితిని బొందినది. ఈ కవయిత్రి సూఫియాలలో పరిగణింపబడుచున్నది. కాని సమకాలీనులగువారు పరపురుషుని ప్రేమించుట స్త్రీకి తగనిపనియని యిస్లామీయ సంఘము క్షమింపలేక జనులామెను వధించిరి. "మజ్మ ఉల్ ఫసహా' యను కావ్యమంజరి యందీ కవయిత్రియొక్క పద్యము లనేకము లుదాహృతములైనవి. ఈ క్రింది పద్యము కవయిత్రి జీవితము యొక్క ప్రతిబింబముగా గ్రహించ వచ్చును:

ఉ॥ ధేవుని గూర్చి మ్రొక్కి 'నిను దీవన సేతున' దెట్టులంటివో
సీవొక రాతి గుండియను నీవలె గల్గు దయా విహీనపై
నావలె ప్రేముడిన్ దవిలి నా మదిగాల్చు వియోగవహ్నితా
పావళి నొచ్చి చిక్కుకొని బంధములన్ గృశియింపగావలెన్
నావలపెట్టి దో విలువ నాయది యేమొ గ్రహింపగావలెన్.

## రూదగీ

సామానీ కాలపు కవులలో నితడు ప్రముఖుడు. ఫారసీ కవులలో కావ్య సంపుటిని (దీవాన్) కూర్చిన వారిలో 'రూదగీ' ప్రప్రథముడని వాఙ్మయ చరిత్ర కారు లందరేకగ్రీవముగా నంగీకరింతురు. ఈ కాలములో వెలువడిన వందల కవులలో రూదగీ మహాకవి వలననే సామానీ రాజుల చరిత్రము చిరస్థాయియై యశస్సును గాంచెను. రూదగీ యొక్క పేరు అబ్దుల్లా జాఫరు. తండ్రి పేరు

మహమ్మద్. 'రూదక్' అను గ్రామ మితని జన్మస్థానమగుట నీ పేరు వచ్చినది. కొందరు, 'రూద్' అను వాద్యమును బాగుగా వాయించుటచే 'రూదగీ' యను పేరు వచ్చినదని నుడివెదరు.

గ్రీకు మహాకవి 'హోమర్' వలె రూదగీ కూడా పుట్టంధుడు. 8 వర్షముల బాల్యముననె 'ఖురానె - మజీద్'ను కంఠస్థ మొనర్చెను. సస్వరముగా బాడుట పిదప నేర్చుకొనియెను. అప్పటి నుండియే కావ్యాలాపమారంభించి సాహిత్యముతో పాటు ప్రచలితములగు శాస్త్రము లన్నిటి నభ్యసించెను. రాజసభలలో చతురులైన పండితులు, కవులు వారిలో నభిజ్ఞానులై మనోరంజకమొనర్చు పలుకులు గలిగి సద్యః ప్రతి వాక్కులగు వారు ప్రత్యేక గౌరవమును గలిగియుండిరి. వజీరులకన్న వీరి పదవి ఒక విధముగా నెక్కువ గౌరవనీయముగా భావింపబడుచుండెను. 'రూదగీ' లో పై లక్షణములన్నీ సహజముగా నుండుట వలన 'నసర్ బిన్ అహమద్' సామానీ యొక్క దర్బారు నందతనికి ప్రవేశము కలిగెను. రాజతనికి ప్రత్యేక గౌరవమొసంగుచుండెను. రాజభోగము లనుభవించుచుండెను. అతడు గుఱ్ఱపు స్వారీ చేయుచు వెడలినప్పుడు రెండు వందల భృత్యులు వెంట నడచుచుండిరి. ప్రయాణము చేసినపుడు నూరు యొంటెలపై నతని సామానులు మోయబడుచుండెను.

ఫారసీ కవిత, అరబ్బీ కవిత యొక్క స్వరూపమునే యనుకరించినది. కాని 'రూదగీ' కాలమున అరబ్బీ కవిత కేవల స్తుతి పాఠముల క్రిందికి దిగిపోయి యుండెను ముతనబ్బీ అబూ తమాబి-బఖరీ- ఆ కాలపు వాఙ్మయ గురువులు, కాని వారి సాహిత్యము ఖలీఫాల, అమీర్ల స్తోత్ర పాఠములతో నిండియున్నది. సామానీ రాజులు మాత్రమట్లు గాక కవులచే నిజమైన ధర్మమును నిర్వర్తింప జేసిరి. లోగడ నుడివినట్లు 'రూదగీ' ని 'కలీలాదం నా' (కరటక దమనకులు) అను పంచతంత్రానువాదమును కావ్య రూపముగా వ్రాయుటకు నియమించి నలభై వేల దీనార్లు ప్రతిఫల మొసంగిరి.

ఒకసారి 'నసర్ బిన్ అహమద్' సామానీ హిరాత్ ప్రయాణమొనర్చెను. 'బాద్‌ఘీస్' అను హిరాత్ యొక్క రమ్య ప్రదేశమున నివాసమేర్పరచుకొనియెను. వసంతమునందెల్ల వనోపవనములు తోటలుగా మారెను. ప్రకృతి

యొక్క రామణీయకత ననుభవించుటయందు నిమగ్నుడై వసంత కాలమంతయు నట గడిపెను. శరత్తునందు ఫలసంచయము హెచ్చెను. నూట ఇరువది రకముల యంగూర పండ్లు! ఆ రమ్య ప్రదేశమును, కుసుమ ఫలసంచయమును తోటలను విడువజాలక నొక ఋతువు తరువాత మరొకటి వెంట వెంటరా నాలుగు సంవత్సరములచటనే యుండెను. వచ్చుచున్న వసంతము తరువాత తిరిగి బుఖారా వెళ్ళవచ్చునని నిశ్చయించడము మాత్రమేగాని 'నసర్' కదల లేదు. అమీర్లు, సేనలు అందరును నాలుగు సంవత్సరముల పొడుగైన ప్రయాణమునకు విసుగుజెందిరి. కాని రాజుతో స్వయముగా మనవి చేయు ధైర్యమెవ్వనికిని లేదు. కావున వారు 'రూదగీ' కవి యొద్దకు వెళ్ళి ఐదు వేల అష్రఫీలు బహుమాన మొసంగెదమనియు, ఎట్లైనను రాజుగారిని బుఖారాకు తిరిగి వెళ్ళునటుల జేయవలయుననియు మనవిజేసిరి. మఱునాడు 'రూదగీ' దర్బారుకు వెళ్ళెను. 'నసర్' మధుపానము జేయుచుండెను. 'రూదగీ' 'సాజు' వాయిద్యముపై కరుణారసతరంగితమగు నొక గీతమును రచించి మధురముగా పాడెను. ఆ గీతము నాలకించినతోడనే 'నసర్' మేజోళ్ళైనను కాళ్ళకు దొడగక, కాపరి యొక్క గుఱ్ఱముపై స్వారి జేయుచూ బుఖారావైపు వెళ్ళి ఒక మంజిలు (మజిలి) తరువాత సేద దీర్చుకొనుటకై నిలచెను. సేనలు, అమీర్లు ఐదువేల అష్రఫీలకు బదులు త్వరగా తమ మనోరథము చేకూర్చినందులకు కవిగారికి పదివేలు సమర్పించి బహూకరించిరి. ఆ గీతమునందు బుఖారా ప్రాంతమున నున్న జెహూన్ నదియూ, 'మూలియాన్' అను సరస్సును, ఆ పట్టణ వాస్తవ్యులును, తమ రాజచంద్రుడెప్పుడెక్కడ యుదయించుననుచు నిరీక్షించుచున్నారని సరసమై, సులభమై, అలంకారరహితమైన భాషలో చెప్పబడియున్నది. భావుకుడును, సరసుడైన రాజు మధురముగా 'సాజు' పై 'రూదగీ' గానముచే భావభరితుడై బుఖారాకు వెళ్ళడము గజేంద్రుని రక్షించుటకై "సిరికిన్ జెప్పక శంఖచక్రయుగమున్ చేదోయి సంధింపకన్"- శ్రీ విష్ణుమూర్తి హడావిడిగా వెళ్ళడమును జ్ఞాపకము జేయుచున్నది. అలంకారభూయిష్ఠమగు శబ్ద కవిత వాడుకలోనికి వచ్చిన తరువాత అలవాటుపడిన దౌలత్ షాః వంటి విమర్శకుడు "ఏ యలంకారమును, కల్పనాచాతుర్యమును లేని యీ గీతమునందేమి గలదని రాజునకంత నచ్చెనని యాక్షేపించెను గాని 'చహార్‌దామకోల్గో' గ్రంథకర్తయగు

'అరూజీ సమర్ ఖందీ' కవి శ్రేష్ఠుడు, 'రూదగీ' యొక్క పై కసీదా కంటె నుత్తమమగున దింతవరకు వేరొక కవి చెప్పలేదని ప్రశంసించియున్నాడు.

'రూదగీ' వ్రాసిన ద్విపాత్చరణముల సంఖ్య పది లక్షల పదమూడు వేలని తెలియుచున్నది. రూదగీకవి కసీదా, రుబాయి, కితా, గజల్, మర్సియా- అన్ని విధములగు కవితలను చెప్పెను. 'మస్నవీ' యొక్క నమూనా కనపడదు గాని 'కలీలాదంనా' కథ 'మస్నవీ' లోనే వ్రాయబడినట్లు 'లుగా తెఫర్స్' అను నిఘంటువునందు దాహృతములైన కొన్ని చరణములవల్ల దెలియుచున్నది. కథా వర్ణనము, ఉపదేశము, శృంగారము, స్తుతి - అలంకారము అన్నీ ఈ కవి యొక్క సాహిత్యమున కనపడుచున్నవి. 'రూదగీ' ఫారసీ భాష యొక్క నన్నయ భట్టారకుడని యిదివరకే చెప్పి యుంటిమి. రాజరాజ నరేంద్రుని ప్రోత్సాహము వలన భారతాంధ్రీకరణమును ప్రారంభించి తెనుగు కవిత్వము నకు గట్టి పునాదులు నన్నయ వేసెను. అట్లే 'రూదగీ' 'నసర్' సామానీయొక్క యాదర ప్రోత్సాహము వలన భాగ్య భోగములననుభవించుచూ నేటి ఫారసీ భాష యొక్క కవితా వాఙ్మయ భవనమునకు గట్టి పునాదిని నిర్మించెను. ఉప దేశము నందును నూతన ఫక్కిని త్రొక్కినాడు. ఎపిక్యూరస్-ఉమరుఖయ్యాంల తత్త్వములను ఫారసీలో మొట్టమొదట ప్రవేశపెట్టిన దితడే. ఖ్వాజా హాఫీజు యొక్క దీవాఁ సంపూర్ణముగా నీ మూలతత్వముల వ్యాఖ్యానమని చెప్పవచ్చును.

కథా వర్ణనము ప్రతిచోట నుత్తమముగా కన్పించును. కసీదా లందును రూదగీ యనేక స్థలముల వర్ణనలను చేర్చి రసవంతముగా నొనర్చెను. మర్సి యాలు గూడ కొన్ని వ్రాసెను. వీనియందు మర్సియా కుండవలసిన ఉత్తమ లక్షణములన్నియు గలవు. ప్రధానమంత్రి పుత్రుడు గతించినప్పుడు వ్రాసినది మిగుల మంచి శైలిలో మంత్రిగారి కుపదేశమొనర్చునదై యున్నది. 'గజల్' ఆకాలమున నింకా సర్వలక్షణ సహితమై పరిపూర్ణ స్వరూపమును బొందియుండ లేదు. 'గజల్' లో గూడ 'రూదగీ' శ్రేష్ఠుడని తరువాత సుప్రసిద్ధ 'గజల్' కవియగు 'అన్సురీ' కొనియాడెను. కొంత 'గజల్' వాఙ్మయము చిక్కలేదు. కసీదా వ్రాయు ఏ పద్ధతిని 'రూదగీ' ప్రవేశపెట్టెనో ఇప్పటికిని ఫారసీ వాఙ్మయ మున నదే ప్రచలితమై యున్నది. మొట్టమొదలేదో వసంత వర్ణనమో లేక మరే ప్రకృతి వర్ణనముతోనో ఆరంభించు స్తుత్యుని యొక్క గుణ గణముల వైపు

తిన్నగా చదువరికి గోచరించకుండా నడపడము ప్రధాన లక్షణము. స్తోత్ర పాతము పూర్తియైన తుద కాశీర్వచనము. కసీదా వ్రాయుటలో ముఖ్యమైన చాతుర్యము మొదలారంభించిన ప్రకృతి వర్ణన నుండి యప్రయత్నముగా ప్రభు వర్ణనలోనికి దిగుట. ఈ చాతుర్యమును 'రూదగీ' ప్రశంసనీయముగా చూపెట్టి యున్నాడు. కసీదాల మధ్యన 'రూదగీ' పొడుగైన ప్రకృతి చిత్రముల దిద్దెను. శిశిర వర్ణన మారంభించుటతోడనే ప్రభు వర్ణన మొక యుపమానాలంకార రూపమున నిమిడ్చెను. ఉదా॥ రాజ్మొ (భూ రాజు?) యొక్క వాయువు ఉప వనాంతములన్నిటిని దీనారుల (ఒక విధమైన పూలు)తో నింపును, అని మొదటి చరణము. రాజ హస్త మేవిధముగా వర్శించిన వారి యొడులను దీనారుల (నాణెములు)తో నింపునో అట్లు-అని రెండవ చరణము. ఉపమానమును, శ్లేషను ఉపయోగించి కవి ఈ సౌందర్యమును తెచ్చిపెట్టెను. మరియు నొకచోట నీ విధముగా నారంభించెను: "నా ప్రియురాలు నన్ను తోటలో చూచి 'ఇది తోట గాదు స్వర్గము - తోటగాదు' అనగా నేను 'స్వర్గము కాదు. అక్కడి నందన వనము వంటి తోటయే. పొరపాటు బడకుము. ఆ స్వర్గమూ ఆ తోట కనపడవు. అవి దైవ నిర్మితములు. ఉద్దెర. ఇవి రాజొసంగినవి. ఇవి కన పడును. నగదు - అవి సమాజుల ప్రతిఫలము. ఇవియు స్తోత్రఫలమే. అవి దేవు డిచ్చును. ఇవి ప్రభువిచ్చెను' అని ప్రత్యుత్తర మొసంగితిని" అని వ్రాసు కున్నాడు.

ఫారసీ కవితపై వెక్కిరింత అపహాస్యముతో సంబంధించిన వాఙ్మయ మొక కళంకము. 'రూదగీ' యొక్క వెక్కిరింత ఏవగింపు కలుగనీయక హద్దును మీరదు. ఇతని కవితా శక్తిని, సమకాలీనుడును ఇంతటివాడు నగు 'షహీద్' తరువాతి వారగు 'అన్‌సురీ'. 'దకీకీ', 'నిజామీ' మున్నగు గొప్ప కవులందరు కీర్తించిరి. ఆక్షేపించిన వానికి ప్రత్యుత్తర మిచ్చుచు 'నిజామీ' ఈ కవి యుగమున కతడు గురువని నొక్కి చాటి యున్నాడు. 'రూదగి' యొక్క దీవాన్ కావ్య సంపుట మచ్చుబడినది. కాని పది లక్షలకు మించిన పద్యములు దొరకలేదు. కాలగర్భము నందధిక సంఖ్య దాగిపోయినది. ఇతడు 304 హిజ్రీలో మృతి నొందెను.

## 'దకీకీ'

'రూదగీ' తరువాత పేర్కొనదగిన రెండవకవి తూసు (తూస్) పట్టణ వాస్తవ్యుడగు 'దకీకీ'. ఇతని పేరు 'మన్ సూర్ బిన్ అహ్మద్'. కవితాప్రతిభచే రాజు దర్బారుచేరి గౌరవమును గాంచెను. సామానీ రాజులు దేశచరిత్రను, తమ పూర్వుల చరిత్రను కావ్యరూపమున గ్రంథస్థ మొనరించుట కాతుర పడుచుండిరి. 'షాఃనామా' అను పేర పర్షియా దేశపు రాజుల సమగ్రమగు చరిత్రను వ్రాయుటకై నీ కవిని రాజు నియోగించెను. దాదాపు ఇరవది వేల ద్విపాత్తులు వ్రాసెను. అందులో దొరికినవి వేయి. వాటిని 'ఫర్దూసి' మహాకవి తన 'షాఃనామా' యందు చేర్చినాడు. 'షాః నామా'ను పూర్తిజేయు యదృష్టమతనికిని, యా కృతి నారంభింపజేసిన సామానీ రాజులకును పట్టలేదు. 'గష్టాస్టు' 'అర్జాస్ప్' రాజుల చరిత్రను వ్రాసి జరుతుష్టుని యవతారమువరకు వచ్చెను. "దకీకీ" తన ప్రేమ పాత్రుడగు తుర్కీ గులాము యొక్క కత్తి పోటుచే యకస్మాత్తుగా మృతి నొందెను. తరువాత 'ఫర్దూశీ' కవి తన 'షాఃనామా' లో 'దకీకీ' రచించిన భాగమును చేర్చుచూ 'దకీకీ' తనకు స్వప్నమునందు గాన్పించి తన కృషిని ప్రపంచమునకు తెలుపుమని కోరినట్లును, తాను చేర్చినట్లును తన యౌదార్యమును ప్రకటించుకున్నాడు. వెంటనే నీ యౌదార్యము యొక్క విలువను పోగొట్టుకున్నాడు. 'దకీకీ' రచించిన భాగ మేమాత్రము సాహిత్య దృష్టిచే కవిత్వమనిపించుకోదని నిష్ఠురముగా విమర్శించి, 'దీనితో నేను రచించు భాగములను పోల్చుకొమ్మని' చదువరులను హెచ్చరించి యాత్మస్తుతి - పర నింద రెండు పాపములకును పాల్పడినాడు. ఫర్దూసీ యొక్క విమర్శన సరి గాదనియూ, 'దకీకీ' రచించిన భాగము ఫర్దూసీకి ఏ విధముగానూ తీసిపోదనియు, ఫర్దూసీ యనేక స్థలములందు 'దకీకీ' ననుకరించెననియు, నిర్విాదముగా విమర్శించి యుండుట ఫర్దూసీ కొక కళంకమనియు బ్రౌన్, మౌలానా షిబ్లీ మున్నగు పండితులందరు యేకగ్రీవముగా నభిప్రాయపడుచున్నారు. 'షాఃనామా'కు పర్షియన్ వాఙ్మయమందు మన భారతమునకుగల దర్జా గలదు. మన భారత మును పంచమ వేదమని పొగడుదుము. వారు 'షాఃనామా'ను "ఖురానుల్ అజం" అనగా 'పర్షియా వారి ఖురాన్' అని గౌరవింతురు. పురాతన చరిత్ర కథలగుట నీ రెంటికి విషయ సామాన్యత గలదు. అట్లే ఒక కవిచే పూర్తి

గావింపబడక నిక్కడ 'కవి ద్వితయము' కావలసి వచ్చినది! మనకు కవిత్రయ మట్లు!! ఈ కవి వ్రాసిన ఇతర కావ్యములలో కొన్ని ఖండము లుపలభ్యము లైనవి. వానిలో ప్రకృతి వర్ణనలు, గజళ్ళు గలవు. ఈ కవి యొక్క ప్రాముఖ్యత 'షాహనామా' యొక్క ప్రారంభకుడైనందువలననేగాక, భాషా స్వరూపమున గొంత ముఖ్యమైన మార్పు కలిగించిన గొప్పదనము కూడ నితనికి జెందవలసియున్నది. దకీకీ కాలమువరకు ఫారసీభాషలో అరబ్బీపదముల కలయికవలన నొక క్రొత్త భాషవలె గనబడుచుండెను. అరబ్బీ పదజాలమునే కవులు ఎక్కువగా ఉపయోగించుచు వచ్చిరి. రూదగీ కవి గూడా నరబ్బీ పద జాలము నెక్కువగా నుపయోగించెను. కాని 'దకీకీ' అరబ్బీ పదజాలమును తక్కువజేసి శుద్ధమైన ఫారసీని వ్రాయ యత్నించెను. 'షాహనామా'లోని ఇతని రచితమైన భాగమిందుకు సాక్ష్యము. ఫారసీ భాషకీ మార్పువలన నొక ప్రత్యేకత ఘటించినది. ఈ భాషనే ఫర్దూసీ మహాకవి గూడ సమర్థించెను. సామాన్యమగు చిన్న గజళ్ళు గాక, 'ముసల్‌సల్' అనగా పొడుగైన గజళ్ళు అర్థైక్యత, భావైక్యత గలిగినవి గూడ వ్రాసెను. షహీద్ బలఖీ - అబూషకూర్ బలఖీ, ఖబాజీ నైషాపూరీ, అమారామ రూబీ - జూయెబారీ - మున్నగు మరికొందరు కవుల నామములు, కొద్ది కొద్దిగా వారి కావ్య ఖండములు లభించుచున్నవి. కాని ఈ చిన్న పొత్తమున చర్చించుట యనవసరమని వదలివేయుచున్నాను.

# రెండవ యుగము

## గజ్నవీరాజుల కాలము

## (క్రీ. శ. 999 నుండి 1258 వరకు)

ప్రవర్ధమానమగు పారసీక కవిత గజ్నవీ రాజుల కాలము నందత్యున్నతమగు దశను బొందినది. ఫర్దూసీ, అసదీ, అన్సూరీ, ఫర్రూఖీ, హాకీం సనాయ్, మనూబెహ్ర, తాంగానీ ఫారసీ కవితా ప్రపంచమున సప్తఋషుల వంటి వారు. వీరందరు ఆ కాలపు స్మారక చిహ్నములే.

గజ్నవీ రాజవంశమును చారిత్రకముగా సామానీ వంశము యొక్క శాఖగా పరిగణింపవచ్చును. అబ్దుల్ మలిక్ బిన్నూహీ అను సామానీ రాజు కాలమున ఈ రాజవంశము యొక్క గులాం (దాసుడు)గా నున్న అలప్తగీన్ అనునతడు అభివృద్ధి నొందుచూ అమీర్ దర్బారును పొందెను. అతనిని రాజు ఖురాసాన్ యొక్క గవర్నరుగా నియమించెను. అబ్దుల్ మలిక్ తర్వాత, మన్సూర్ రాజ్యపీఠము నధిష్ఠించిన తరువాత, అలప్తగీన్ గజనైనుకు (GAZANI) వెళ్లి పదహారు సంవత్సరము లచ్చట పరిపాలనము చేసెను. అతని కుమారుడు అబోయిసాఖ్రు అల్పకాలముననే మరణించెను. అలప్తగీన్ వద్ద సుబుక్తగీన్ అను మరియొక గులాం (దాసుడు) ఉండెను. తన యజమాని కాలముననే యతడు ప్రభుత్వ లక్షణములను గనపరచియుండెను. అబోయిసాఖ్రు తరువాత ప్రజలు సుబుక్తగీన్ను గజునైన్కు ప్రభువుగా నెన్నుకొనిరి. ఈ గులాందర్ గులామే (దాసాను దాసుడే) గజ్నవీ ప్రభువంశపు మూలపురుషుడు. హిందూస్థానమును జయించిన సుల్తాన్ మహమూద్ ఇతని సుపుత్రుడే. తండ్రి సుబుక్తగీన్ తన కాలముననే హిందూదేశమును ఆశాపూరిత దృష్టితో జూచుచుండెను. జయపాలునిపై పలుసార్లు విజయము సాధించి సామానీ దర్బారు నుండి 'నాసరుద్దీన్' అను బిరుదమును గ్రహించి యుండెను. సుబుక్తగీన్ క్రీ. శ. 998లో మృతినొందెను. అలప్తగీన్ కూతురు వల్ల గలిగిన మరియొక

కుమారుడు ఇస్మాయిల్ అనువాడు 'బలఖ్'ను పరిపాలించు చుండెను. తండ్రి మరణించిన సమయమున మహమూద్ గజనీలోనే యుండెను ఇస్మాయిల్ 'బలఖ్' పరిపాలనము మహమూద్ స్వీకరించి, గజనైన్ పరిపాలనమును తనకప్పగించ వలసినదిగా కోరెను. మహమూద్ అందుల కొప్పుకొన నందున యుద్ధము జరిగి ఇస్మాయిల్ కపజయము గలిగెను. మహమూద్‌కు సామానీ రాజు 'నుహ్' యొక్క దర్బారునుండి 'సైపుద్దౌలా' యను బిరుదము తండ్రి కాలము ననే లభించియుండెను. తరువాత బగ్దాద్ దర్బారు నుండి 'యమనుద్దౌలా' అను బిరుదు లభించెను. సేవక సేవకుడగు మహమూద్ పర్షియా పరిపాలకులగు బావహీర్, జయాగీ, సామానీ రాజులను జయించి 'బుఖారా సమర్ ఖందుల' నాక్రమించి హిందూస్తానమున గుజరాత్, కన్నౌజుల వరకు కలుపుకొని, అఫ్గ నిస్తానము Transoroma, ఖురాసాన్, తబరిస్తాన్, సీస్తాన్, కాశ్మీరు భాగాలు కలిపి గొప్ప సామ్రాజ్యము నిర్మించెను. మహమూద్ పరాక్రమ విజయ దుందు భులు భారతదేశపు చరిత్ర పుటలపై మారుమ్రోగుచునే యున్నవి. అతని సాహిత్య విజయములను మాత్రమే నేనిచట వర్ణింపవలసి యున్నది.

మహమూద్ గజ్నవీ కత్తిపోటు, కలముపోటు రెండింటిలోను మేటియైన దొర. ఇస్లాం మత ధర్మశాస్త్ర గ్రంథములందు సమ్మానితమగు 'జవాహెర్ మంజియ్యా' యను గ్రంథమునందు మహమూద్ ఫెక్కా పండితులలో పరిగ ణింపబడి యున్నాడు. ఇతడు ఫెక్కా గ్రంథ మొకటి స్వయముగా రచించెను. ఇతడొక గొప్ప మద్రసాను (విద్యాలయము) స్థాపించి దానితోపాటు ప్రపంచము లోని వివిధ విచిత్ర వస్తువుల ప్రదర్శనశాల నొకదానిని స్థాపించినటుల ఫరిష్టా వ్రాయుచున్నాడు. దేశమునందు గల సుప్రసిద్ధులగు పండితులను, విజ్ఞులను రావించి దర్బారునందు వారికి స్థానమొసంగెను. ఇట్లు మహమూద్ రావించిన వారిలో నొకడు సుప్రసిద్ధుడగు 'బూ అలీసనా' యను గొప్ప తత్వవేత్త, పండితుడు, వైద్యుడు అరిస్టాటిల్ యొక్క శిష్యుడు. మధ్యయుగపు యూరపు దేశీయులకతడు వైజ్ఞానిక గురువు. అంతకంటె మించిన శాస్త్రవేత్త లేడు. రెండవవాడు 'అబూరీహాన్ అల్‌బెరూనీ.' ఇతడు మొదటివానికి తీసిపోడు. వివిధ విద్యా విశారదుడు. గొప్ప దైవజ్ఞుడు. భారతదేశ పర్యటనము గావించి, ఆ కాలపు భారతదేశమును, ముఖ్యముగా భారతీయుల శాస్త్రములను, ఆచార వ్యవ హారములను, సంస్కృతిని వర్ణించి భారతదేశ చరిత్రకు మిగులనుపకరించెను.

హిందూస్తానమను గ్రంథమును వ్రాసెను. ఫ్రెంచి పండితుడగు 'సూ్కాప్' యొక్క ఉపకారము వలన నది యుపలభ్యమగుచున్నది. ఈ యిరువురు మహా పండితుల చరిత్ర మించుక తెలిసికొన దగినట్టిది కావున నిచ్చట బొందుపరచుట యప్రస్తుతముకాదు.

మహమూద్ కాలమున మరియే స్థలములును వాఙ్మయ సాహిత్యాదుల కాశ్రయమిచ్చునవి లేవు. మహమూద్ దర్బారు యొక్క గొప్పధనము ఇతర దర్బారులకు లోపించి యుండెను. అతని దర్బారే యేకైక శరణ్యమయ్యెను. కావుననే అందరు నక్కడ ప్రవేశించిరి. బూ అలీ సనా, అల్ బెరూనీ అను ఇరువురే కాక 'మసీహా' యను మరియొక తత్వవేత్త 'ఖమ్మార్' అను వైద్య శాస్త్రవేత్త, అర్రాక్ అను గణిత శాస్త్రజ్ఞుడు ఈ యైదుగురు పండితులు మొదట ఖ్వారాజ్మ (ఇరాక్ ముఖ్య పట్టణము) నందు మామూన్ దర్బార్‌లో నుండిరి. మహమూద్ వీరిని తన వద్దకు పంపించమని మామూన్‌కు లేఖ వ్రాసెను. ఆ లేఖ యుత్తరువుగా భావించదగినది గావున మామూన్‌కు చిక్కు వచ్చినది. పండితులను బిలిపించి లేఖను వినిపించెను. అది విని తత్వవేత్తలు-అనగా 'బూ అలీ సనీ' 'మసీహా' యిరువురును దప్పించుకొని పారిపోయిరి. మిగతా ముగ్గురు మహమూద్ దర్బార్ చేరుకొనిరి. పారిపోయిన యిరువురిలో 'మసీహా' దారిలో సుడిగాలికి బలియయ్యెను. బూ అలీసనా అతి కష్టముతో తూస్, నైషాపూర్ మార్గముగా 'గూరెగాన్' చేరి యచట 'కబూసీ' అను సాహిత్య ప్రియుడగు నమీరు వద్ద జేరి, అక్కడి నుండి అసఫ్‌హాన్‌కు వెళ్లి అక్కడి యమీరు వద్ద దీవాన్‌గా పని చేయుచు నా కాలముననే తన 'షీఫా' యను గొప్ప తత్వ గ్రంథమును పూర్తిగావించెను. ఈ పండితుడు రచించిన రెండవ గ్రంథము 'ఖానూన్' అను గొప్ప వైద్య గ్రంథము. ఇతడు బహు శాస్త్రవేత్త. బహు గ్రంథ నిర్మాత. వంద గ్రంథము లనేక విషయములపై నితడు రచించెను. ఇతడు పారశీక కవి కూడ. ఇతడు క్రీ. శ. 1037 లో మరణించెను. గూర్గాన్ చెరసాలలో నితడు వధింపబడెను. అరబ్బీ, ఫారసీ రెండు భాషలలోను కావ్యములు వ్రాసెనట. జాఫీ గ్రంథము నందవి కొన్ని యుదాహృతములైనవి.

అల్బేరూని గొప్ప దైవజ్ఞుడు. సుల్తాన్ మహమూద్ తన వేయి వృక్షముల యుపవనము సందు నాలుగు ద్వారములు గల చలువ మంటపమున గూర్చుని

యుండి, నేనే ద్వారము నుండి యవతలకి వెళ్లుదునో తెలుపుమని ప్రశ్నించి దానికి దైవజ్ఞుని సమాధానమును కాగితముపై లిఖింపజేసెను. తరువాత తూర్పు గోడను త్రవ్వించి యా కన్నమునుండి యవతలికి వెళ్ళి కాగితమును జదువుకొనెను. అందులో జరిగినదంతయు సరిగా వ్రాయబడియుండెను. దానిపై గోపించి అల్బెరూనీని మేడపైనుండి క్రిందికి బడద్రోయించెను. దైవవశాత్తుగా నొక దోమతెర యడ్డము వచ్చుటచేత హఠాత్తుగా క్రిందబడక మెల్లగా క్షేమముగా క్రిందికి దిగజారెను. మహమూద్ అది చూచి యతనిని పిలిపించి నిన్నీవిధముగా బడద్రోయబోవుట నీకు ముందుగానే తెలిసియుండెనా? యని విచారింప దైవజ్ఞుడు తన జేబులోని నోటు బుక్కును దీసి చూపెను. అందులో నీ యుదంతము సరిగా లిఖింపబడియుండెను. దానికి మరింత కోపించి యతనిని చెరసాలలో నుంచెను. ఆరునెలల శిక్ష ననుభవించిన తరువాత మంత్రియగు 'అల్ మైముదీ' యొక్క సిఫారసుపై చెరసాలనుండి రప్పించి గుఱ్ఱము, వస్త్రములు, సేవకులు, వేయి దీనారములు బహుమతిగా నొసగి పంపించెనను గాథ సుప్రసిద్ధము.

అల్బెరూనీ Chronology of Ancient Nations' ప్రాచీన జాతుల కాలనిర్ణయమను చారిత్రక గ్రంథమును రచించి 'షంషుల్ మాతీ' కబూస్, అను అమీరున కంకితమొనర్చెను. మహమూద్ గజ్నవీ మరణానంతర మితడు తన రెండవ యుద్గ్రంథము భారతదేశమును గురించినది రచించెను. సంస్కృత భాష నా కాలపు పండితుల కడ నభ్యసించి, సంస్కృత గ్రంథములను స్వయముగా జదివి యర్థము చేసికొని, నేటి పాశ్చాత్య పండితులవంటి విమర్శనా కుశలతను జూపించినాడీ గ్రంథమునందు. ఇతడు జ్యోతిశ్శాస్త్రముపైనను గ్రంథములను వ్రాసెను. అల్బెరూనీ వంటి ముస్లిం పండితు లితరుల వాఙ్మయ సాహిత్యముల నభ్యసించి వానిలో నుండు మంచి చెడ్డలను విమర్శించు శక్తిని, మంచిని స్వీకరించి చెడుగును మాత్రము నిరసించు దాక్షిణ్యమును నలవరచు కొనినచో విజ్ఞాన సంస్కృతులపై నాధారపడిన నిజమైన యైక్యత చేకూరగలదని చెప్పవచ్చును. ఈ మాట హిందూ పండితులకును వర్తించును. అల్బెరూనీ క్రీ. శ. 973లో జరాజ్మ పట్టణమున జన్మించి క్రీ.శ. 1048 లో గజనీలో మరణించెను. ఈ కాలములో 'బది ఉజ్జమాన్ హమదానీ', 'మహియార్ దైలమీ' అను జరతుష్ట్రుడు (ఇస్లాంను స్వీకరించినవాడు), లల్ మఊనీ మున్నగు పండితులు, వైద్యులు,

అనేక శాస్త్రములపై గద్య పద్యములలో నుద్గ్రంథములను రచించిరి. శాస్త్ర గ్రంథములు వాఙ్మయము నందు జేరినను, సాహిత్యము నే ముఖ్యముగా నీ వ్యాసమునందు విషయముగా గ్రహించినందున మహామూద్ కాలపు కవుల చరిత్రముననే గనుంగొనుట కర్తవ్యమగును.

## అన్సురీ కవిసార్వభౌముడు

సుల్తాన్ మహామూద్ గజ్నవీ కవితాకన్యకు మన కృష్ణదేవరాయలవలె ఆలంబన మొసంగెను. ప్రత్యేక రాజాదరమునకు కవులు పాత్రులై ఈ కాలమున ఫారసీ కవితా వాఙ్మయమునకు పరిపక్వదశను తీసుకొని వచ్చిరి. అన్సురీ యను కవిశ్రేష్ఠుని 'మలికుష్షోరా' (కవిసార్వభౌముడు) అను బిరుదము నొసంగి యాస్థానకవిగా నియమించెను. ఈ సాహిత్య శాఖయు నొక విధమగు ప్రభుత్వశాఖగానే బరిగణింప బడుచుండెను. కవి జీవితములు-'తజుకిరాల'ను గ్రంథములన్నిటి యందును దాదాపు నాలుగు వందల కవులాతని యాస్థానమున నుండి సహకారమును బొందుచున్నటుల దెలుపబడియున్నది. ఒకసారి రాకుమారుడగు 'మసూద్' 'ఖురాసాన్' నుంచి 'గజనైన్' పట్టణమునకు వచ్చినపుడు దర్బారులో కవులందరు 'ఖసీదాలు', స్తుతి కావ్యములు వ్రాసుకొనివచ్చి నివేదించిరి. అతడొక్కొక్క కవికి యిరువది వేల దీనార్లు, జీనతీ అన్సురీ కవులకు ఏబది యేబది వేల దీనార్లు బహుమతి నొసంగెను. అన్సురీకి, ఒక 'రుబాయి' చతుష్పాద గీతము వ్రాసినప్పుడతని నోటిని మణులచే నింపెనట. ఈ యుదంతములను మహామూద్ గజ్నవీ యొక్క సుగుణములుగా పరిగ్రహింపక ఆత్మస్తుతి పరాయణుడగు ప్రభువు యొక్క పిచ్చి చేష్టలనియు, నిజమగు సాహితీపోషణము కాదనియు తప్పు బట్టదలచినచో నవకాశము గలదు. కాని 'షాహనామా' ను వ్రాయించి ఫారసీ వాఙ్మయమునకు, ఆ దేశమునకు మహామూద్ గావించిన మహోపకారము మఱవదగినది కాదు. దేశీయ వాఙ్మయాభివృద్ధి, చరిత్ర ప్రకటనము ఈ రెంటిని దృష్టి యందుంచుకొనియే ధనరాసులు వెచ్చించి యుండును. కాని, యూరక తన వినోదమునకో లేక తన సంస్తుతి చేయు భట్టువారలనియో ఇంతమంది పండితులను, గవులను పోషించియుండడు. అట్లు విమర్శించుట హాస్యాస్పదమగును. షాహనామా వంటి గ్రంథమును వ్రాయించి ఫారసీ జాతీయతకొక మహోపకారమొనర్చెను. ఇస్లాం మతమును తమ పరాక్రమముచేతను

విద్యా బుద్ధులచేతను ప్రచారము గావించినవారు, అనేక సమరములందు విజయ లక్ష్మిని వరించినవారు అరబ్బు నేత లనేకులున్నను, ఆ ప్రాంతముల ముస్లిం లును ఇస్లాం కంటె పూర్వకాలమున వెలసిన 'జం, కైఖుసురో, కైకావూసీ, ఫరీదూన్, అప్రాసియాబు ఇస్పందియారు మున్నగు రాజుల పేర్లను దలంచుకొని గర్వింతురు. ఆబాలగోపాలము వరకు చరిత్ర నెరుగుదురు. దీని వలన ఈరాన్ యొక్క పూర్వపు వైభవమంతరించి జరతుష్ట్రి మతము, దానితో సంబంధించిన సంస్కృతి యాదేశమునందు లేకున్నను, పూర్వ వీరగాధలు ఈరానీ లందరికి మత వివక్షత లేక సమాన గౌరవమునకు తావలములై యమరత్వమును దాల్చినవి.

## 'అన్సురి'

ఇతని పేరు 'హసన్‌బిన్ అహ్మద్', అన్సురీ కవితా నామము. బలఖ్ పట్టణ వాస్తవ్యుడు. తండ్రి వాణిజ్యము చేయువాడు. చిన్నతనముననే తండ్రి యొక్క ఛాయలో పోయినందున తానును వాణిజ్యమునకై వెడలెను. త్రోవలో బందిపోటు దొంగలకు చేజిక్కి చేతి బండారము పోగొట్టుకొనెను. ఆ కాలమున ఫీజులు, ధనవ్యయము పనిలేకయే విద్యాదానముచేయు విద్యాలయము లనేకము లుండెను. అందువలన వాణిజ్యము విడిచి సులభముగా నొక విద్యాలయమందు జేరి విద్యల నభ్యసించెను. ప్రచలితములగు శాస్త్రము లన్నిటిని జదివెను. కాని దైవికమగు కవితాశక్తి బయల్పడినందున కవితావృత్తి నవలంబించి తమ్ముల మున సుల్తాన్ మహమూద్ తమ్ముడగు 'నసర్' యొక్క దర్బారునకు ప్రవేశము సంపాదించెను. ఇతని విలువను గ్రహించి తమ్ముడీ రత్నమును దస యన్నకు కానుకగా నొసంగెను. రాను రాను కవిసార్వభౌమ బిరుదాంకితుడై యాస్థాన కవి పదవి నధిష్టించెను. రాజాజ్ఞ ప్రకారము దర్బారు సహాయముపొందు నాలుగు వందల కవులు తమ తమ రచనల నీ మహాకవికి జూపించి తప్పుల దిద్దించుకొని రాజుకు నివేదించుచుండిరి. గొప్ప గొప్ప కవులు 'అన్సురీ' పైననే కసీదాలు వ్రాసి చదివి బహుమతుల నొందుచుండిరి. 'అన్సురీ' కవి రాజానుగ్రహము వలన రాజ్యభోగముల ననుభవించెను. శ్రీనాథుని కర్పూర తాంబూలాదులు, పల్లకీలు మున్నగునవి ఈ కవిసార్వభౌము డనుభవించిన భోగముల క్రింద విలువ లేనివి; నిలువ జాలపు నాల్గువందల గులాములు జరీ కమర్‌బందులు

వేసుకొని యాస్థాన కవిగారి వెంబడి బరాబరులు చేయుచు నడచుచుండిరి. ప్రయాణము వెళ్ళినప్పుడితని కనక, రజత, వస్తు సముదాయమును, ఇతర సంభారములను మోసికొనిపోవుటకు నాలుగువందల యొంటెలు వెంట వచ్చుచుండెనట. నాలుగు వందల కవులున్నను 'మహమూద్' యొక్క కీర్తి చంద్రికలను దిగంతములందు వెదజల్లి, యతని యశస్సును జిరస్థాయిగా నొనర్చి, ఋణము తీర్చుకొనిన మహాకవి యితడే. మహమూద్ యొక్క విజయ యాత్రలను, అతని జీవిత చరిత్ర భాగములను వర్ణించి రాజును చిరస్మరణీయునిగా నొనర్చి కృతకృత్యుడయ్యెను. మహమూద్ తరునాత పది సంవత్సరములకు (431 హిజ్రీలో) మరణించెను. ఇతడు ముప్పది వేల ద్విపాత్తులను (ద్విపదలను) వ్రాసెను. కాని మూడు వేలు మాత్రము దొరకుచున్నవి. 'కసీదా'లే గాక యనేక 'మస్నవీ'లు వ్రాసెను. 'వామెక్ వ ఇజ్రా', 'సుర్ఖుబుత్ వఖంగ్' 'నహ్రోఐన్' మున్నగునవి. కాని యవి యుపలబ్ధములు కావు. ఆశుకవిత్వమందీ కవికి గలశక్తి నిరుపమానము.

వెంటనే తగిన యుత్తరమును తగిన భాషయందిచ్చు శక్తి వలననే, నాల్గువందల కవులమధ్య సుల్తాన్ మహమూద్ వంటి మహారాజు దర్బారునందు, అప్రతిమానమైన ప్రశస్తి చెదరిపోకుండ అవిచ్ఛిన్నముగా నా జన్మాంతము లభించినది. ఒకనాడు రాత్రియంతయు దర్బారు జరిగినది. ఒక వేయి పద్యము లాశువుగా 'అన్సురీ' మహాకవి చెప్పెనట. ఈ కవియొక్క యాశు కవితా ధారను గురించి 'తజ్కిరాల'లో అనేక గాథలు గలవు. సుల్తాన్ మహమూద్ వద్ద 'అయాజ్' అను నొక సుందరుడైన గులాం ఉండెను. మహమూద్‌కు వానిపై మిక్కిలి మక్కువయని చరిత్ర ప్రసిద్ధము. కావ్యగతమైన విషయము. ఒకనాడు 'అయాజ్'పై గోపించి నీ కురులు కత్తిరించి వేయమని పలికెనట. వాడు ప్రభువు నాజ్ఞ ప్రకారము వెంటనే మెలికలు మెలికలుగా నుండి భుజద్వయముపై వ్రేలాడుచు, ప్రభుదృష్టినెప్పుడు నాకర్షించి నతని మనస్సున కానందమును గూర్చుచుండు తన నల్లని కురులను గత్తిరించి వేసెను. మరునాటి వేకువతో 'అయాజ్' ముఖము జూచి అత్యంత దుఃఖితుడై వనటచే బాధనొంద సాగెను. ఈ సంగతిని 'అన్సురీ' కవి యాశువుగా నొక గీతము రచించి, పాడి మనస్సును రంజింపజేసి వనట బాపెనని యొక గాథ. ఇట్లనే కొదంతములు వక్కాణింప

బడినవి. కసీదాలందు నీ కవి సార్వభౌముడు 'అన్సురీ' మున్నగు వారికంటే తీసిపోడని షిబ్లీగారి యభిప్రాయము. ఈ కసీదాలు కేవలము ప్రభుస్తుతికై యేర్పడి యుండినను 'అన్సురీ' వీని నితర ప్రయోజనములందు నుపయోగించెను. కసీదాలలో యుద్ధవర్ణనము, ప్రకృతి వర్ణనము సందర్భానుసారముగాఁ బొందుపరచి ప్రతిభను వెలిబుచ్చెను. ప్రకృతి శోభను, ప్రత్యేక జంతువుల వర్ణనలను మిగుల నేర్పుతో గావించెను. రెండు చరణములందు నొకే 'వజన్' గలిగిన - అనగా సమాన మాత్రలు గలిగి సమప్రాసలుగల -పదముల నుపయోగించుట యీ కవి ప్రత్యేక లక్షణము. ఈ యలంకారము నీతని తరువాతి కవులు విరివిగా వాడుచు నీతని ననుకరించిరి. అతిశయోక్త్యలంకారమును సహజముగా నెక్కువ నుపయోగించినను తరువాతి కవు లీతని నధిగమించి వన్నెపెట్టిరి. 'ఖాఆనీ', 'అన్వరీ', 'అమీర్‌ఖుస్రో' మున్నగు వారితో బోల్చి చూచిన నీతని యతిశయోక్తులు చప్పగా గాన్పించును.

## ఫర్రుఖీ

ఇతని పేరు అలీ. పుట్టుక సీస్తాన్. తండ్రి పేరు 'కులూ'. సీస్తాన్ యొక్క గవర్నరు దర్బారులో నుద్యోగిగా నుండెను. చిన్నతనమందు సాహిత్య సంగీతము లభ్యసించి 'చంగ్' వాద్యమును బాగుగా వాయించుచుండెను. ఒక జమీందారు వద్ద నుద్యోగము. అమీరు యొక్క దాసి నొకతెను పెండ్లాడుటచే వ్యయమెక్కువగుట, జమీందారుడు జీతమును హెచ్చింపకపోవుట జరిగెను. ఇతడు కావ్యములందు మంచి ప్రవేశమును, ప్రశంసనీయమగు కవితాధారయు గలిగియున్నందున 'అబుల్' ముజఫరు చుగానీ' యను బలఖు గవర్నరును దర్శించుటకై వెళ్ళెను. అబుల్ ముజఫర్‌కు అశ్వములపై మిక్కిలి ప్రేమ. 18 వేల ఆడ గుఱ్ఱములు వాటి పిల్లలు ఎల్లప్పటికి నడవులలో జరించుచుండెనట. సంవత్సరమున కొకసారి సరిజూచుకొని వాటికి మచ్చలు (చిహ్నములు) వేయించుచుండెను. 'ఫర్రుఖీ' దర్శనార్థము వెళ్ళినప్పుడు ప్రభువూరలేడు. మచ్చలు వేయించుటకై వెళ్ళియుండెను. అతని ముఖ్త్యార్ (ప్రతినిధి) అగు 'అమీద్ అసఅద్'ను దర్శించెను. ఫర్రుఖీ యొక్క రూపమును జూచి యాశ్చర్యపడి ఇతడు కవి యెట్లగునో యని వితర్కించి, కనికరించి రాజదర్శనమిప్పించుట కొప్పు కొనియెను. కాని గుఱ్ఱములకు మచ్చలు వేయించు 'దాగ్‌గాః' (మచ్చలు

వేయు స్థలము) అను నా యుపవనము ప్లానునిచ్చి, సంగతి సందర్భములు దెలిపి, ఒక కసీదా నా యుపవనమును వర్ణించుచు వ్రాసి తెమ్మని యాజ్ఞాపించెను. మరునాడక్లే కసీదాను వ్రాసి తేగా 'ఫర్రుఖీ'ని వెంబడించుకొని వెళ్ళి ప్రభు దర్శనము జేయించి 'దకికీ' తరువాత నింత గొప్ప కవిలేడని పరిచయము గావించెను. ఉచిత స్థానము నలంకరింపజేసెను. మధుపానము జరుగుచుండెను. రెండు మూడుసార్లు జరిగిన పిమ్మట 'ఫర్రూఖీ' నిలుచుండి తాను మొదట వ్రాసి తెచ్చిన 'కసీదా'ను వినిపించెను. ప్రభువానందించి "ఇచట నీ ముందు వేయి గుఱ్ఱపు పిల్లలు గలవు. నీవు పట్టుకొనగలిగినన్నిటిని తీసుకొనుము, నీ కొసంగితి"నని వచించెను. ఫర్రుఖీ మధుపానోన్మత్తుడై యొక గుఱ్ఱముల గుంపులోని కురికి పట్టుకొనుటకు బ్రయత్నించెను. గుఱ్ఱపు పిల్లలన్నియు చెవరి పారిపోవ వాని వెంబడి పరుగెత్తి యెత్తి వేసారి యలసి సొలసి పడిపోయి నిద్రించెను. మరునాడు ప్రభువు దర్బారునకు రావించి యొక గుఱ్ఱము, డేరా, ఐదుగురు గులాములు, మూడు ఒంటెలు, అతడు తాకిన గుఱ్ఱపు గుంపులో 42 గుఱ్ఱములను బహుమతిగా నొసంగెను. కొంత కాలమైన పిదప సుల్తాన్ మహమూద్ యొక్క దర్బారునందు ప్రవేశించెను. రానురాను మహమూద్ యొక్క యనుగ్రహమువలన భోగభాగ్యముల నత్యధికముగా ననుభవించుచు సుఖించెను. మహమూద్ యొక్క ప్రియుడైన గులాము 'అయాజు' ఈ కవిని మిగుల గౌరవించుచుండెను. వీరిద్దరి స్నేహ మధికమై సుల్తాన్‌గారి యసూయకు పాత్రమయ్యెను. కవికి దర్బారు ప్రవేశము లేకుండ యుత్తరు వొసంగబడెను. అనేక కసీదాలు వ్రాసి క్షమాపణ చేసుకొని మరల దర్బారు ప్రవేశమున కనుజ్ఞవడసెను.

ఫర్రూఖీ 'శబ్దాలంకారము' లపై నొక గ్రంథమును వ్రాసెను. ఇతని కవనము మాత్రము శబ్దాలంకారములు లేక ధారా ప్రవాహము కలిగి, వేయి సంవత్సరములు గడిచినను నేటి ప్రచలితమగు శిష్ట వ్యవహార భాష వలెనే కన్పట్టునని షిబ్లీగారి యభిప్రాయము. 'ఖా ఆనీ' కవి భాషయొక్క ఈ శైలినే పరిపక్వ దశకు దెచ్చెను. 'ఫర్రుఖీ' కవి ఏ యుదంతమును గాని, ఏ వస్తువును గాని వర్ణించినప్పుడు కనులకు గట్టినట్లు చిత్రించును.

సుల్తాన్ మహమూద్ ప్రత్యేకమైన యుపవనము నొక దానిని నిర్మించెను. రంగు రంగుల పువ్వులు గల పచ్చిక బయళ్లు, సరూ వృక్షములు గలిగి కృతక తటాకములో వివిధ వర్ణముల చేపలు, ముత్యపు కర్ణాభరణములు వ్రేలాడ నీదు చుండెను. చిత్రశాల యందు మహమూద్ యొక్క చిత్రపటములు వేటాడు చున్నట్లును, మధుసేవ చేయుచున్నట్లును చిత్రింపబడి యుండెను. ఫర్రుఖీ ఈ యుపవనమును కన్నుల గట్టినట్లు సుందరముగా నొక కావ్యమున జిత్రించెను. అట్లే వందల కొలది జరిగిన యుదంతములను చిత్రకారునివలె సరసముగా జిత్రించి చరిత్ర కుపకరించు విషయములను గ్రంథస్థ మొనరించెను. సోమనాథ విజయమును గురించి వ్రాసిన యొక కసీదాలో మార్గ మధ్యమున గలిగిన ప్రయాసలను, ముట్టడించిన కోటలను, చూచిన సరస్సులను, రమ్యముగా వర్ణించినాడు. ఒక కసీదాలో మహమూద్ వనమును ముట్టడి చేసి మృగయా వినోదము గావించిన యుదంతమును వర్ణించెను. ఫర్రుఖీ కంటె పూర్వము 'మర్సియా'లు చాలా తక్కువ. ఉన్నవి విలువలేనివి. ఫర్రుఖీ మహమూద్ యొక్క మరణముపై వ్రాసిన మర్సియా (Elegy) విషాదభరితమై దుఃఖరసము నుబికించుచు మర్సియాకు కావలసిన మూడు లక్షణములతో గూడి యున్నది. ఆ మూడు లక్షణము లేవన—

1) మృతుడైనవాని గొప్పదనమును బేర్కొని, అంతవానికి నీ మృత్యువు తప్పలేదని వాపోవుట.

2) అతని మరణము వలన రాష్ట్రమునందు, ప్రజల యందు గలిగిన దుఃఖ సంతాపములను వెల్లడించుట.

3) మృతుడైన వాని నుద్దేశించి, దుఃఖావేశమున వాడు మృతుడైనది మరచి జీవించిన వాని నుద్దేశించి వ్యక్తపరచదగిన భావములను గూడ వ్యక్తపర చుట. మాట్లాడుట.

ఫర్రుఖీ, మహమూద్ విషయమై వ్రాసిన మర్సియాలో నీ గుణములు మూడు నుండుటయే గాక కరుణరస తరంగితమై పాషాణమునైనను గలిగించు నట్టి భాష యందు వ్రాయబడి యున్నది. 'ఫర్రుఖీ' కవి పౌరాణిక గాథల నుండి యుపమానములను గల్పించి సమంజసముగా నుపయోగించినాడు శబ్దాలంకా రములను అప్పుడప్పుడు వాడినను అవి వికారముగా నుండవు.

## ఫర్దూసీ

మహాకవి ఫర్దూసీ యొక్క పేరు 'హసన్ బిన్ యిస్ హాక్ బిన్ షరఫ్' కొన్ని తజుకిరాలలో తండ్రి పేరు 'మన్సూర్ బిన్ ఫఖురుద్దీన్' అని వ్రాయబడి యున్నది. ఈ మహాకవి యొక్క జన్మస్థానమగు గ్రామమును గుఱించియు నభిప్రాయభేదము గలదు. కాని 'తూస్' జిల్లా వాడని మాత్ర మందరు నంగీక రింతురు. 'ఇమాంగజాలీ', 'మొహక్కిక్‌తూసీ' మున్నగు పండితోత్తముల జన్మ స్థానమైనదీ జిల్లాయే పుట్టిన సంవత్సరము తెలియదు. మృతినొందినది హి. 411. దాదాపు హి. 329 జన్మవత్సరమై యుండునని షిబ్లీగారి యభిప్రాయము. ఫర్దూసీ పుట్టినప్పుడు కుర్రవాడు మేడపైకెక్కి యరచినట్లును, ఆ యరపు విని ప్రజలందఱు చప్పట్లచే సంతసమును వెల్లడించినట్లును తండ్రి కలగనెను. దైవజ్ఞుని కడకేగి స్వప్నము యొక్క అర్థము నడుగగా "ఈ కుఱ్ఱవాడు మహా కవి యగును. వీని యశస్సు నల్దిశల బ్రాకు"నని వచించెను. భూస్వామియగుట వలన విద్యా విజ్ఞాన సముపార్జనము నిరాటంకముగా గావించెను. "షాహనామా" ప్రారంభమును గుఱించిన గాథలలో ముఖ్యమైన కథ మహమూద్ గజ్నవీ ఈ గ్రంథమును వ్రాయుటకై యీ కవిని నియోగించె నను నది సుప్రసిద్ధమైన విషయము. కాని యిది నిజమైన చరిత్ర కాదనియు, శుద్ధ అబద్ధమైన విశ్వాస మనియు 'షాహనామా' గ్రంథము వలననే తెలియుచున్నది. ముప్పదియైదు సంవ త్సరముల కాలమీ గ్రంథరచన యందు పరిశ్రమ గావించితినని కవి స్వయ ముగా చెప్పుకున్నాడు సుల్తాన్ మహమూద్ 31 సంవత్సరములు మాత్రమే ప్రభుత్వము గావించెను. షాహనామా యొక్క యుపోద్ఘాతమున కవియే గ్రంథ రచన యొక్క కారణమును వివరించియున్నాడు. దానివలననే మహమూద్ దర్బారునకు ఫర్దూసీ రాకపూర్వమే 'షాహనామా' యొక్క రచనము నారంభించి యుండెనని తెలియుచున్నది. 'షాహనామా' యొక్క ప్రారంభము 'అబుల్ మన్సూర్' యొక్క ప్రోత్సాహమువలన 'ఫర్దూసీ' తన జన్మభూమి యగు 'తూస్' నందే కావించియుండెను. 'అబుల్ మన్సూర్' మరణానంతరము 'తూస్'కు గవర్నరుగా నియమింపబడిన 'సలాన్‌ఖాన్' అనువాని కాలమున 'షాహనామా' పేరు ప్రతి స్థలమునందును బ్రచారమయ్యెను. సుల్తాన్ మహమూద్ చెవినిబడిన తరువాత కవిని తన దర్బారునకు పంపించుటకై ఖానున కాజ్ఞ యొసంగెను. తొలుదొల్త నిరాకరించెను గాని పిదప తన చిన్ననాటి దైవజ్ఞుడగు

'షేఖు మాషూక్' గారి భవిష్యద్వాక్యములను స్మరించుకొని ఫర్దూసీ యియ్యకొనియెను. ఇట దర్బారులోని కవులందరి యందు సంచలనము గలిగెను. మహమూద్‌కు మొదటినుండి 'షాఃనామా' గ్రంథమును రచింపజేయవలయునను నభిలాషయుండెను. తన యాస్థాన కవులెవరు నీ పనికి పూనుకొనక యుండిరి. ఇట్టి తరి తాను స్వయముగా నీ యుద్గ్రంథమును రచింప నారంభించిన మహాకవి తన యాస్థానమున జేర, నతనికి మహా గౌరవము తప్పక కలిగి, 'అన్‌సురీ' మున్నగు రాజాదరణకు పాత్రులై యున్నవారందరి గౌరవము తగ్గును. కనుక అన్‌సురీ కవి, దర్బారు మున్షీ యిద్దరు ఎటులైన ఫర్దూసీ దర్బారుకు రాకుండునటుల జేయవలయునని కుట్రపన్ని 'హిరాత్'కు జాబు వ్రాసిరి. "రాజు మాట వరసకు నిన్ను రమ్మని వ్రాయించెనేగాని యిప్పుడు మరచిపోయినాడు. నీ రాక వల్ల లాభము లేదు" అని యా జాబులో వ్రాసిరి. ఈ జాబు గాంచి సందేహించుచున్న కవికి కుట్రపన్నిన యిరువురిలో మున్షీ యొక్క మరియొక జాబు అందినది. మొదట వ్రాసిన కమ్మ యాస్థానకవి యగు అన్‌సురీ యొక్క కుట్ర ఫలితమనియు, సత్వరమే దర్బారుకు రావలయుననియు రెండవ జాబు. ఈ కమ్మ జూచి కవి గజనైన్ నగరమునకు వచ్చి పురపరిసరమున గల యొక యుపవనమున విడిసి, నమాజు చదివి, తోటలో పచారు చేయుచుండెనట. విధి వశమున అన్‌సురీ, ఫర్రుఖీ, అస్జదీ ముగ్గురు కవులును విహారార్థమా తోటలోనికి వచ్చి మధుసేవాపరాయణులై యుండిరి. ఫర్దూసీ రాక వారికి కటువుగా దోచి యే యుపాయముచేనైన నతనిని తోటనుండి తొలగించవలెనని నిశ్చయించుకొనిరి. కష్టమైన ప్రాసగల యొక రుబాయీని ఆరంభించి ముగ్గురు మూడు చరణములు పూర్తిగావించిరి. నాలుగవ పాదము పూరించుటకు ఫర్దూసీకి పదము లభింపలేదు. కాని షాఃనామా గ్రంథము నుండి యొక యుపమానమును దీసికొని యా పేరును ప్రాసస్థానమున వేసి రుబాయీని పూర్తి గావించి యందరిని ముగ్ధుల గావించెను. ఐనను ఈ కవికి రాజసభలో తొందరగా ప్రవేశము గలుగ లేదు. 'మాహక్' అను రాజాశ్రితుడగు నొక విద్వచ్ఛ్రియుని సహాయము వలన 'సొహరాబ్ రుస్తుం' కథను రచించి రాజసభలో వినిపింపజేసెను. రాజు విని అచ్చెరువును, ఆనందమును బొంది సత్వరమే కవిని రావింపజేసి గౌరవించెను. ఇతర కవులును జేయుపదిలేక యతని ప్రతిభ నంగీకరించిరి. మహమూద్ గజ్నవీ అతని నాశు కవితారచన యందును బరీక్షించి సంతృప్తుడై తన రాజ

భవనము కడ సకల సాధన సంపత్తులచే దులదూగు గృహమును నిర్మించి యిచ్చెను. పూర్వ రాజుల చిత్రముల చేతను, యుద్ధ పరికరముల చేతను నా గృహము నలంకరింప జేసెను. షాహనామా గ్రంథ రచనకై ప్రతి పంక్తికొక అష్రఫీ ప్రతిఫలమివ్వబడుననియు, వేయి పంక్తులు పూర్తియైన తోడనే వేయి యష్రఫీలు కవికొసంగబడవలయుననియు నుత్తరువొసంగెను. కాని తను జన్మించిన గ్రామమున నొక తటాకము నిర్మింప సంకల్పించిన కవి, గ్రంథము పరిపూర్ణమైనప్పుడే, ఒకేసారి ప్రతిఫలము గైకొందునని మనవి చేసెను. గజనీ నగరములో నాలుగు సంవత్సరములుండి గ్రంథరచన జేయుచుండెను. పిదప తన జన్మస్థానమునకేగి యట ననేక సంవత్సరములు గడపి రచింపబడిన భాగమును సమర్పించి ప్రశంసా పాత్రుడయ్యెను. షాహనామా రచన మారంభించిన యిరవై సంవత్సరములకు ఫర్దూసీ యొక్క యువకుడైన కుమారుడు గతించెను. ఈ పుత్ర దుఃఖమును సహింపలేక పోయెను. షాహనామా పరిపూర్ణమైన పిదప నీ మహాకవి యొక్క కృషిని, కవితామృతమును గౌరవింపక మహమూద్ వంటి విద్యాప్రియుడు, కవి పండిత పోషణయందు బిరుదు వహించినవాడు, అష్రఫీలకు బదులు రూపాయలు ప్రతిఫలముగా నిప్పించిన గాధ వాఙ్మయ చరిత్ర యందొక విషాదకరమైన ఘట్టము. ఈ యుదంతము నిజమని యంద రంగీకరించెదరు కాని, కారణములు పరస్పర విరుద్ధములైనవని పలువురు వచించియున్నారు. దౌలత్‌షాహ్ ఫర్దూసీకవి మహమూద్ యొక్క ప్రియసేవకుడగు 'అయాజ్' నెప్పుడు స్తుతింపనందున నతడు రాజును దుర్బోధగావించెనని వ్రాసినాడు. నిజామీ ఉరూజ్ 'చహర్ మకాలా' గ్రంథకర్త ప్రధానామాత్యుడగు హసన్ మైమందీ ఫర్దూసీ పోషకుడైనందునను, దర్బారు యొక్క విద్వాంసులు మున్నగు వారిలో నెక్కుడు భాగము ప్రధానామాత్యునికి విరుద్ధులై యుండుట వలనను, వీరందరూ ఫర్దూసీకవి 'రాఫిజీ' అనగా అసహిష్ణుడగు 'షియా' సంప్రదాయము వాడని మహమూద్‌నకు దుర్బోధగావించిరని తెలుపుచున్నాడు. కాని ఉపోద్ఘాత రచయిత హసన్ మైమందీ స్వయముగానే యీ కవికి విరోధియై యుండెనని వ్రాసియున్నాడు. మరి కొందఱు ఫర్దూసీ కవి షాహనామాలో ననేక స్థలములందు వంశగౌరవమును గొనియాడుచు నందువలన గలుగు సహజ గుణ సంపద నుగ్గడించినాడు. వంశగౌరవ విహీనుడైన మహమూద్, కవి యొక్క ఈ వాక్యములు తనను గుఱించిన పరోక్ష నిందాసూచకములని భావించి యట్లు

చేసెనని వ్రాసిరి. 'తజుకిరాలు' వ్రాసిన వారంచరేకగ్రీవముగా ఫర్దూసీ 'షియా' యైనందువలన మహమూద్ యొక్క యగౌరవమునకు పాత్రుడయ్యె నందురు. కాని మహమూద్ దర్బారునందు హిందూ, ఫారసీ, క్రైస్తవ, సున్నీ, షియా మహమ్మదీయ విద్వజ్జనులందరునుండి రాజాదరణమును గాంచుచుండిన విష యము చరిత్ర ప్రసిద్ధమైయుండ మహమూద్‌నకు నచ్చని షియా సంప్రదాయము నకు జెందిన వాడైనంత మాత్రమున నిట్టి యకృత్యమున కొడిగట్టుననుట విచిత్రముగా నుండును. ఉపోద్ఘాతమునందు వ్రాయబడిన మరియొక కారణము సమంజసముగా గనబడుచున్నది. ఫర్దూసీ కవిని దైలమీ వంశస్థుడగు ఫఖరుద్దౌలా ప్రభువు మిగుల గౌరవించుచుండెను. ఈ వంశము వారంచరును అసహిష్ణులై సున్నీలను నిందించు రాఫిజీ తెగకు జెందినవారు. రుస్తుం యిస్పందియారు కథను రచించి వినిపించినపుడు వేయి అష్రఫీ లితడు బహుమతి నిచ్చెను. ఈ యుదంతమువిని మహమూద్ కోపించెను. అనేక కారణముల వలన దైలమీ వంశ ప్రభువులతో మత సంబంధమగు వైరమే కాక రాజకీయ వైరుధ్యము గూడ నుండెను. ఫర్దూసీ వారి కత్యంత స్నేహ పాత్రుడైయుండుట మహమూద్ నకు గిట్టక కోపకారణమై యుండును. కారణములేవియైనను, మహమూద్ ప్రభువు ఫర్దూసీ మహాకవి నాదరించి, తన వాగ్దత్తము నుండి తొలగి దత్తాపహార పాపము నకు బాలుపడి, శాశ్వతమగు నపయశమునకు పాత్రుడయ్యెనని చరిత్ర యంగీక రింపవలసి యున్నది. స్నానము జేయునప్పుడు రాజసభనుండి పారితోషిక మయాజు వెంబడి కవిగారి కందజేయుటకై వచ్చినది. ఉత్సుకుడైన వృద్ధకవి స్నానానంతరము స్వర్ణనిష్కములకు బదులు రజత రూప్యములను దిలకించి సద్యస్ఫురితమగు నుద్రేకముతో "నేనీ వెండి రూకలకై ముప్పదియేండ్లు కృశింపలేదు. తిరిగి మీ రాజుకే సమర్పించు"మని నిరాకరించెను. మహమూదీ యుదంతము విని మిగుల పరితపించి హసన్ మైమందీ, వజీరు మున్నగు దర్బారు వారిని "మీరు నా యపయశస్సునకు గారణభూతులైతి"రని మందలించెను. కాని వారు తప్పు కవిదని, పారితోషికము తక్కువైనను రాజ బహుమానమును నిరాకరించినవాడు శిక్షార్హుడని నచ్చజెప్పగా మహమూద్ క్రుద్ధుడై మరునాడు వానిని శిక్షింతునని నిశ్చయించెను. ఈ సంగతి తెలిసి కవి మిగుల పరితప్తుడై మరునాడుదయము తోటలో విహరించు సమయమున రాజుగారికి సాష్టాంగ మొనర్చి క్షమాపణ వేడుకొనెనట. మహమూద్ క్షమించి దండింపక విర

మించెనట. ఎట్టకేలకు గజనైన్ నగరమును వీడి 'హిరాత్' పట్టణమునకు వెళ్ళునప్పుడు ఫర్దూసీకవి యొక కాగిదమును లకోటాలో భద్రపరచి "నేను వెళ్ళిన యిరవై రోజులకు దీనిని మహమూద్ ప్రభువున కొసంగు" మని 'అయాజు' చేతికిచ్చెను. అందులోగల పద్యములే నిరాశాతప్తుడై క్రుద్ధుడైన వృద్ధకవి 'మహమూద్'ను గురించి వ్రాసిన సుప్రసిద్ధ నిందా కావ్యము.

మహమూద్ గజ్నవీ ప్రపంచమందలి ముఖ్యములైన రాజ్యముల నెన్నిటినో తలక్రిందొనర్చి నాశన మొనరించెను. కాని కావ్య ప్రపంచమందలి యీ చిన్న నిందాకావ్యమును మాత్రము నశింపజేయుట కసమర్థుడయ్యెను. తన యపయశస్సును చిరస్థాయిగా నొనర్పజాలు కవి వాక్యములను దుడిపించ శక్తిలేకపోయెను. ఇది వాఙ్మయ ప్రపంచము యొక్క సార్వభౌమత్వము!

ఫర్దూసీ గజనైన్ నుంచి వెళ్ళి 'హిరాత్' నగరమునకు, అక్కడినుంచి 'తూస్' పట్టణమునకు, తూస్' నుండి 'ఖహిస్తాన్'కు, అచ్చటినుండి 'మాజిందరాన్'కు, అటనుండి 'బాగ్దాద్'కు ప్రచ్ఛన్నముగా రాజభటుల కనులబడకుండ తిరగవలసి వచ్చెను. చేజిక్కినచో నతనిబట్టి తన దర్బారుకు గొనితెమ్మని **మహమూద్**యొక్క కఠినమైన యాజ్ఞ. కాని ప్రతిభాశాలియు, నాత్మగౌరవంగల నీ వృద్ధకవిని ప్రతి నగరమునందును నచటి ప్రభువులు, విద్వజ్జనులు, ధనవంతులు, గౌరవించి బహూకరించిరి. ఐనను మహమూద్‌నకు వెరచి త్వరలో మరియొక స్థలమునకు బంపించివేసి తమనుదాము మహమూద్ యొక్క కోపాగ్నికి గురిగాకుండ రక్షించుకొనిరి. ఒకవైపు కవి యజ్ఞాతవాస మొనర్చుచుండ, మహమూద్ యొక్క భారతదేశ విజయయాత్రలు సాగుచుండెను. ఒకసారి **భారతదేశముపై** దండెత్తిపోయి తిరిగివచ్చుచు త్రోవలో నొక శత్రువుల కోటను గాంచి వెలుపల నిలచి రాయబారిని పంపెను. రాయబారి తిరిగివచ్చి బదులు చెప్పకమున్నే యుత్సుకుడైన రాజు ప్రధానామాత్యునితో ఏమని బదులు వచ్చినదని యడుగ నతడు వెంటనే ఫర్దూసీ మహాకవి రచించిన యొక చరణమును జదివెను:

అగర్ బూజ్ బకాం ఆమద్ జవాబ్
మన్ వ గర్జ్ వ మైదాన్ వ అఫ్రాసియాబ్

మహమూద్ దీనినెవరు వ్రాసిరని ప్రశ్నించెను. ప్రధాని దురదృష్ట వంతుడగు నా ఫర్దూసీ రచనయే యని స్మరింపజేసెను. రాజత్యంత పరితప్త హృదయుడై 'గజనైన్' నగరమునకు వెళ్ళిన పిదప జ్ఞాపకము చేయుమని ప్రధాని కాజ్ఞనొసగెను. నగరము చేరిన పిదప నరవైవేల స్వర్ణనిష్కములు పారితోషికమును ఫర్దూసీ కవికై పంపించెను. అదృష్టరేఖా బలమేమోగాని 'తూస్' నగరము యొక్క 'రూద్‌బార్' అను పేరుగల నగరద్వారమునుండి యీ పారితోషికముతో రాజభటులు ప్రవేశించిరి. మరియొక ద్వారమునుండి మహాకవి యొక్క శవము బయలువెడలెను. అసహిష్ణుడగు నక్కడి ముస ల్మాను మతాధికారి యొసంగిన యుత్తరువునకు బద్ధులై నగరవాసులతని శవమును సార్వజనికమైన శ్మశానమందు ఖననము గావింపనీయలేదు. అతని స్వీయమగు నుపవనము నందే ఖననము గావించి సమాధిని నిర్మించిరి.

## షాహనామా

సామాన్యముగా మహమూద్ గజ్నవీ యొక్క ప్రోత్సాహముచే ఫర్దూసీ ఈ గ్రంథమును వ్రాసెనని ప్రతీతి. కాని చారిత్రకముగా నిజమైనది కాదు. ఫర్దూసీ తన గ్రంథాంతమున హిజరీ 400 సంవత్సరమున రచన పూర్తియైన దనియు, ముప్పదియైదు వర్షములు కృషిచేసితిననియు వ్రాసుకొన్నాడు. ఇట్లు హి. శ. 365 లో నీగ్రంథ మారంభింపబడియుండెను. సుల్తాన్ మహమూద్ హి. శ. 388లో రాజ్యపదవిని స్వీకరించెను. మహమూద్ కంటె 23 సంవత్సర ములు పూర్వము గ్రంథరచన మారంభమైనది. మరియొకచోట "నీ యుద్గ్రంథ మునకై కృతిపతి కాగల యోగ్యత యెవనికి గలదని విచారించుచుంటిని. యిరవై సంవత్సరములు కావ్యకృషి జరిగిన తరువాత మహమూద్ వంటి భర్త లభించెన"ని వివరముగా పలికినాడు. ఇంతేగాక యీ గ్రంథరచన ధనాపేక్షచేత గాని లేక రాజాజ్ఞపై గాని చేయలేదని స్పష్టముగా కావ్యమునందే తెలిపియున్నాడు. "నా పేరు శాశ్వతముగా ప్రపంచమున నిలుచునటును, విస్తృతమైన ఈరాన్ దేశము యొక్క ఘనతను చిరస్థాయిగా నుండునటుల ప్రపంచమునకు జాటుట కును ఈ ప్రయత్నము జేయుచున్నా"నని వ్రాసుకొన్నాడు. కాలము యొక్క యాఘాతములకు బాల్పడి నాశనమందకుండ పూర్వరాజుల చరిత్రమును గాపాడినాననియు, 'ఈసా', జీసనువలె మృతినొందిన ఈరాన్ రాజులందరిని

తిరిగి యమరులగావించితి ననియు సగర్వముగా బలికియున్నాడు పైకారణములే కాక ఫర్దూసీ స్వయముగా ఈరాన్ రాజుల జాతికి జెందినవాడు. 'దకీకీ' కవి వ్రాసిన 'షాహనామా' భాగమావరకే సుప్రసిద్ధమై జనుల వాణులపై నాడుచుండెను. ఈ గ్రంథములో నున్న జనరంజకత్వమును గ్రహించి రచనకు గడంగెను. మిత్రుడొకడు పహ్లవీ భాషలో నున్న 'నామేఖుసురవాన్' అను పహ్లవీ 'షాహనామా' సతని కందించెను వ్రాయుట కారంభించినప్పుడు తెలిసిన యమీర్లందరు సాయ పడ నెంచిరి కాని 'తూస్' నగరము యొక్క యధికారియగు 'మన్సూర్ బిన్ మహమ్మద్' స్వయముగా మిగుల ప్రోత్సహించెను. మన్సూర్ మరణానంతర మీతని స్థలమునం దధికారిగా వచ్చిన 'హుసేన్ కతీబు' ఫర్దూసీ గ్రామములపై విధింపబడిన పన్నును మాఫీ చేసెను. 'అలీదైలమీ', 'బూదల పురావీ' యను మిత్రులిరువురు సంపన్నులు. ఫర్దూసీ కితర సహాయము జేయుటమే కాక కావ్య మును కంఠస్థ మొనరించుకొని వ్రాసిపెట్టుట యందు జేదోడు వాదోడుగా నుండిరి.

'షాహనామా'లో గల చరిత్రమునకు మూల గ్రంథములెవ్వి యను ప్రశ్న పండితులందరిని బాధించినది. సర్ జాన్‌మాల్కాం సామానీ రాజుల కంటే పూర్వము పర్షియా పూర్వ చరిత్రమును సేకరించు ప్రయత్నము గావింపబడ లేదనియు, అరబ్బులు జయించిన పిదప ఈరానీయుల ప్రాత సంస్కృతి యొక్క చిహ్నములను, వాఙ్మయమును నాశనమొనరించిరనియు వారికీ విషయమున శ్రద్ధ గలుగలేదని వ్రాసినాడు. కాని ఈరాన్ యొక్క పూర్వ చరిత్ర గ్రంథ ములనేకములు, అరబ్బీ భాషలో రచింపబడినవి యుపలబ్ధములైనవి. 'బనీ ఉమయ్యా' ఖలీఫా హిషాంబిన్ అబ్దుల్ మలిక్ హి.105లో ప్రభుత్వమారంభించి నప్పుడే తన కాలమున నితర జాతుల గ్రంథముల ననువాదము జేయింప దొడగెను. ఫారసీ భాషయందలి 'రుస్తుం ఇస్పందారు', 'దాస్తానేబహ్రాం' గ్రంథ ములను తర్జుమా చేయించుటే కాక 'తారీఖె అజం' అను పేరున నరబ్బీ భాషలో ఈరాన్ దేశ చరిత్రపై సచిత్రమై విపులమైన గ్రంథమును రచింపించెను. 'ఖుదాయనామా', 'ఆయీన్‌నామా' యను ఫారసీ గ్రంథ ములు, వాని యరబ్బీ తర్జుమాలు గూడ నుండెను. 'సైదేముల్‌ఆకుల్‌నర్సు'

అను పేరున నాలుగు తర్జుమాలు లభించినవి. 'సాసునీరాజుల చరిత్రము', 'నౌషీరువాన్', 'అర్దుషీర్ బాబక్', 'బహరాం' మున్నగు వారి చరిత్రము పహ్లవీ భాషలో గ్రంథస్థమై యుండెను. రాజాజ్ఞలు, ఫర్మానాలు మున్నగు చారిత్రక పరికరములన్నియు దాదాపు సేకరింపబడి అరబ్బీ భాషలోని కనుదింపబడియుండెను. 'నౌషీర్వాన్' ప్రభువు 'హూర్ మజు' పేర వ్రాసిన విల్లునామా షాపూరు అర్దుషీరుల సంధిపత్రము మున్నగునవి సిద్ధముగా నుండెను. ఇంతేకాక ఇస్లామీ చరిత్రకారులు తబరీ - మసూదీ - అబూహనీఫా - యాకూబీ - హంజా అస్ఫహాని మున్నగువారు విపులమైన ఈరాన్ చరిత్ర గ్రంథములను రచించిరి. కాని ఇవి యన్నియు నరబ్బీ భాషలో నుండెను. ఫారసీలో పూర్ణమైన శాశ్వత గ్రంథమొక్కటియు లేకుండెను. 'షాహనామా' అను పేరుతో మరియొక గ్రంథము 'అబూ అలీ మహమ్మద్'చే రచింపబడినటుల తెలియుచున్నది. కాని 'దకీకీ' ఈ పనినారంభించునప్పటివరకు పై నుదాహృత గ్రంథములన్నియు ఫారసీ, యరబ్బీ భాషలలో సిద్ధముగా నుండెను. సామానీ రాజుల కాలమున వారి గ్రంథాలయము ప్రసిద్ధిజెందినది. అందులో నీ గ్రంథ జాల మంతయు నుపలబద్ధమై యుండునని తలచుట యసమంజసము గాదు. సుల్తాన్ మహమూద్ వారి స్థానము నాక్రమించినవాడు. ఈ సంపత్తినంతయు హస్తగత మొనర్చుకొనినవాడు- ఫర్దూసీకై తగిన రచనా సౌకర్యములను గూర్చినవాడు- కావున నీ గ్రంథము లన్నియు నుపయోగించియే చరిత్రమును గూర్చి యుండవచ్చును. 'ఖుదాయ్‌నామా', 'జామాస్పు', 'ఆయీన్ బహమన్', 'దారాజనామా' మున్నగు ఫారసీ గ్రంథములను పఠించియుండును. కాని ఫర్దూసీ కవి ఈరాన్ జాతీయాభిమాని. అరబ్బీ గ్రంథములను బేర్కొనడు. ఫారసీలో నచ్చటచ్చట వివిధ గాథలు గ్రంథస్థములై యుంచ తాను కృషిచేసి సేకరించితిననియు, తనకంటె పూర్వము వృద్ధులైన ఫారసీ పూజారులను సమావేశపరచి వారందరివలన దెలిసికొనిన గాథల నొక భూస్వామి సేకరించి సిద్ధపరచెననియు, వాని నాధారముగా గొని 'దకీకి' తన గ్రంథము నారంభించె ననియు వ్రాసికొన్నాడు. సామానీ రాజులలో నౌషీర్వాన్‌కు చరిత్ర గ్రంథములం దెక్కువ ప్రేమ. 'యజ్దు గర్ద్' రాజు తన కాలములో నుపలబ్ధమైన సామగ్రి నంతటిని 'దానిష్వర్ దెహకాన్' అను నొక విద్వచ్ఛ్రేయుడగు భూస్వామికి వశపరచి విపులమైన సమగ్ర గ్రంథమును రచింపజేయుటకై కోరెను. అట్లే

యతడు సిద్ధపరచెను. దీనిని 'ఉమార్' ఖలీఫా యొక్క విజయానంతరము, సేనానులు వినిపింప నివి పనికి రాని కథల పుస్తకమని త్రోసిపుచ్చెను. దోపిడీలో నొక అబిసీనియా సైనికునికి దొరికి అక్కడి ప్రభువునకు సమర్పింపబడెను. అక్కడినుండి భారతదేశము వచ్చెను. 'యాకూబ్ లైసు' తన కాలమున భారత దేశమునుండి తెప్పించి హి.శ. 360 లో ననువదింపజేసెను. ఈ గాథ సర్వమూ 'షాహనామా' యొక్క యుపోద్ఘాతములలో వ్రాయబడియున్నది. వివరములన్నియు విశ్వసనీయములైన పుక్కిటి పురాణములు గావచ్చును గాని 'దకీకీ' కవి మొట్ట మొదట నీ రచనను ప్రారంభించినప్పుడు కొంత యరబ్బీ గ్రంథజాలమును, ఖుదాయినామా మున్నగు పారసీ పహ్లవీ గ్రంథములును సిద్ధముగా నుండెను. వానినాధారముగా గొనియే 'షాహనామా' నారంభించెను. ఫర్దూసీ కవి యా పూర్వ వాఙ్మయము నంతటిని నుపయోగించుకొనియే యుండుననుట నిర్వివాదాంశము.

## 'షాహనామా' చారిత్రక ప్రశస్తి

(షాహనామా యొక్క చారిత్రకమైన విలువ)

షాహనామా కావ్య గ్రంథమైనందు వలన నందులో గల యతిశయోక్తులు, వర్ణనలు, యలంకారములు, దాని చారిత్రక మూల్యమును తగ్గించుచున్నవి. కాని ఈరాన్ దేశము యొక్క సమగ్రమైన చరిత్ర గ్రంథ మంతకంటే మరియొకటి కానరాదు. సర్ జాన్‌మాల్కం గారి యభిప్రాయమిదియే. గ్రీకు చరిత్రకారుల గ్రంథములను జూచి ఫర్దూసీ వ్రాసిన గాథల సత్యాసత్యములను బరీక్షించి యనేక విషయములు సత్యములేనని నిరూపించియున్నాడు. 'దేవే సుఫీద్' (శ్వేతయక్షుడు), 'జుహాక్ సర్పము', 'కై ఖుసురోయొక్క పానపాత్ర' మున్నగు విచిత్రమైన యమానుష గాథలను మన బుద్ధి నిజమని విశ్వసింపదు. కాని 'హెరోడోటసు' గ్రీకు చరిత్ర యందును నీ విధములగు గాథలనేకములు గలవు. వీనివలన గ్రంథమంతయు నసత్యమని భావించుటకును, విమర్శించుటకును వీలు లేదు. అట్లే చారిత్రకములగు మన పురాణేతిహాసములు కొన్ని మానవాతీతము లగు విషయములును, అతిశయోక్తులును గలిగినందువలన సత్యదూరములని త్రోసిపుచ్చుట మూర్ఖతయే యగును. జర్మన్ పండితులగు 'డార్మెంటీటర్', 'నియోల్డక్' అనువారలు ఇస్లాం కంటే పూర్వమగు 'అవెస్తా', 'పహ్లవీ' భాషల లోని గ్రంథజాలమును పరిశోధించి యమూల్యమగు సేవ గావించి యున్నారు.

వారిలో 'నియోల్డక్' పండితుడు 'షాఃనామా' యొక్క మూలాధారములను వెదకి గాథల సత్యాసత్యములను విమర్శించి ప్రత్యేకమగు గ్రంథము నీ విషయముపై వ్రాసియున్నాడు. వారి యభిప్రాయము ప్రకారము 'షాఃనామా' యొక్క గాథల లోని విశేషభాగ మనుశ్రుతముగానే దేశవాసులచే విశ్వసింపబడు నితిహాస మనియు, ఫర్దూసీ కవి నిష్పక్షపాతముగా సత్యముగా వానిని గ్రంథస్థము జేసె ననియు తెలియుచున్నది. ప్రొఫెసర్ బ్రౌన్ గారి యభిప్రాయము నిదియే. 'అవెస్తా' గ్రంథము రచింపబడిన కాలములో 'షాఃనామా' యొక్క ముఖ్యగాథలు ప్రచలితములై యున్నట్లు 'అవెస్తా' వల్ల తెలియుచున్నది. అవెస్తా గ్రంథము క్రీస్తు పూర్వకాలమునకు చెందినదని విమర్శకులు అభిప్రాయ పడుచున్నారు. ఇంతియేగాక గ్రీకు గ్రంథకర్తయగు 'టీసియాస్' (Ctesias) క్రీ॥పూ॥ 500 సంవత్సరముల కాలమున 'అర్టాక్జెర్జిస్' (Artaxerxes Mnemon) వద్ద వైద్యుడుగా నుండెను. అతడు ఈరానీ గ్రంథముం సహాయముచే వ్రాసిన గ్రంథమున నీ గాథలన్నీ కొంత రూపాంతరమును గలిగి వక్కాణింపబడి యున్నవి. దాదాపు ఇదే కాలమున అనగా క్రీ.పూ. 500 సంవత్సరములప్పుడు రచింపబడిన 'యాత్కారె జరీరాన్' అను ప్రహ్లావీ గ్రంథమునందు ఈ వీరగాథల మూలము యథాతథముగా గనపడుచున్నది. ఈ మూలమునే యాధారముగా గొని కథా భాగమును వర్ణించి, విస్తృతమైన గ్రంథమును రచించినట్టు లగపడు చున్నది. దీనికి 'పహ్లావీ షాఃనామా' యను పేరుగూడా కలదు. 'తబరీ' మున్నగు వారు గావించిన తర్జుమాలందును సరిగా నివే గాథలు వర్ణితములై యున్నవి. మరియొక గ్రంథము కార్నామక్ అర్తఖ్షర్ పాపకాన్ అనునది కలదు. (జర్మనీలో పహ్లావీ మూలము, జర్మన్అనువాదము రెండును ప్రకటింపబడినవి). అందులో కొన్ని గాథలు వర్ణితములైనవి. 'దేహకాన్ దానిస్వర్'చే గూర్చబడిన పహ్లావీ మూలగ్రంథముగాని, 'ఖుదాయనామా' యొక్క అరబ్బీ తర్జుమా గానీ లేక 'అల్బెరూనీ' పండితుడు, నియోల్డక్ పండితుడు నుదాహరించిన నలుగురు ఫారసీకులచే 'తూసీ'లో రచించిబడిన ఫారసీ గ్రంథముగానీ లభింపలేదు. కాని మొత్తము మీద 'షాఃనామా'లోని చరిత్రము ఈరాన్ దేశముయొక్క జాతీయే హాసమని నిరాటంకముగా జెప్పవచ్చును. 'కార్నామక్', 'యాత్కారె జరీరాన్' అను రెండు పహ్లావీ మూల గ్రంథములను 'షాఃనామా'తో బోల్చి చూపి, ఫర్దూసీ వివరములందును మూలముం నుండి వ్యతిరేకింపక యథాతథంగా కథలను వర్ణించి సత్యమైన ఇతిహాసమునే గ్రంథస్థ మొనర్చెనని బ్రౌన్గారును, మౌలానా షిబ్లీ గారును పోలికలను జూపెంచి నిరూపించినారు.

# ఫర్దూసీ యొక్క విలువ

కవితాదృష్టిచే ఫర్దూసీ కవి విలువ మిగుల ఘనమైనది. ఈరాన్‌లో నేటి వర కింతటి మహాకవి జనన మందలేదు. 'అన్వరీ' ఫర్దూసీకి సమాన ప్రతిభ గలవాడని పేరొందినవాడు. 'ఫర్దూసీ', 'అన్వరీ', 'సాదీ' ఈ ముగ్గురు ఫారసీ కవితా వాఙ్మయమున కాచార్య ప్రాయులు. కాని అన్వరీ స్వయముగా ఫర్దూసి యజమాని యనియు, తాను సేవకుడననియు వ్రాసుకొనెను. 'నిజామీ' యాతనిని వేనోళ్ళ గొనియాడి యున్నాడు. 'అల్లా-మాయిజ్నుల్ అసీరు' అను గొప్ప యరబ్బీ పండితుడును అరబ్బీ భాషా వాఙ్మయములింత విస్తృతము లైనను షాః నామాకు సమానమగు గ్రంథమును జూపించలేదు. ఈ గ్రంథము ఈరాన్ యొక్క 'ఖురాన్' అని వచించుచున్నాడు. విదేశీయులైన పండితులును ఫర్దూసీ కవిని గ్రీకు మహాకవి 'హోమరు'తో బోల్చియున్నారు. బ్రౌన్ దొర గారు మాత్రము అరబ్బీ భాషాభిమాని. తరువాతి యరబ్బీ సమ్మిశ్రమై దీర్ఘ సమాసపూరితమైన యాలంకార ఫారసీ భాషకు, ఆ భాషయందు వ్రాసిన కవులకే ప్రాముఖ్యమును విలువను నొసంగుచున్నాడు. కాని యథార్థమైన యభిప్రాయ మది కాదు. కొంతకాలము మధ్య యుగమందు ఈరానీయులు కూడ పర్దూసీకి ప్రాముఖ్యమునొసంగలేదు. కాని తిరిగి నవీన యుగమునందలి కవులు, సాహితీ పరులు నేటి పర్షియా జాతీయవాదులందఱు ఫర్దూసీ కవిని జాతీయ కవితా పర బ్రహ్మనుగా భావించి యతని పేర సప్తాహములు, సహస్ర శతాబ్దోత్సవములు మొదలయినవి గావించి వేనోళ్ళ బొగడుచు కసీదాలు, కావ్యములు భక్తి పురస్స రముగా వ్రాసి స్మరించుకొనుచున్నారు. పర్షియన్ జాతీయతకు పునాది వేసిన వాడని నేటి సాహిత్యకారుల విశ్వాసము. అది యెట్లున్నను షాఃనామా యొక్క ముఖ్య లక్షణములను బరిశీలించినచో నా గ్రంథము యొక్కయు ఫర్దూసీ కవితా ప్రతిభ యొక్కయు ఘనత వెల్లడియగును.

షాఃనామా యొక్క మొదటి లక్షణమేమన నరువది వేల కావ్యమునందును అరబ్బీ భాషా పదజాలము నతిస్వల్పముగా వాడుచు మధురమైన యనర్గళ ధారా ప్రవాహమును వెల్లివిరియజేసినాడు మహాకవి ఫర్దూసీ. ఇస్లాం మతము ప్రచార మును గాంచిన ప్రతి దేశమునందును నరబ్బీ భాషయే ప్రచారమునకు వచ్చి యచటి దేశ భాషలు సంస్కృతి విహీనములగుటచే నణగిపోయెను. కాలవాహిని

యందు గొట్టుకొనిపోయెను. కాని ఈరాన్ హిందూ స్థానము ఈ రెండు దేశములే యరబ్బీ భాషను తమ గర్భమున జీర్ణింపజేసుకొని దేశీయ భాషల పునాదులపై క్రొత్త భాషల నిర్మించి వాటిని ప్రకాశింపజేసెను. ఈరాన్‌లో తొలుదొల్త నరబ్బీ భాషకు ప్రాముఖ్యము గలిగి ఆ దేశీయులను ఆ భాషయందే వాఙ్మయమును సృష్టించి, పహ్లావి అరబ్బీ సమ్మిశ్రితమగు క్రొత్త భాష సంస్కరింపబడిన తరువాత, యీ క్రొత్త భాషయందే సాహిత్య కృషి జేయదొడంగిరి. అందులోను శుద్ధమగు దేశీయ పదజాలము నుపయోగించి అరబ్బీ పదములను త్యజించి శుద్ధ పారసీ (మన అచ్చతెనుగు వంటిది) వ్రాయవలెనని కొందరు ప్రయత్నించిరి. 'ఫర్దూసీ' కవికంటే పూర్వపు కవిత అరబ్బీ పదములచే నిండియున్నది. అదే కాలమున 'జా అలీ సనా' పండితుడు తన తత్త్వగ్రంథమును పారసీ భాషలో వ్రాసి వీలయినంతవరకు నందులో అరబ్బీ పదములు లేకుండ బ్రయత్నించెను. కాని సఫలుడు కాలేదు. ఫర్దూసీ యొక్క ప్రతిభ యేమన, 'దకీకీ' కవి యారంభించిన ఈ 'షాహనామా' నతని శైలియందే యతని శుద్ధ ఫారసీ భాషయందే సంపూర్తి చేసి ప్రశస్తినందెను. వీరగాధ గానిండు లేక తత్త్వశాస్త్రము గానిండు, శృంగారము గానిండు, ప్రకృతి వర్ణన గానిండు, దేనినైనను సులభమై లలితమగు దేశీయ పదములను జక్కని నుడికారముతో నుపయోగించి వర్ణించి సాధించెను.

ఈ గ్రంథము యొక్క రెండవ లక్షణమేమన నితర ప్రాచ్య గ్రంథముల వలె గాక నీ చారిత్రక కావ్యమునందు వర్ణితులైనవారి వీర శృంగార గాధలతో పాటు, ఆ కాలపు సంస్కృతి, ఆచార వ్యవహారములు, దుస్తులు, దర్బారు పద్ధతులు, ఇతర సాంఘిక రీతులు, రాజకీయ వ్యవస్థ, శిక్షా నియమములు మున్నగు ననేక విషయములు వర్ణితములైనవి. ఈ లక్షణము మన ప్రాచ్య దేశపు వాఙ్మయమునందు మృగ్యమను నొక విమర్శకుడు ప్రాచ్య దేశీయ సారస్వతము లన్నియు సకారణముగానే గురియైనవని చెప్పవచ్చును. 'షాహనామా' మాత్రమీ నియమమున కపవాదమని తలంపవలెను. ఆ కాలమున జనులెట్లు వ్రాయుచుండిరో, ఏ విధముగా ముద్రలు వేయుచుండిరో, వివాహమునందే కార్యకలాపములు జరుగుచుండెనో, ఏ దుస్తులను ధరించుచుండిరో, భూమ్యాదాయపు పన్నులెట్లు నియమింపబడి యుండెనో, భూములెన్ని విధములుగా విభజింపబడి

యుండెనో, ఎవరెవ్వరికి మాఫీలియ్యబడుచుండెనో మొదలయిన మరెన్నియో విషయములను విపులముగా, హృదయంగమముగా వర్ణించినాడీ మహాకవి. ఇందుకుదాహరణము లనేకములు గలవు. షిబ్లీగారు కొన్నిటిని తమ గ్రంథము నందు బొందుపరిచినారు.

మూడవ లక్షణ మేమన ప్రాచ్య కవులందరు సామాన్యముగా నే కథను రచించినను నందులో శృంగార విషయము వర్ణింపబడవలసి వచ్చినప్పుడు ఆ విషయముపై చిరకాల విలంబనము గావించి యనేక పర్యాయము లౌచిత్య మును బాటింపక యసభ్యతకు గూడ జంకకుందురు. నిజామీ - జామీ వంటి పవిత్రులైన మహా కవులు గూడ నీ విషయమున నపచారము జేసియున్నారు. కాని యే పవిత్రతకు దావలముగాని యమ నియమాది వ్రతములకు లొంగని ఫర్దూసీ కవి మాత్రము అట్టి పరిస్థితులందు చరిత్రను వ్రాయవలసిన బాధ్యత గలదు గావున విషయమును యథాతథంగా అవసరమునకు సరిపడినంతగా కనుమఱుంగినటుల జూచి వర్ణించి వదలిపెట్టెను. నఖశిఖాదిపర్యంత సౌందర్య మును లేక సంయోగ వియోగములను విపులముగా వర్ణించి యేవగింపు గలిగిం పడు. మహాకావ్యము లనిపించుకున్న మన ముఖ్యేతిహాసములందును నీ హద్దు లను బాటించి యుండుటను గాంచుచున్నాము.

ఈ కవిత యొక్క నాలుగవ లక్షణము సమంజసమైన శృంగార వర్ణ నము. 'యూసుపు జులేఖా' కావ్యమునందు ఫర్దూసీ తన ప్రతిభనంతగా జూపింపలేదు. ఆ కావ్యమును రచించు కాలమునందతడు పుత్ర దుఃఖముచే బరితపించుచు ఖిన్నుడై యుండెను. అగ్నిపూజ జేయు పారసీల చరిత్ర వర్ణనము నందు జీవితమంతయు వృథాపరచితివని మతాభిమానులు గావించు విమర్శలకు జవాబుగా వారిని తృప్తిపరచుటకై యీ కావ్యమును వ్రాసెను. కాని 'షాహనామా' యందే అవకాశము, అవసరము కలిగినప్పుడెల్ల తన ప్రతిభను ప్రదర్శించినాడు. 'జాల్-రూదాబా'ల ప్రణయగాధ, 'రూదాబా' తన శిరోజములను మేడపైనుండి వ్రేలార్చి వానినందుకొని పైకెక్కి రమ్మని యాహ్వానించుట- 'జాల్' శిరోజము లను ముద్దిడుకొని త్రాడువేసి పైకెక్కి మేడపైకి జేరుట - తరువాత వారిరువురి శృంగార చేష్టలు, విలాసములు, ప్రియసంభాషణములు, రసనిష్యందనము గావించుచుండును. సొహ్రాబు వీరుడు 'సుఫీద' అను కోటను ముట్టడించినపుడు

కోటలోనుండి యొక యువతి పురుష వేషమున వెడలి సొహ్రాబుతో పోరాటము సలిపెను. చాలాకాలము పోరి యలసి పడిపోయిన తరువాత నతని చేజిక్కినది. మొగముపైనుండి యుద్ధరంగ ముఖ పరిధానమును దొలగించినప్పుడా వ్యక్తి యొక సుందరయువతి యని గుర్తించెను. విజేతయయిన వీరుని హృదయమును బరాజయమొంది యుపాయముచే బలాయనము గావింపదలచిన యా యువతి యొక్క యపాంగాశుగములు ఛిద్రము గావించెను. సొహ్రాబు రణరంగ విహార మును వీడి విరహ విలాపమునకు బాల్పడెను. ఫర్దూసీ మహాకవి ఈ ఘట్టమునెట్లు వర్ణించెనో యట్లే తిరిగి సొహ్రాబు వంటి వీరుని వియోగ వేదనాభరముచే సంత ప్తునిగా నొనర్చి యందులో నిమగ్నుని జేయుట వీరోచిత కర్తవ్యము గాదని 'హోమాన్' ద్వారా యతని కుపదేశము గావింపజేసి, యౌచిత్య నిర్వహణమును గావించెను. ఈ భాగములలో కవి తన శృంగారకావ్యరచనాశక్తి నుత్కృష్టముగా జాటి యున్నాడు.

ఫర్దూసీ కవిత యొక్క ఐదవ లక్షణము. జరిగిన యుదంతములను జిత్రించుట యందితని నిపుణత - కళా కుశలుడగు కవి, యుదంతములను వర్ణించునపుడు చుట్టుపట్ల జరుగుచుండు సంగతుల నన్నిటిని గమనికలో నుంచు కొని యుదంతము యొక్క వివరములన్నిటిని కట్టెదుట జరుగుచున్నట్లు చిత్రించి పాఠకునికి తన యెదుట జరుగుచున్నట్టు తలపింపజేసి యతనిని భావో ద్రిక్తుని జేయును. ఇతరులు చిన్న చిన్న వివరములను గమనించరు. ప్రకృతి సహజముగా నవసరములగు వివరములతో బాటు కనులకు గట్టినట్లు వర్ణించిననే యుదంతము యొక్క పరిణామము పాఠకుని హృదయముపై సంపూర్ణముగా నిలుచును. కవి యుపయోగించిన భాష సందర్భానుసారముగా హృదయమునకు సూటిగా హత్తుకొనునట్లుండి యిష్టమగు పరిణామము పాఠకుని యందు గలుగ వలెనన్నచో నలంకారాచ్ఛాదనములు దానిపై గప్పి చాతుర్యమును జూపించుట యసమంజసమగును. ఉపమానములు, ఉత్ప్రేక్షలు మున్నగునవి యాటంకము లగును. వానికి ప్రయోజన మితర సందర్భములలో నుండవచ్చును. ఈ సూత్రమును ఫర్దూసీ మహాకవి తన 'షాహనామా' యందు పరిపూర్ణముగా నాచర ణలో బెట్టినాడు చైనా చక్రవర్తి 'ఖాఖక్'ను రుస్తుం ఏనుగుపై నుండి త్రాడుచే జిక్కించుకొని క్రిందికి ద్రోసిన యుదంతము కట్టెదుట జరిగినట్లున్నది. 'కైకావున్' యొక్క దేరాను తన బరఛీతో సొహ్రాబు కోసివేయునపుడు 70

(డెబ్బది) మేకులను గోసివేసెనను వివరము గూడ దెలిపినాడు. ఇట్టి యుదాహరణములతో నిండియున్నది 'షాఃనామా' కావ్యము. ఆ పాత్రముల పరస్పర సంభాషణములు ఉచితము, శక్తివంతము, సూటియునగు భాష యందున్నవి. ఉద్రిక్తావస్థయందు వెలువడు సహజాలంకారములు తప్ప ఇతరాలంకారము లెవ్వియు గనబడవు. ఆధునిక కావ్య పద్ధతులందీ గుణమునకు ప్రాధాన్యము నొసంగుటలోనే పూర్వ వాఙ్మయము నందీ సూత్రము సరిగా బాటింప బడ లేదను నాక్షేపణ గలదు. తరువాతి మధ్యయుగపు కవులట్లు చేసిరను ఉత్తమము లగు పూర్వకావ్యములందు ప్రధానమగు నీ సూత్రము ననుసరించి ఉదాహరణ ములు నిండియున్నవి. ప్రకృత్యనుకరణము, సహజవర్ణనము ఫర్దూసీ కవి యొక్క ముఖ్యగుణములు.

ఆరవ లక్షణము: భావప్రకటనయం దుద్రిక్తతను గలిగించి 'సద్యః పర నిర్వృతి' యను నాదర్శమును సాధించుటయేగాక రసపోషణము గావించునపు డట్టి ఘట్టములను బొడిగింపక యవసరములగు హద్దులలో నుంచుట. సాధారణు లగు కవులీ హద్దులను బాటింపక రసోత్కర్షకై పాటుపడి 'పులుముడు' అను పొరపాటునకు లోనై యౌచిత్యమును జారవిడుతురు. మహాకావ్యములందిది గొప్ప దోషమగును. ఏ యుదంతమున కేయే విషయమున నెంత ప్రాముఖ్యము గలదో, తదనుగుణముగా నంతయే ప్రాధాన్యము నియ్యవలసియుండును. భావ ప్రకటనము ఉత్తమ నాయికానాయకుల కుచితమైన గాంభీర్యముతో నిండియుండ వలయును. ముఖ్యముగా గొప్ప యితిహాసములందు శృంగార విషాదభావములను బ్రకటించునపుడు పాత్ర గౌరవమునుబట్టి యావేదనమును, విలాపమును గంభీర మైన పట్టులో నుంచుట ముఖ్యధర్మము. ఈ విషయమున ఫర్దూసీ చాల పట్టుదల గలవాడు. సొహ్రాబు మరణవార్తను విన్న తల్లి దుఃఖమును బ్రకటించుటయందు గాని, అఫ్రాసియాబు యొక్క కూతురు 'మనీజా' రుస్తుం యొవటికి వచ్చి తన ప్రియుడగు 'బీజన్'ను చెరసాల నుండి విముక్తుని జేయుమని ప్రార్థించినపుడు గాని, స్త్రీల సహజ కోమలత్వముతోపాటు కుటుంబ మర్యాదను, గౌరవమును మరచిపోక, గాంభీర్యమునకు లోటు రానీయక యత్యుత్తమముగా వర్ణించినాడు. సొహ్రాబు తల్లి వీరుడగు పుత్రుని మరణ దుఃఖముచే సహజముగా నతని గుఱ్ఱమును, కళ్ళెమును, అతని దుస్తులను, యుద్ధసాధనముల నన్నిటినీ యతని ఘాఋగా భావించి కౌగిలిలో నుంచుకొని ముద్దిడుకొని సహజమగు దుఃఖోద్రిక్త

తను ప్రదర్శించినది. తల బ్రద్దలు కొట్టుకొనుటగాని లేక స్త్రీ సహజమగు రోదనాది వికృతులను గావింపక వీరమాత కనుగుణమగు విధమున పుత్ర శోకమును ప్రకటించినది. ఇట్లే 'మనీజా' రుస్తుం వద్దకు వెళ్ళి తన ప్రియుని విడుపించుమని వేడునపుడు తానా పనికై వచ్చిన సంగతి నితరు లెరుగగూడదని దాచుటకై రుస్తుం "నాకు బీజన్ గీజన్ ఎవరో తెలియదు పొమ్మ"ని గద్దించెను. అప్పు డఫ్రాసియాబు రాకొమరిత యైన 'మనీజా' పలికిన పలుకులు వీరాంగనోచితములై తన కుటుంబ గౌరవమునకును, మర్యాదకును ననుకూలములై యుండి రుస్తుం హృదయమున ములుకులవలె నాటినట్లున్నవి.

ఈ కవి యొక్క యేడవ లక్షణమేమన, ఏ విషయమునేని నత్యంత శక్తివంతముగా జెప్పవలసి వచ్చినప్పుడు రెండు మాటలలో జెప్పును. పద్యముల లోను బహిర్గతముగానేరని యర్థమందులో నిమిడియుండును. Vini, Vidi, Vice 'కట్టె, కొట్టె, తెచ్చె' అను వాక్యమునందువలె నర్థ గర్భితములై చప్పున శక్తివంతముగా మనస్సునకు నచ్చు వాక్యములను సూటిగా బలుకును. వ్యర్థముగా రచనను బొడిగింపక. భాషా శక్తి యందులో నిమిడియున్నది. ఈ రహస్యమీ మహాకవి బాగుగా తన కావ్యమున బయల్పరచి యున్నాడు.

'షాహనామా' కావ్యము మన 'మహాభారతము' వలె మహాకావ్యమును, ప్రధానేతిహాసమును నైనందువలన నీ మహాకవికి పారసీ వాఙ్మయము నందుగల ప్రత్యేక స్థానము గమనింపదగియున్నది ప్రపంచ వాఙ్మయములో 'వ్యాస, హోమర్లతో పాటు ఇతనికి స్థానము గలదని షిబ్లీగారు వచించుచున్నారు. మహేతిహాస కావ్యలక్షణములు కొన్ని యిందులో గలవు. ఇతివృత్తము మహోన్నతమై ప్రపంచ చరిత్రయందొక విప్లవాత్మకమైన క్రాంతిని లేక మార్పును గలిగించు గొప్పదనము గలదై యుండవలయును. యుద్ధవర్ణనము నందద్భుత వీర రసముల గుప్పుచు శ్రోతల మనస్సు చలింపజేసి ముగ్ధులను గావించునట్టుల వర్ణింపబడియుండవలెను. ఆఖ్యానములు, ఉపాఖ్యానములు అంతర్గతములగు చిన్న యుదంతములు వివరములతో పాటు విస్తృతముగా ఔచిత్య భంగములేకవర్ణితములు గావలెను. సంభాషణలు సూటియైన మాటలలో నుండి భావమును ముద్రితపరచి యుదాత్తములగు నుత్తమభావముల నుద

యింప జేయవలయును. ఈ లక్షణములను దృష్టియందుంచుకొని పరిశీలించినచో 'షాహనామా' ను ఈరాన్ దేశము యొక్క జాతీయేతిహాసమును జిత్రించు మహా కావ్యమని చెప్పవచ్చును. మన వ్యాస రచిత మహాభారతముతో బోల్చవచ్చును. అందులో ననేకవేల సంవత్సరముల చరిత్రము వర్ణితమై ఇతివృత్తమొక ఘనోదంతముగాక, సూటిగా చరిత్ర గ్రంథము లేక యితిహాసమువలె గనపడు చుండును. హోమరు యొక్క Odyssey కావ్యమునందును మహాభారతము నందును ప్రత్యేకమగు నొక చరిత్రభాగము నితివృత్తముగా గొని ఉపాఖ్యానముల ద్వారా నితర చరిత్రభాగము విస్తృతముగా వర్ణింపబడినది. అట్లుగాక 'షాహనామా' 'రాజతరంగిణి' వంటి గుణమును గలిగియున్నది. ఈ భేదము కావ్యదృష్టిచే 'షాహనామా' యొక్క విలువను తగ్గించునది కాదు. చారిత్రక దృష్టిచే నొకవిధముగా విలువను హెచ్చించును. ఇందులోను 'రుస్తుం' పాత్రకు నాయకత్వసిద్ధిగలిగి గ్రంథములోని యెక్కువ భాగము నతడాక్రమించుకొనుటయేగాక, యొక గ్రంథమునకు కేంద్రమితడేయని భావించునట్టి స్థానమును గలిగి కావ్యైక్యతను మహాకావ్యమునకు గల కవితాలక్షణములను, ఆలంబన విభావ సామగ్రిని సమకూర్చుచున్నాడు. అందువలన మౌలానా షిబ్లీయేగాక పాశ్చాత్యపండితులును అంతకంటె ముఖ్యులగు నాదేశపు పూర్వాధునిక సాహితీకారులందరు నేకగ్రీవమగు నభిప్రాయముతో నీ మహాకావ్యమున కగ్రస్థానమొసంగుచున్నారు. 'ఫర్దూసీ'ని కవిబ్రహ్మయని సంబోధించుచున్నారు.

సమకాలమందు మాత్రమీ కావ్యము, జనరంజకత్వమును బట్టి 'ఖురాసాన్' నుండి 'బగ్దాద్' వరకు దేశమునందంతట వ్యాప్తినందినను, రెండు కారణములు కొంతవర కాటంకములుగా బరిణమించినటుల గనబడుచున్నది. ఒకటి ఈ కావ్యమందు ముస్లింలు గానివారల గాథలను గొప్పజేసి కవి వర్ణించుటయే గాక ముస్లింల ప్రశంస వచ్చినపుడు వారి వీరగాథలను కొంత తగ్గించి వర్ణనలచే నప్రధానమగు స్థానమునకు దించెను. కొన్ని చోట్ల ఈరాన్ దేశాభిమానము ప్రకటించుచు ఫారసీక వీరుల నోటినుండి అరబ్బులను వారి మోటుతనము సంస్కారవిహీనత, క్రౌర్యము మున్నగు గుణములను గర్హించుచు వెక్కిరించునటుల జేసినాడు. ఇస్లాం మతాభిమానులకు కష్టము కలిగినది. తరువాత 'ఉమర్‌నామా' యని హజరత్ ఉమరు పేర నొక కావ్యము వ్రాసి మరియొక

కవి, ప్రజల దృష్టిని 'షాహనామా' వైపు నుంచి మరల్ప యత్నించెను. రెండవ కారణము సుల్తాన్ మహమూద్ యొక్క యాగ్రహమునకు బాత్రుడై గ్రంథాంతమున నిందా పద్యములను జేర్చినందున రాజాగ్రహభయమున ప్రజలు దీనిని బొగడుటకు భయపడుచుండిరి. ఐనను మహాకవుల కావ్యముల రంజకత్వమునకు యశస్సునకు నివి యాటంకములు గానేరవు. ప్రజలు ఇష్టాగోష్టులందు గానము జేసికొని వీర సంభాషణములందుపయోగించుకొని, ఉత్తర ప్రత్యుత్తరములందు వ్రాసుకొని ప్రచారము గావించిరి. ఆటంకములుగా బరిగణింపబడిన పైరెండు కారణములే కొంతవరకు ప్రచారమునకు హేతువులై యుండును. తరువాతి రాజులును విరివిగా ఫర్దూసీ కావ్యములను బఠించి యుత్తేజమును గాంచిరి. కొన్ని శతాబ్దముల వరకు శృంగార కావ్యములకు ఈరాన్ సాహిత్యమున దావు లభింపలేదు. మధ్య యుగమున శృంగారమునకు ప్రాముఖ్యము గలిగి హద్దులు మీరినవి. ఇప్పుడు ఫర్దూసీ వైపు తిరిగి వెనుకజూచుట కారంభించినది.

'షాహనామా' యొక్క భాషకు, నేటి భాషకు చాల భేదము గలదు. బహుళ గ్రంథమైన యీ కావ్యమున నుపయోగింపబడిన పదసంపదమెండు. ఏ కవియు నుపయోగింపని పదములిందు దొరకును. మహాభారతమున వలెనే యనేక పదములిప్పుడు వాడుకలో లేవు. ఫర్దూసీ వ్యాకరణమందు గొన్ని మార్పులంగీకరించెను. కాని ఫర్దూసీ భాష యా కాలపు కవులుపయోగించెడు సామాన్య భాషయే. అతడు కేవల మరబ్బీ పదములను వదిలి శుద్ధ ఫారసీ పదముల నుపయోగించెను. ఈ రెండు కారణముల వలన సులభమైన 'షాహనామా' నేడు కొంచము కష్టముగా గనిపించును. షేక్స్పియర్ భాష నేడెంత మారినదో యంత ఫర్దూసీ భాష మారలేదు. అరబ్బీ పదాడంబరమునకూ, సమాసములకు, అలంకార బాహుళ్యమునకు ప్రాధాన్యము నొసంగని నేటి కవులందరికావర్శ ప్రాయుడు ఫర్దూసీ. మన 'తిక్కన'తో బోల్చదగినవాడు.

## అసదీ తూసీ

ఐతిహాసిక కవులలో శిరోమణి 'ఫర్దూసీ' యైనచో రెండవవాడు 'అసద్' ఇతని పేరు 'అలీబిన్ అహమద్' ఇతనికి పారసీక రాజులతో వంశ సంబంధము గలదు. విద్యాభ్యాసానంతరము ఇరాక్ వెళ్ళి 'దైలమీ' ప్రభువుల దర్బారులో

జేరెను. అక్కడినుండి 'ఆజార్ బా యెజాన్' నగరమునకు వచ్చి యక్కడి ప్రభువగు 'అబూదలఫ్కర్కరీ' యొక్క వజీరుచే నాదరింపబడెను. "ఫర్దూసీ షాహ్నామాను వ్రాసి పేరు గాంచెను. నీవతని దేశస్థుడవు, సమర్థుడగు కవివి. నీవు ఆ విధముగనే నేదేని కావ్యమును రచింపు" మని యాదేశింప 'గర్షాసు నామా' యను కావ్యమును రచించెను. దౌలత్షాహ్ మున్నగు లేఖకుల ప్రకారము, ఫర్దూసీ గజనైన్ నుండి వెడలి మహమూద్ యొక్క యాగ్రహమునకు బాత్రుడై భ్రమించు కాలమున విల్లు జేరుకొని 'అసదీ'ని పిలిచి తన షాహ్నామా సంపూర్ణముగా లేదనియు పూర్తి గావింపుమనియు కోరెనట. అతడొక దిన మందును రాత్రియందును నాలుగు వేల పంక్తులు చెప్పి పూర్తిచేసెనట. ఈ గాథ యసత్యమని షిబ్లీగారు ఖండితముగా బలుకుచున్నారు 'షాహ్నామా' యసంపూర్ణ ముగా నుండనూలేదు. 'అసద్' దానిని పూర్తి గావింపనూలేదు.

ఇతడు 'కసీదా'లో నొక క్రొత్త పద్ధతిని జేర్చెను. కసీదాలలో దివారాత్రములు, భూమ్యాకాశములు, ఫారసీ ముస్లిం మున్నగు వారి మధ్యన సంవాదములును జేర్చి వ్రాసెను. ఇతడు ఫారసీ Idioms (జాతీయములు) పై నొక గ్రంథమును రచించెను. ఇదియే మొదటి గ్రంథము.

అసదీ ఫర్దూసీ సమకాలీనుడు. అతనికి గురువును గాదు, శిష్యుడును గాదు. శైలి నిజామీ యొక్క శైలిని బోలియుండును. అలంకారముల నెక్కువగా నుపయోగించును. ఒకప్పుడు తుది కాలపు కవులను స్మరింపజేయును. ప్రకృతి యొక్కయు నితర వస్తువుల యొక్కయు చిత్రములను తీర్చిదిద్దినట్లు వర్ణించుటలో ఫర్దూసీకి తీసిపోడు. ఫర్దూసీ 'షాహ్నామా'కును, నిజామీ 'సికందర్ నామా'కును మధ్యకాలమున 'గర్షాసునామా' వచ్చినది. నిజామీ కొంతవరకు 'అసదీ' ననుకరించెనని చెప్పవచ్చును. 'షాహ్నామా' యొక్క కొంత భాగము ఖిలమై అసదీ దానిని పూర్తి గావించిన మాటయే నిజమైనచో నీ విచిత్ర సంఘటనము 'షాహ్నామా'ను మన యాంధ్ర మహాభారతముతో బోల్చుటకును, ముగ్గురు కవులచే సంపూర్తి యగుటకును నొక కారణముగా నుపకరించును. నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలతో దకికీ, ఫర్దూసీ, అసదీలను బాగుగా బోల్చ వచ్చును.

## మనూ చెహ్రీ

ఈ కవి 'దాంగాన్' కాపురస్థుడు. పేరు 'అహమద్'. 'మనూచెహ్రీ' యనునది కవితా నామము. మిగుల ధనవంతుడు. జర్జాన్ ప్రభువగు 'అమీర్ మనూ చెహర్' యొక్క దర్బారునందుద్యోగిగా నుండెను. ఈ కవితా నామమున కిదే కారణము. అమీర్ మనూ చెహర్ గతించిన పిదప గజనైన్ నగరమునకు వచ్చి యాస్థానకవియగు 'అన్సారీ'ని గురించి ప్రశంసా పద్యములను వ్రాసి వినిపించి, మెప్పువడసి, యతని ద్వారా సుల్తాన్ మహమూద్ కుమారుడగు సుల్తాన్ మహమ్మద్ దర్బారునందు ప్రవేశము నందెను. రాజదర్బారున కతని కిష్టము వచ్చినపుడు పోవుట కధికారముండెను. సుల్తాన్ మహమ్మద్‌ను చెరసాల యందుంచి వాని సోదరుడగు 'మసూద్' రాజపీఠము నలంకరించెను. మనూ చెహ్రీ వ్రాసిన 'కసీదా'ల భాగమెక్కువగా సుల్తాన్ మసూద్‌ను గురించినవే. ఈ కవి బాల్యమునుండియే గడ్డు సమస్యలను పూరించుచు ఆశుకవితయందు ప్రజ్ఞావిశేషము గలిగియుండెను. ఇతని దీవాన్ (కావ్య సంపుటి) యందు మూడు వేల పంక్తులు గలవు. ఫ్రాన్స్‌లో గూడ నీ సంపుటి బహు అందముగా టీకా యుక్తముగా నచ్చువేయబడినది. మనుచెహ్రీ యొక్క కావ్య గుణములు షిబ్లీగారి యభిప్రాయము ప్రకారమీ క్రింద పొందుపరచుచున్నాను.

1. ఈ కవి అరబ్బీ భాషా పండితుడే కాక యరబ్బీ సాహిత్యము, కావ్యములు కంఠపాఠ మొనర్చినవాడు. అందువలన నితడు తన కావ్యములందు అరబ్బీ పోకడలేగాక పదసంచయమును, సమాసములను ఎక్కువగా నుపయోగించును. ఈ యోగ్యతచే నితడు గర్వపడుచుండెను. ఇతరులను ధిక్కరించుచుండెను. అరబ్బీ కవులు వాడిన సుందర శబ్దజాలమును, ఉపమానములను విరివిగా వాడుటవలన కేవల పారసీ భాషాభిజ్ఞులకు కఠినముగా నారికేళ పాకముగా నుండును.

2. అరబ్బీ అభిమానము గనపరచినను ఈ కవియొక్క ధారాశక్తి యత్యద్భుతము. కావ్యము కుంటువడక స్రవంతివలె ప్రవహించుచుండును. కసీదాలలో శృంగారమును, ప్రకృతి వర్ణనమును ముఖ్య సమున్నతముగా ప్రవేశ పెట్టి యద్భుతమైన వర్ణనాశక్తిని ప్రకటించి యున్నాడు. వసంత వర్ణనమును

ఈరాన్ కవులు మొదటినుండి నేటివరకు జేయుచున్నను, ఇది వారి ప్రత్యేక విషయమైనను, 'మనూచెహ్రీ' వలె పూర్వకవులు గాని, యాధునిక కవులుగాని యెవ్వరును జేయలేదు. ఇతర కవులు రోజా పుష్పమునకు, 'బుల్బుల్' పక్షికిని ప్రాధాన్యము నొసంగి ప్రకృతిలో రమ్యములైన యితర తరు, లతా, ఫల, పుష్ప, పక్షిజాలమును మరచిపోయెదరు. కాని 'మనూచెహ్రీ'యట్లుగాక వసంతమునకు శోభనుగూర్చు నితర పక్షిసముదాయమును, పుష్ప సంచయమును విరివిగా వర్ణించును. పావురములను, సారసములను, చిలుకలను మాత్రమే గాక కాకులను సైతము వర్ణించినాడు. వర్షారంభమును అనే కోపమానములతో అందముగా నభివర్ణించినాడు.

3. వర్ణ్యమైన విషయమును నఖ శిఖ పర్యంతము సాంతముగా వర్ణించుట ఈ కవియొక్క ప్రత్యేక లక్షణము. కథలను గావ్యములుగా రచించినప్పటికిని 'కసీదా'ల లోనే కథా కథన విధానము నవలంబించినాడు. ఈ సన్నివేశము లందతని శక్తి బయల్పడు చున్నది. స్తుతి పాత్రుడైన నాయకుని స్తుతి ముఖ్యము గాక వాఙ్మయాభివృద్ధియే ముఖ్యముగా కవి దృష్టియందున్నదని తెలియుచున్నది.

4 ఈ కవి షట్పద గీతములను రచించు పద్ధతిని ప్రవేశపెట్టెను. ఆరు పాదములలో నైదింటి యంత్యప్రాసములుండును. 'ముసమ్మత్' అని యీ గీతమునకు పేరు. గోస్తనీ ఫలమునుండి మధువును దీయు విధమును జిత్రించుటకై యొక కథను గల్పించి, వివిధ రూపములను దాల్చి పక్వాపక్వ స్థితి భేదములనుబట్టి వేరు వేరు రంగులుగల ఫలములను, అన్యథా ప్రవర్తించిన బిడ్డలతో బోల్చి వానిని శిక్షించుటకై కత్తితో గోసెననియు, అట్లే గోస్తనీ రసము దీయు వరకు ఉత్ప్రేక్షాలంకారములతో సంపూర్ణ విధానమును వర్ణించుచు 'ముసమ్మత్' వృత్తములో నొక ఖండ కావ్యమును వ్రాసెను. ఉపమాలంకారమును అత్యద్భుత శక్తితో విరివిగా నుపయోగించును. ఉపమానములు పోలికలు చూపుట యందితని కల్పనా చాతుర్యము వ్యక్తమగుచున్నది. పూర్వ వాఙ్మయమున ప్రచలితమైన పదములనే గాక క్రొత్త కూర్పులను కూర్చి, క్రొత్త కల్పనలను గావించి యుపమాలంకారములు నుపయోగించును.

# ఐదవ, ఆరవ శతాబ్దములు - హిజ్రీ

గజ్నవీ రాజ్య పతనము హిజ్రీ ఐదవ శతాబ్దము నందారంభమైనది. ఈ శతాబ్దాంతము వరకు గజ్నవీ ప్రభుత్వాధికారము 'సల్జూకీ' లకు సంక్రమింప దొడగెను. తోడనే వాఙ్మయ సముద్రమున సంక్షోభము కలిగెను. 'సల్జూకీ' రాజులలో ప్రథముడు 'రుకునుద్దీన్ తొగ్రల్' హి. 429 లో నైషాపూర్ నగరమున రాజ్య పీఠము నధిష్టించెను. ఈ వంశము వారు 163 సంవత్సరముల కాలము మాత్రమే రాచరికము నెరపినను వీరి కాలమున ముస్లిం సామ్రాజ్యము యొక్క వైశాల్యము హెచ్చి వారి రాజకీయ పద్ధతులు, రాజ్యమున వారు నెలకొల్పిన శాంతి భద్రతలు వాసిగాంచినవి. 'ఖురాసాన్' నుండి 'సిరియా' వరకు ప్రజలు బంగార మెగురవేయుచు ప్రవాసము చేయుచుండిరట! తరువాతి 'ఖ్వారాజ్మ్ షాహీ' వంశపు రాజులు ఈ వంశమువారి దాసానుదాసులే. 'అతాబుకూన్' వంశపు రాజులు (సుల్తాన్ సలాహుద్దీన్ యొక్క యజమానియగు నూరుద్దీన్ జంగీ ఈ వంశము వాడే) కజల్ అర్సలాన్, అతాబుక్ అబూబకర్ బిన్‌సాద్ జంగీ (షేఖు సాదీ మహాకవి యొక్క పోషకుడు) వీరందరు 'సల్జూకీ' వంశముతో సంబంధము గలవారే.

సల్జూకీ రాజులలో 'మలిక్‌షా', 'సంజర్' అను నిరువురి కాలమత్యున్నత దశను గాంచినది. ఈ కాలముననే ఫారసీ కవితా కన్య సంపూర్ణ యౌవనమును దాల్చినది. ఈ జవ్వనికి నివాళులిచ్చిన కవుల సంఖ్య మిక్కిలి యధికము. వారిలో ముఖ్యులను మాత్రము పేర్కొనదగును. 'అమీర్ మొ అజ్జీ', 'అజ్రకీ లామెయీ', 'అస్అద్', షహబీ, అబ్దుల్ వాసె జిబిలీ, అన్‌వరీ, హసన్‌గజ్నవీ, రజీయుద్దీన్ నైషాపూరీ, అదీబ్ సాబెర్, షర్‌కదీ, కాఫీ హమదానీ, నిజామీ అరూజీ, నిజాముగంజవీ, షంషుద్దీన్ ఖురాసానీ, సూజనీ, అబుల్ మొ అలీ మున్నగువారు.

ఈ కాలమునందలి కొన్ని ప్రత్యేక పరిస్థితులు ఫారసీ వాఙ్మయాభివృద్ధికి నత్యంత సహకారమొసర్చినవి. ఇంతకు పూర్వము ఫారసీ కవిత కొంత కళాదృష్టిచే నభివృద్ధి గాంచినను కవితా భాషకు మాత్ర మింకను నాణ్యత లభింపకుండెను. ప్రథమమున 'సామానీ' రాజుల కాలమున నారంభమై గజ్న

వీల కాలమున ఫారసీ వాఙ్మయమభివృద్ధి గాంచెనని వెనుక తెలుపబడియుండెను. వీరి ముఖ్యపట్టణములు 'బుఖారా', గజనైన్' అనునవి. అచ్చటి జనుల మాతృభాషలు తుర్కీ లేక అఫ్గానీ. కవులును తరచుగా నా ప్రాంతముల వారే. ఈ ప్రాంతములు ఈరాన్ యొక్క కేంద్రములగు 'షిరాజ్', అస్పహాన్, నైషాపూర్ మున్నగు నగరములకు దూరస్థములు. ఫర్రుఖీ కవి సస్తాన్ ప్రాంతమువాడు, అన్సురీ బల్ఖు వాస్తవ్యుడు. మనూచెహ్రీ 'దాంగాన్' పట్టణమువాడు. అస్జదీ. దకీకీ 'మరవు' నగరవాసులు. కాని సల్జూఖీ రాజులు తమ ప్రభుత్వకేంద్రమును 'నైషాపూర్' నగరమునకు మార్చినందువలన ఫారసీభాషకు ఆ కేంద్రమునందే వాఙ్మయాభివృద్ధి జరిగి భాషకు దాని సహజ స్వరూపము, నుడికారము, మాధుర్యము సంక్రమించినవి. అందువలన నీ కాలపు కవుల భాష యందీ గుణములు విస్పష్టముగా గనబడుచున్నవి.

ఈ కాలమందు ఫారసీ వాఙ్మయాభివృద్ధికి తోడ్పడిన రెండవ కారణము ముఖ్యమైనది. ఇంతవరకు ముస్లిం రాజ్యములన్నిటి యందును ప్రభుత్వభాష అరబ్బీయైయుండును. సుల్తాన్ మహమూద్ దేశీయము, జాతీయమునగు సంస్కృతి నభిమానించినను ప్రభుత్వభాష అరబ్బీగానే యుండెను. ఫారసీలోనికి మార్చునంతటి ధైర్యము రాలేదు. కాని సల్జూకీ రాజు 'అలప్ అర్సలాన్' రాజ్యపీఠము నలంకరించిన తోడనే ఫారసీకి ప్రభుత్వ భాషా గౌరవము లభించెను. సహజముగా నింత వృద్ధికరములగు గుణములు గలిగిన భాష రాజభాషయై మరింత విలసిల్లెను. 'సుల్తాన్ సంజర్' యొక్క సారస్వతాభిమానము కళాపోషకత్వము తిరిగి సుల్తాన్ మహమూద్ దర్బారును స్మరింపజేయుచుండెను. 'మీర్ మొ అజ్జీ' ఆస్థానకవిగా నియమింపబడెను. ఈతని యాస్థానమునందనేక కవులును కొందరు కవయిత్రులను సాహితీసేవ గావించుచుండిరి. ఇతని దాతృత్వమును గురించిన యనేక గాథలు భోజరాజుయొక్క యాస్థానమును స్మరింపజేయునట్టివి. 'తజుకిరా'లలో వ్రాయబడియున్నవి. సుల్తాన్ సంజర్, శుద్ధ ప్రతిపత్తునాడు చంద్రుని జూచి వెంటనే యాశువుగా బాలచంద్రునిపై పద్యము చెప్పుట కాజ్ఞాపించెను. మొ అజ్జీ వెంటనే చెప్పిన పద్యమును మెచ్చి యైదువేల దీనార్లను, గుఱ్ఱమును బహుమతిగా నొసంగెను. తన పేరును కవి యొక్క

కవితానామమందు జేర్చుట కనుజ్ఞనొసంగి ప్రత్యేక గౌరవమును వ్యక్తపరచెను. సుల్తాన్ సంజర్ పేరు మొ అజ్జుద్దీన్', కావుననే యీకవి కవితా నామమునందు 'మొ అజ్జీ' యను పదము చేర్చబడినది. ఇతని దర్బారులో 'మెహస్తీ' యను కవయిత్రి యుండెను. హాస్యరసమును గుప్పుట యందును సద్యస్ఫూర్తిచే ప్రత్యుత్తరము లొసంగి నోరుమూయించుట యందును మిగుల జాణ. కవితా గోష్ఠులయందీమె పాల్గొనుచుండెను.

సల్జూఖీ కాలమునందును గజ్నవీ వంశమువాడగు 'బహరాంషాః' మిగుల ప్రశస్తిగాంచెను. వాఙ్మయపోషకుడై యనేక కృతులనంది యశస్సును బడసెను. 'కలీలాదమ్నా' యను పంచతంత్రము యొక్క అరబ్బీ భాషాంతరీ కరణమును ఫారసీలోని కితడు తర్జుమా చేయించెను. ఈరాన్‌లోను హిందూస్థా నమునందును ఈ గ్రంథమే ప్రచారములోనికి వచ్చెను. 'హకీం సనాయ్' వంటి విరాగియగు యోగి పుంగవుడు తన 'హాదీకా' యను గ్రంథరాజమును ఇతని కంకితమొనర్చెను. ఇతని కాలముననే తత్త్వవేత్తలు నీతిబోధకులు తమ సంప్ర దాయ విషయములను ఉద్బోధలను గూడ గావించిరి. నాసర్‌ఖుస్రూ, ఉమర్ ఖయ్యాం, హకీంసనాయ్, ఫరీదుద్దీన్ అత్తార్ మున్నగు తత్త్వవేత్తలగు కవులును నిజామీ, సాదీ, రషీదుద్దీన్ వత్వాత్, మున్నగు నైతిక కవులును ఈ కాలపువారే. ముఖ్యులగు కొందరి వివరములను దెలిసికొనెదముగాక.

## హకీం సనాయీ

ఇతని పేరు 'మహదూద్'. 'సనాయీ' అనునది కవితా నామము. జన్మ స్థానము గజనైన్ నగరము. మొట్టమొదట కవితయే యీతని వృత్తి. 'బహరాం షాః' ను గురించి యనేక స్తుతి కావ్యములను వ్రాసి తుదకు పరితపించి మాను కొనెను. ఈ విషయమున నొక గాథ గలదు. 'బహరాం షాః' హిందూ స్థానముపై దాడివెడలుట కుద్యుక్తుడయ్యెనట. ఆ సందర్భమున సనాయీ ఒక కసీదా వ్రాసి రాజ దర్బారులో జదువుటకు నిశ్చయించెను. త్రోవలో నొక స్నానశాల (పానశాలః) లో నొక పిచ్చివాడుండెను. వాడు పానశాలల నుండి మద్యము త్రాగినవారి పాత్రలలోని మడ్డిని తీసికొని త్రాగుచుండెను. 'హకీం సనాయీ'ని జూచి పానశాల వానితో 'రాజుయొక్క గ్రుడ్డితనమునకై యొక

పాత్ర మద్యమిమ్మ'ని యా పిచ్చివాడడిగెను. 'హకీం సనాయీ' ఆ మాటలు విని చకితుడై "రాజు మిగుల న్యాయము చేయు ప్రభువు. ఏం యిట్లాడెద"వని ప్రశ్నించెను. "గజనైన్ పట్టణము యొక్క ప్రభుత్వపు చేర్పాట్లను పూర్తి చేయకయే యితర దేశముం నాక్రమించుటకై వెడలువాడు గ్రుడ్డివాడు కాదా?" యని బదులు పలుకుచు పాత్రము నెత్తి మద్యము ద్రావెను. మరియొకసారి 'సనాయీ గుడ్డితనముకై మరియొక పాత్రనందిమ్మ'ని యడిగెను. పానశాలాధిపతి 'సనాయీ గొప్ప సాహితీకారుడు, కవి. అతనినెందుకు నిందించెద'వన "నాలుగబద్ధాలు కూర్చి బుద్ధిహీనులగు ప్రభువులను జేరి నడుముగట్టి నిలుచుండి ప్రస్తుతించుచుండును. ఆనాడు ప్రభువు దర్బారులో నేమితెచ్చితివని ప్రశ్నింప నేమి పలుకును" అని యడిగెను. ఈ వాక్యములు విన్న సనాయీ హృదయము పరితప్తమయ్యెను. దర్బారులో భట్రాజువలె బొగడుచుండువాడగు తనకు, రాజు తన సోదరినిచ్చి వివాహముగావింప యత్నింప, నిరాకరించి "నీ రాజ్యముగూడ నాకు వలద'ని ప్రత్యుత్తరమిచ్చెను. హజ్ యాత్రకు పాదచారియై వెడలి తిరిగి వచ్చి గజనైన్ నగరమున వాడవాడల దిరుగుచు భ్రమించుచుండెను. పాద రక్షలు లేక నడచుట వలన బొబ్బలెక్కిన యతని కాళ్ళను జూచి బంధువులు కొందరు పాదరక్షలు తొడిగించిరి. మరునాడు 'నిన్నటి విధము మారిపోయినది. నాకు కొరతగల్గెనని, వానిని తీసిపారవేసెను. 'సనాయీ' షేఖు అబూ యూసఫ్ యొక్క శిష్యుడయ్యెను. సనాయీ తన ముఖ్య గ్రంథమును 'హదీఖా' ను రచించినప్పుడు అందులో ఇస్లాం యొక్క సాధారణ విశ్వాసములకు విరుద్ధము లగు కొన్ని సిద్ధాంతములు సమర్థింపబడినందువలన పండితులు వ్యతిరేకించిరి. బహ్రాంషా బగ్దాద్ రాజధానికి విషయమును పరిష్కరింప బంపించెను. అక్కడి పండితోత్తములీ గ్రంథమున మతవిరుద్ధములగు సిద్ధాంతములు లేవని 'సనాయీ' పై మోపిన నేరమునుండి యతనిని విముక్తుని గావించిరి. ఇతని మృతి సంవత్సర విషయమున నభిప్రాయ భేదము గలదు. ఇతని గ్రంథములలో ముప్పది వేల పదములుగల వివిధ కావ్య సంపుటి, ఏడు మస్నవీలు, హదీఖా, సైరుల్ఎబాద్, కార్నామే బలఖ్, ఇష్కనామా, అకల్నామా, బహ్రొల్జుబహ్రాం, మున్నగునవి పేర్కొనబడినను గ్రంథములుపలబ్ధములు [illegible] మాత్రము ప్రకటింపబడినది.

'హకీం సనాయీ' మొట్టమొదట సూఫీతత్త్వములను కవితయందు ప్రవేశ పెట్టిన కవి. ఈ విషయమును స్వయముగా నతడే సగర్వముగా జెప్పుకొనెను. మౌలానా రూమి మున్నగువారు దీని నంగీకరింతురు. 'అత్తార్', 'సనాయీ' యిరువురి తరువాతనే నని మౌలానా రూమియే స్వయముగా వ్రాసుకొన్నాడు. నైతిక విషయములపై వ్రాయుటను గూడ నితడే యారంభించెను. భావ పారవశ్యమనునది మన కవులలో తక్కువగా నుండును. మౌలానా రూమియందీ భక్తి యొక్క యున్మత్తత కనపడును. 'హాఫిజు' కవి గూడా మత్తిలుచుండును. హకీం సనాయీ వీరిరువురి కంటె పూర్వుడు. ఉపమానముల నుపయోగించి విషయములను సులభముగా విశదీకరించు పద్ధతినిగూడ నితడే ప్రవేశపెట్టెను. 'సాదీ' 'సాయబ్' మున్నగు తరువాతి నైతికకవులు ఈ పద్ధతిని విరివిగా నవలంబించి యీ విధమగు కవితకు వన్నె తెచ్చిరి.

## ఉమర్ ఖయ్యాం

పారసీ కవులలో పాశ్చాత్య దేశమున ప్రశస్తిగాంచిన వారందరిలోను ఉమర్ ఖయ్యాం ముఖ్యుడు. ఇతని పేరు 'ఉమర్'. 'ఖయ్యాం' అను కారణనామము గుడారములు తయారుచేయు వృత్తివలన గలిగినదని ప్రతీతి. నైషాపూర్ వాస్తవ్యుడు. ఇతడు బాల్యమునందు విద్యాభ్యాసమొనర్చు సమయమున నితని కిద్దరు సహాధ్యాయులు 'హసన్ బిన్ అలీ', 'హసన్' అను వారలుండిరి. ఈ ముగ్గురును స్నేహాతిశయమున ముగ్గురిలో నెవ్వడున్నత దశకు వచ్చినను మిగతావారి నున్నతస్థితికి దీసికొని రావలెనని శపథము గావించుకొనిరి. బాల్యమున గావించిన ఈ శపథము కార్యరూపమును దాల్చినది. 'హసన్ బిన్ అలీ' అనువాడు 'అలపు అర్సలాన్' అను సల్జూఖీ రాజునకు వజీరుగా నియమింపబడెను. అతని కుమారుడు 'మలిక్ షాః' కాలమున సర్వాధికారములు గలిగి 'నిజాముల్ ముల్కు-తూసీ' అని చరిత్రమున సుప్రసిద్ధుడయ్యెను. 'ఉమర్' తన పూర్వ సహాధ్యాయుని వద్దకు వచ్చి శపథమును స్మరింపజేసెను. కాని సంవత్సరమునకు పన్నెండు వందల రాబడి గల జాగిరుకన్న యెక్కువ సహాయము నపేక్షింపలేదు. ఈ మాత్రపు జాగీరుతో ఉమర్ నిశ్చింతగా కాలము గడుపుచు విజ్ఞానాభివృద్ధియు సారస్వత సేవయు గావించుచుండెను. కాని సమకాలీనులగు ప్రభువు లాతనిని సమాన ప్రతిపత్తితో గౌరవించుచుండిరి. 'మలిక్‌షాః' గొప్ప జ్యోతిశ్శాల నొకదానిని

స్థాపింపదలచి దైవజ్ఞులను జ్యోతిశ్శాస్త్రవేత్తలను సమావేశపరచెను. ఆ జట్టులో 'ఉమర్' గూడా చేరియుండెను. ఈ జ్యోతిశ్శాలపై లెక్కలేని ద్రవ్యము వెచ్చింపబడెను. 'ఉమర్' అందులోఁ బనిచేయు శాస్త్రాధ్యాపకుడు. గ్రీకు తత్వశాస్త్రముల నభ్యసింపజేయుచుండెను. ఈ సిద్ధాంతములు ప్రజలలో ప్రచారమునకు వచ్చి రానురాను వారి యందు కోపము గలిగించి యితనిని మతము లేనివాడని నిందించుటేకాక 'ఉమర్'ను చంపుటకును బురికొల్పినవి. ఎట్లును దోచక 'ఉమర్' హజ్ యాత్రకై ప్రయాణమై, తిరిగివచ్చి బగ్దాద్ పట్టణమునకువచ్చెను. అక్కడ ప్రతి వైపునుండియు తత్త్వశాస్త్రములు నేర్చుకొనువారు చేయు నొత్తిడి కాగలేక నైషాపూర్‌నకు దిరిగివచ్చెను. హిజిరీ 517 సంవత్సరములో నకస్మాత్తుగా మరణించెను. 'బహార్ మికాలా' గ్రంథకర్త యగు 'నిజామీ అరూజీ' యితని శిష్యుడు. నైషాపూర్‌కు వెళ్ళి 'ఉమర్' సమాధిని దర్శింపగానది తోట గోడవద్ద అమ్రూద్ జర్దాలూ తీవల క్రింద పుష్పొడితో గప్పబడియుండెను.

'ఖయ్యాం'ను నేడు ప్రపంచము కవిగా గుర్తించును గాని సమకాలీనులతనిని గొప్ప తత్త్వవేత్తగా దైవజ్ఞుడుగా నంగీకరించిరి. తత్వశాస్త్రములందు 'బూ అలీసనా'కు సాటి యనియు, మత విద్యలు, సాహిత్యము, చరిత్ర యందా కాలపు గురువనియు ప్రశస్తిని గాంచెను. అతని పాండిత్యము, సర్వవిషయ విజ్ఞాన మపారమైనవి. ఏదెనిమిది సార్లొక గ్రంథమును జదివిన యెడల దానిని కంఠపాఠ మొనర్చుకొనజాలు మేధావి జ్యోతిశ్శాస్త్ర పారగులలో నగ్రగణ్యుడు. అంక శాస్త్ర గ్రంథములను గూడ వ్రాసెను. కాని 8 వందల సంవత్సరముల నుండి యతని యశస్సును జిరస్థాయిగా నొనర్చుటకు 'ఉమర్' వ్రాసిన కొద్ది పాటి 'రుబాయీ'లు మాత్రమే తోడ్పడినవి. ముసల్మానులకంటె 'ఉమర్' ప్రతిభను గౌరవించినది పాశ్చాత్య పండితులు, విమర్శకులును.

'ఉమరు' రచించిన రుబాయీలలో నుండి విశిష్టత లేదా ప్రత్యేకత, వివరింపరాని యొక మనోహరత్వము. 'ఖయ్యాం' రుబాయీలు వందలు వేలని లెక్కింపబడినవి. అనేకములు ప్రక్షిప్తములు. వివిధ గ్రంథకర్తలు రుబాయీల సంఖ్యను వివిధముగా నిరూపించినారు. వాని సంఖ్య యెంతయైనను అన్నిటిలోను విషయ సామాన్యత గలదు. కొన్ని విషయములు మాత్రమే చర్చింపబడినవి ప్రపంచము యొక్క క్షణ భంగురత్వము, మన సంతోషము యొక్క

ప్రశస్తి, మదిరా స్తుతి, ప్రారబ్ధ కర్మవాదము పశ్చాత్తాపము, భగవంతుని క్షమాపణ వేడుట, ఈ విషయములనే వందలసార్లు గీతములందు బాడినను, ప్రతి సారి యొక నవీనత, ఒక క్రొత్త మాధుర్యము కనబడునటుల బలికియున్నాడు.

'ఉమర్ ఖయ్యాం'ను గురించి యనేక భాషలలో పలు గ్రంథములు వ్రాయబడినవి. ఫారసీ, ఉర్దూ, జర్మన్, ఫ్రెంచి, ఆంగ్ల, తుర్కీ భాషలలోనేగాక తెనుగు, మహారాష్ట్ర భాషలలో గూడ నతని రుబాయీలను భాషాంతరీకరించిరి. ఆంగ్లమున విన్‌ఫీల్డు (Whinfield), ఫిట్జు జెరాల్డు (Fitz gerald) వీరిద్దరి యనువాదములు సుప్రసిద్ధములు. రాయప్రోలు వారి 'మధుకలశము', దువ్వూరి వారి 'పానశాల' ఫిట్జు జెరాల్డు యొక్క యనువాదము నాధారముగా గొని రస వంతముగా నల్లబడిన కావ్యానువాదములు. ఆదిభట్ల నారాయణదాసుగారు గూడ ననువదించి వ్రాసినారు. ఈమధ్య హైదరాబాదు ప్రభుత్వ ఆర్థికశాఖలో నున్నతోద్యోగిగా నుండి, సన్యసించి, చతుర్థాశ్రమమును స్వీకరించిన విఠల రావు దాతారు (స్వామి గోవింద తీర్థ) గారు బహు వ్యయ ప్రయాసలకోర్చి 'ఉమర్ ఖయ్యాం' వ్రాతప్రతుల ననేకము సేకరించి, దాదాపు ఈ విషయముపై ప్రకటింపబడిన గ్రంథ, వ్యాస, సామగ్రినెల్ల బరిశీలించి క్రొత్త యనువాదము, విమర్శన, చారిత్రిక పరిశోధనాంశములను జేర్చి సందరమైన మంచి గ్రంథ మొకటి 'The Nectar of Grove' (grave?) అనుపేర ప్రకటించి యున్నారు స్వామివారు. 'ఉమర్‌ఖయ్యాంయొక్క జీవితాశయములను, పాండిత్య మును తత్త్వ విజ్ఞానమును విపులముగా విమర్శించుచు ప్రశంసించియున్నారు. అంతేకాదు 'గురు కరుణామృత' మనుపేర మహారాష్ట్ర భాషలో పద్యాను వాదము చేసియున్నారు. వారి పరిశోధనలో తేలిన యంశములు ముఖ్యముగా 'ఉమర్' యొక్క జననమరణ కాలములు. ఇతర గ్రంథాధారములను, వానిలో నొక్కదానియందు గల జన్మకుండలినిబట్టి ఉమరు శాలివాహన శకము 970 జేష్ఠ శు॥ 3 కు సరియగు క్రీ.శ. 1048 మేనెల 18 వ తేది నాడుదయమున చంద్రుడు పునర్వసు నక్షత్రమందు జేరబోవు సమయమున జన్మించెనని సిద్ధాంతీకరించినారు. హిజ్రీ శకము 523 లో మరణించినాడు. 'తబ్రిజీ' ప్రకారము 516 హిజరీ 12 వ తేది మొహర్రం నెల గురువారము అని వ్రాసి యున్నది. ఈ తేదియే ఉమర్ సమాధి ఫలకముపై చెక్కబడినదను నొక వాదంకూడా కలదు.

నిజముగా ఉమరు వ్రాసిన రుబాయీల సంఖ్యను నిర్ణయించుట మిగుల కష్టమైన పని. అనేకులు తాము వ్రాసిన పద్యములను ఉమరునకు నంటగట్టిరి. లేఖన ప్రమాదము వలనను ముఖతఃవిని ప్రతులు వ్రాసికొనినవారి తప్పుల వలనను ప్రక్షిప్తము లనేకములు జొరబడినవి. అనేక ప్రతులను పరిశీలించి శ్రీ గోవింద తీర్థగారు పన్నెండు అధ్యాయములుగా విభజించి మొత్తము 1096 రుబాయీలు (చతుష్పాద గీతములు) ఉమరు రచించినవై యుండునని వానిని మాత్ర మనువదించిరి. వారు విభజించిన యధ్యాయముల శీర్షికలివి :

| | **అధ్యాయములు** | **రుబాయీల సంఖ్య** |
|---|---|---|
| 1. | ఏకేశ్వర వాదిత్వము-నామస్మరణ | 59 |
| 2. | కాలచక్రము- | 62 |
| 3. | యౌవనము- | 66 |
| 4. | వార్ధక్యము-మృతి | 60 |
| 5. | మృత్తిక-పాత్రము | 37 |
| 6. | అదృష్టము-లేక విధివ్రాత | 22 |
| 7. | నీతి ప్రబోధము | 193 |
| 8. | అధ్యాత్మశాల | 138 |
| 9. | అంతరంగ పానశాల | 186 |
| 10. | స్వకీయము | 167 |
| 11. | ఈశ్వర స్తోత్రము | 59 |
| 12. | సంకీర్ణము | 47 |
| | మొత్తము | 1096 |

ఉమరు ఖయ్యామును సమకాలికులు కవిగా గౌరవించలేదనియు, తత్త్వజ్ఞాని, వైద్యుడు, దైవజ్ఞుడు, గణితశాస్త్రప్రవీణుడుగా గుర్తించిరనియు పైన తెలుపబడినది. ఇతడు గణిత తత్త్వశాస్త్రములపై కొన్ని గ్రంథముల నరబ్బీ, ఫారసీ భాషలలో రచించెను. ఈ రుబాయీలు ఉమరు పండితు డుబుసుపోకకై యప్పుడప్పుడు రచించిన గీతములే కాని వేరుగావు. వీనియందు గనపడు తీక్ష్ణమై

సునిశితమైన విమర్శనా పద్ధతి మాత్రము కొత్తవిగాని, ముఖ్యములగు సూఫీ తత్వములు ప్రాతవే. ఇతనికి ముందు 'బూ అలీ సనా', 'నసీర్', 'ఖుస్రో' వంటి తత్త్వవేత్తలును, అబూసయీద్, అబ్దుల్లా అన్సారీ మున్నగు సూఫీలును ఈ తత్వములను ప్రచారము గావించియుండిరి. అంతకుమున్నే పర్షియాలో ఇబ్రహీం - అదహం (మ. క్రీ.శ. 777) మారూఫ్ కార్ఖీ (మ. క్రీ.శ. 815) జునైద్ బాగ్దాదీ (మ. క్రీ.శ. 910) షిబ్లీ బగ్దాదీ (మ. క్రీ.శ. 945) మన్‌సూర్ ముల్లా (మ. క్రీ.శ. 912) మున్నగు భక్తులు, సూఫీలు జన్మించియుండిరి. కావున పండితుడు విజ్ఞుడును నగు ఉమరు గూడ ఈ తత్త్వములనే యంగీకరించెను. ఫిట్జు జెరాల్డు అనువాదము కేవల మనువాదముగాక ఉమరును చార్వాకీయ సిద్ధాంతమును స్థాపించు మహాకవిగాను, గురువర్యుడుగాను పాశ్చాత్య పాఠక లోకము ముందు నిలువబెట్టినది. కాని యథార్థమగు విషయమేమన సూఫీల సిద్ధాంతములే ఉమరు గీతములందును వ్యక్తము లగుచున్నవి. ఉమరు ఇస్లాం మతమునందు శ్రద్ధాభక్తులు గలవాడు. ఇతర ముస్లిం భక్తులవలె ఈశ్వరుని సన్నిధానమున వినయముతో శ్రద్ధాంజలి నర్పించువాడు. కాలమానములను గురించి ప్రతియుగమునను జనులు పలు విధముల భావించియున్నారు. ఉమరు భావములీ విషయమున కేవల శాస్త్రీయ ములుగావు. కాలచక్రమును 'ఆశాచక్ర' మనియు. 'భావనాదీప' మనియు విచిత్రముగా నిర్దేశించియున్నాడు. భౌతిక శాస్త్రములీ ప్రపంచము యొక్క దుర్భేద్యమైన రహస్యములను దెలుపలేవు. కాలచక్రమూరక తిరుగుచుండును. కారణమేమో తెలియదు. సుడిగుండమువలె దిరుగుచు దయాహీనమగు నీచక్రము సర్వమును నాశనము గావించుచుండును రేపు మాపను నాశలర్థహీనములు. ఎన్నడైనను మరణము తప్పదు. ప్రపంచ సౌఖ్యములు, విత్త గౌరవములు. మున్నగునవి నిరర్థకములు. 'మృత్తిక - పాత్ర' అను నుత్ప్రేక్ష నాధారముగా గొని మనుజుని వైజ్ఞానిక నైతిక స్వరూపమును గురించి మనోహరముగా చర్చించియున్నాడు. మనుజుడు తన శరీరమును గూడ స్వకీయమని భావింపరాదు. తన శరీరములోని ప్రతి యణువు సైతము ఇతరుల బూడియై యుండవచ్చును. శరీరము విచ్ఛిన్నమై రూపాంతరము బొందినను గుణములు మాత్రము తమ వాసనను విడచిపోవు. ప్రాపంచిక వాసనలు దుఃఖకారణములు. మనశ్శాంతికి ముఖ్యసాధనము ఈశ్వరుని శరణుజొచ్చుట. భగవంతుని యనుగ్రహమును

సంపాదించుటకు మనుజుడు పవిత్రుడై యుండవలయును. ఇంద్రియములు మానవుని చిత్తశుద్ధి కాటంకములు కల్పించుచుండును. వానిని నిగ్రహించుట యావశ్యకము. సుఖదుఃఖములను సమముగా భావించి దురాశలకు లొంగక సంతృప్తిని జెంది స్వధర్మము నాచరించుట మనుజుని కర్తవ్యము. ఈశ్వర జ్ఞానము లేనిదే యీశక్తి లభింపనేరదు. ఈ జ్ఞానము మధుశాలలో లభించును. లభించునట్టి యా జ్ఞాన భక్తి వైరాగ్యముల మూలమున నాత్మ యీశ్వర సాయుజ్యము నొందును. ఇవి ఉమర్ ఖయ్యాం తన రుబాయీలలో ప్రబోధించిన విషయములు.

ఉమర్ పేర్కొన్న మధువు కేవల ద్రాక్షాసవమో లేక భగవద్ధ్యానామృతమో. అతడు కామించిన ప్రేయసి కేవల మృగాక్షియో లేక పరబ్రహ్మమో యను ప్రశ్న పలువురను బాధించుచున్నది. కొందరు ఉమరు సంబోధనలు, పాంచ భౌతిక శరీరధారిణియగు నొకానొక లతాతన్విని గురించిన పలవరింతలు గాని, పారలౌకిక వాంఛలచే బీడింపబడిన భక్తుని ప్రణయ నివేదనలు గావని తలంచవచ్చును. కాని యిదమిత్థమని ఉమర్‌ను ఇతర సూఫీ కవుల తెగనుండి బహిష్కరించి యతని ప్రేమను దైవభక్తి నుండి ప్రాపంచిక ప్రణయము క్రిందికి ద్రొక్కివేయుట కాధారములు లేవు. అనేక గీతములకు రెండర్థములను జెప్పవచ్చును. కాని కొన్నింటికి మాత్రము దైవపరమైన యర్థము తప్ప వేరొక యర్థమును చెప్పజాలము. శృంగార కవిత్వము యొక్క పరిభాష నుపయోగించుట సూఫీ కవుల కలవాటు. మౌలానా రూమీ, జామీ, హాఫీజు, సర్మద్ మున్నగు వారందరి వాఙ్మయమునను ఇట్టి గీతములు వందల కొలది కనబడును. సూఫీలు సాంఖ్య సిద్ధాంతములను, గ్రీకుల (Neo-Platonism) భక్తి వాదమును స్వీకరించిరి. భక్తియే ముక్తి సాధనమనియు, లౌకిక ప్రేమ దైవభక్తికి మార్గదర్శకము లేక ప్రథమ సోపానమనియు వారి మతము. కావుననే వారు తమ యాధ్యాత్మిక తత్త్వములను శృంగార రస పరిప్లుతములగు కావ్యములద్వారా ప్రబోధించిరి. అట్లె పారసీకుల మధుసేవయు కవుల కుత్ప్రేక్షా సామగ్రిగను, భక్తులకు పారవశ్య చిహ్నముగను నుపకరించెను. 'ఉమరు' నాస్తికుడు కాడు. ఈశ్వరుని సగుణ స్వరూపమును బురస్కరించుకొనియే విప్రలంభ రూపముగా నిట్లు పలుకుచున్నాడు :

చ॥ సకియకొ! పాత్ర నింపుమొగి సర్వఫల ప్రదు డీశ్వరుండు, తా
సకల జనావళిన్ దన విశాల కృపారస వృష్టిఁ బ్రోచెడున్,
సుకర వసంత శీధువును జుక్కలు చుక్కలు ద్రావుమింక, సే
వకతఁ దొరంగు మా, ప్రభువు బానిస సేవలఁ గోర డెన్నడున్.

ఉ॥ పాపము పాపమంచుమరు! బల్కెదవేల నిరంతరంబు? సం
తాపముఁ బొంది గాసిలక దక్కదు లాభము లేశమేనియున్,
పాపముఁ జేయకెట్టుల కృపామృత పాత్రుడగున్ జనుండు? తాఁ
బాపుల కోసమే యిలఁ గృపా పరుడయ్యె విభుండు నెచ్చెలీ!

ఇది ఉమర్ తర్కము. తత్త్వ జిజ్ఞాసువునకు మార్గమధ్యమున గలుగు శంకలను, ఆటంకములను మనోహరముగా వర్ణించినాడు. ఒకొక్కప్పు డుమరు అజ్ఞేయవాది (Agnostic) కాడు గదా యని తోపక మానదు.

చ॥ అమగగఁ ద్రోవలేదిల రహస్య పటాంతరసీమ నేటికిన్;
యెరుగరు రాకపోకలను; నెయ్యది యాత్మకుఁ గారణంబొ! యె
వ్వరును, ధరాశయాంతర నివాసము దక్క మరొండులేది కె
వ్వెరవునఁ, జిత్రమీ కథయు వేగిరమంతము నొంద దక్కటా!

మ॥ అలనాడీడిచిపైచె నన్నిచట, నాయాసంబుమై నెట్టులో
యిల జీవించి గడించు విస్మయముగా కింకే ఫలంబొందమిన్
గల ప్రాణంబులు వీడజాలక మహాకష్టంబుతో నేగితిన్
దెలియంజాలను రాకపోకలకు నుద్దేశంబు నీ యున్కికిన్.

చం॥ నిగమ విచారబద్ధులయి నిష్ఫల శాస్త్రవివాద పంకమం
దొగిదిగి, 'యస్తినాస్తి' యను నూహల మేను గృశింప శూన్యులై
పొగిలెడు వారలీ ఘన తమోవృత రాత్రిని దాటుత్రోవ దీ
యగనక, సెప్పి కొన్ని కథలంతటితో విరమింత్రు నెచ్చెలీ!

చం॥ కర మనురక్తి భావనలఁ గాంచి పరార్థపు మేలిముత్తెపున్
సరులను గూర్చి, తత్త్వముల సారమిదంచు రచించు పెద్దలున్
బరమ రహస్య సూత్రముల భావము లెప్పుడెఱుంగలేదు, తీ
వరముగ నెవ్వియో బలికి వార్తలు, నిద్రలు జెంది రక్కటా!

ఒకప్పుడు విజ్ఞానము కలిగినట్లు భ్రమపడియో లేక యినుము గొట్టిన తేజము కనుల కగపడియో యిట్లడుగును:

చం॥ ఒక నిముసంబె నాస్తిక మహోదధి దాటి పరాత్పరుం గనన్
వెకిలి కుశంక మార్గముల వీడి సునిశ్చిత జ్ఞాన మబ్బినన్
సకియరొ! చాలు, నట్టి నిముసంబును దుర్లభమందుఁ బ్రీతిమై
సుకపడ నబ్బు కాలమిది చూడగ నీ నిముసంబదొక్కటే.

ఉమరు యొక్క రుబాయీలను విమర్శించినచో ఆస్తికత్వముతోపాటు జగన్మిథ్యాత్వము, జీవిత విషాదము, నిగ్రహావశ్యకత, వైరాగ్యము మున్నగు భావము లచ్చున గట్టినటుల వ్యక్తమగుచుండును.

## హిజ్రీ 500 నుండి 7 వ శతాబ్దమువరకు

### (1) 'అన్వరీ'

ఇతని పేరు మహమ్మద్. అన్వరీ కవితానామము. 'తూస్' పట్టణమందలి 'మన్సూరియా' మద్రసా (పాఠశాల)లో విద్యాభ్యాసమొనర్చి సకల పాఠ్య శాస్త్రముల నేర్చుకొనెను. ఒకనాడు పాఠశాల ద్వారమువద్ద కూర్చొనియుండ నొక పెద్ద మనుష్యుడు వైభవముతో నేగుచుండగాంచి యతనిని దర్బారు కవిగా నెఱింగి, నాటినుండి పాఠశాలకు స్వస్తి చెప్పి, రాత్రియంతయు కష్టపడి 'కసీదా' (స్తుతిపరమైన కావ్యము) నొకటి వ్రాసెను. మరునాడు రాజగు 'సంజర్' సభకేగి కసీదా వినిపించగానే విజ్ఞుడగు రాజు వేతనము నేర్పరిచెను. ఇతడు 'సంజర్' దర్బారును వీడిపోవుట కితని జ్యోతిష్యము కారణమయ్యెనట. దైవజ్ఞుడగు అన్వరీ యొకనాడు తులా రాశియందు సప్తగ్రహ కూటమగుటచే గొప్ప గాలి దుమారము రేగి విపరీతమైన నష్టము కలుగునని జోస్యము చెప్పెనట. జనులందఱు భయావహులై నేల బొయ్యారములు త్రవ్వించి యందు దాగుకొని

యుండిరి. కాని యానాడు దీపమారిపోవునంతటి గాలి కూడా వీచలేదట. రాజు పిలిపించి మందలించుటచే అతని దర్బారులో నిక నివాసము పొసగదని అన్వరీ నైషాపూర్ పట్టణమునకు వెడలెను. ప్రభువులనేకులితని నాహ్వానించిరి. కాని సుల్తాన్ అహమద్ ఫెరోజ్‌షాః వెంట 'ఖ్వారాజ్మ' పట్టణమున కేగ నిశ్చయించియు, త్రోవలో 'జేహున్' నదిని దాటుటకు భయపడి 'బలఖ్' పట్టణముననే యుండిపోయెను. తర్వాత పశ్చాత్తాపతప్తుడై నదిని దాటి ఫెరోజ్‌షాః వద్దకు వెళ్ళి 'కసీదా'లు చదివెనట.

అన్వరీ కవి స్తుతి - నిందాపరములగు కవితలు వ్రాయుటలో నిపుణుడు. ఇతడు కవులను, ప్రభువులను నిందించువాడని ప్రఖ్యాతిగాంచినందున గిట్టనివారు నిందాపరములగు కావ్యములు వ్రాసి అన్వరీ పేరంటగట్టి యతనిననేక యిడుములకు పాల్పడజేసిరి. 'ప్రతూహి' యను కవి 'బలఖ్' పట్టణముపై నిందా కవితను వ్రాసి అన్వరీ కంటగట్టగా అన్వరీ యా పట్టణమునకు వచ్చినపుడా పురజనులందరు గలిసి యతని వికృతుని గావించి యూరేగింపజేసిరి. కొందరు పెద్దలు జనులను వారించి యతనిని విడిపించిరి. కవి తనకు సాయపడిన వారందరినీ స్తుతించి కృతజ్ఞతలను వెల్లడించెను. అన్వరీ తన శాస్త్ర విజ్ఞానము వలన సమకాలీన కవులకంటె ఎక్కువ గౌరవపాత్రుడయ్యెను.

అన్వరీ తన కవితా నైపుణి కంటె నతిశయమైన కీర్తి ప్రతిష్ఠలను గడించిన యదృష్టశాలి. ఫారసీ కవితా ప్రపంచమున వాగనుశాసనులని యశస్సు గాంచిన కవిత్రయములో అన్వరీ కొక స్థానము లభించినది. ఆ ముగ్గురు కవులు 'ఫర్దూసీ', అన్వరీ, 'సాదీ' అనువారు. 'జహీర్ ఫార్‌యాబీ' యను మరి యొక సుప్రసిద్ధ కవి 'కసీదా' లందారితేరినవాడనియు, అన్వరీ కంటె నతడే పైచేయి యనియు కొందరు సాహిత్యకారు లభిప్రాయపడి యా కాలపు కవులలో నగ్రస్థానము వహించి, 'సాదీ' వంటివాడని పేరు గాంచిన 'ముజద్ హంకరీ' యను మహాకవిని ఆ వివాదమును పరిష్కరింపగోరిరి. ఇద్దరు మంచి 'కసీదా' కవులేయైనను 'జహీర్' కంటె 'అన్వరీ'దే పై చేయి యని యతడు పరిష్కరించెను. అన్వరీ 'కసీదా' (రచనలో) అత్యంత నిపుణుడను మాట వాస్తవమే యైనను, 'ఫర్దూసీ', 'సాదీ'తోపాటు మధ్యస్థాన మీయదగినవాడు కాడేమో అని షిబ్లీ పండితుడభిప్రాయపడుచున్నాడు. అయినను సమకాలికులును, తరువాతి

సాహితీపరులును ఫారసీ వాఙ్మయ ప్రపంచమున అన్వరీ కొసగిన స్థానము శాశ్వతముగనట్లే నిలిచిపోయినది.

స్తుతికావ్యములు వ్రాసినను, వాటియందు కేవలము కృతిభర్త గుణగణముల స్తుతించుటేగాక తదితర విషయముల గూర్చి వ్రాయుటచే భావ వైశాల్యమును, కావ్య పటిమను వెల్లడించుట కతనికి సంపూర్ణావకాశము లభించినది. ఈ ప్రత్యేకతయే యతని ప్రాశస్త్యమునకు మూలహేతువు. రెండవది నిందాపరములగు కావ్యములను సృష్టించుటలో నితని నైపుణి గొప్పది. ఇతని వెక్కిరింపులకితని భార్యాపిల్లలు గూడ గురియైరని యితని 'దీవాన్' వలన తెలియుచున్నది. అరబ్బీ భాషలో పాండిత్యముగల్గి యుండుటచే అరబ్బీ పదములను వాక్యములను మిగులసుందరముగా నల్లుచుండెను. అతిశయోక్తి 'కసీదా'కు ముఖ్యాలంకారము. ఈ యలంకార ప్రయోగమున నతనికి సాటి మరియొకడు లేడు.

అన్వరీ యూరపు నందును ప్రశస్తిగాంచెను. రష్యా దేశస్థుడగు ప్రొఫెసర్ 'వ్యాలెన్టైన్ జమీకొస్కీ' యను పండితుడు క్రీ.శ. 1883 లో సేంట్ పీటర్సుబర్గు నుండి అన్వరీ యొక్క జీవితమును, కవితా ప్రాశస్త్యమును గూర్చి విమర్శ గ్రంథము నొకదానిని ప్రకటించెను. ప్రొఫెసర్ బ్రౌన్‌గారీ కవిని గూర్చి విస్తారముగా తమ గ్రంథమున నుల్లేఖించియున్నారు.

## (2) 'నిజామీ'

'ఇల్యాసు యూసఫ్' అనునది పేరు. నిజాముద్దీన్' అనునది బిరుద నామము. 'నిజామీ' యనునది కవితానామము. ఇతడు 'గంజా'యను పట్టణమున జన్మించినందున 'నిజామీగంజవీ' యని ప్రసిద్ధిగాంచెను. జనన సంవత్సరమును గూర్చి ఎవ్వరును వ్రాయలేదు కాని హిజరీ 596లో తన 63వ సంవత్సరమున మరణించెనని తెలియుటచే 533 హిజరీలో జన్మించి యుండెనని చెప్పవచ్చును. ఇతనిది పండిత వంశము. ఇతని యన్న 'మత్రజీ' యనువాడును గొప్పకవి. నిజామీ ఆ కాలపు గొప్ప పండితులవలె జ్యోతిష, గణితశాస్త్రాదులందును కూలంకషమైన విజ్ఞానమును సంపాదించెను. వైరాగ్యస్వభావము గలవాడైనను. భగవద్దత్తమగు. కవితాశక్తులు గలవాడగుటను, కవితానురక్తి వంశానుగతమైనందునను కావ్యరచనకే కడంగెను. త్వరత్వరగా నతని ప్రశస్తి దూరదూరమునకు

ప్రాకి సమకాలీనులగు రాజుల చెవినిబడి వారిచే రచనలకై ప్రోత్సహింపబడెను. అప్పటి రాజులు నిజామీచే కావ్యములను వ్రాయింపించి తమ కంకిత మొనర్పించుకొనుటలో అహమహమికను జూపినట్లగు పడుచున్నది.

మొట్టమొదట 559 హిజ్రీలో 'బహ్రాం షాః' అను ప్రభువున కంకితముగ 'మఖ్జనే అస్రార్' అను గ్రంథమును రచించి 5000 అష్రఫీలను, ఒక ఒంటెల బారును పలువిధములగు చీని చీనాంబరములను పారితోషికముగా బొందెను.

ఆ కాలమున గంజా పట్టణము సల్జూఖీ రాజుల పరిపాలనలో చేరియుండెను. సుల్తాన్ తొగ్రల్ ప్రభువుగా నుండెను. అతనికి 'అతాబుక్ మహమ్మద్' మరియు 'ఖిజల్ అర్సలాన్' అను యిరువురు మంత్రులుండిరి. రాజును, మంత్రులును సారస్వతప్రియులు. శూరులు, ఉదారగుణాఢ్యులు. వారు ముప్వురు నిజామీని సత్కరించు చుండిరి. అప్పుడే నిజామీ కవి సుప్రసిద్ధమగు 'షరీన్ ఖుస్రో'ల కథను కావ్యము గానల్లుచుండెను. రచన సాగుచుండగనే ఆ కావ్య ప్రశస్తి దిగంత విశ్రాంతమగుటచే తొగ్రల్ సుల్తాన్ కవికి ప్రోత్సాహ మొసంగుచు నమరమగు కావ్యమును సృజింపుమని సందేశమంపెను. ఆ కాలముననే మతోన్మాదము గల పండితుడైన మిత్రుడొకడు వచ్చి కాఫరులకు సంబంధించిన బూటకపు కథలు వ్రాయుటచే నేమి లాభమని తన యసమ్మతిని తెలుపుచు మందలించెనట. కావ్యము కొంతభాగము విని యా కవితా మాధుర్యమునకు జొక్కి విస్మితుడై యానందమున ప్రశంసించి వెడలెనట. కావ్యము పూర్తియైన పిదప 'ఖిజల్ అర్సలాన్' మంత్రిచే నాహూతుడై నెలరోజులు ప్రయాణము గావించి దర్బారునకు జేరి సక్రమ పద్ధతిలో కావ్యమును సభలో జదివి వినిపించి కృతిసమర్పణ గావించెను. పారితోషికముగా అగ్రహారములనొందెను.

ఈ వార్తలు వినిన కొందరితర రాజులకును తమ యశశ్చంద్రికలను చిరస్థాయిగా నొనర్చుకొనుటకై నిజామీచే కృతినొందు నభిలాష బొడమెను. 'మనూబెహర్' ఖాఖాన్ రాజు అసలు ఈరానీయ రాజ వంశస్థుడు. 'ఖాఖానీ'; 'అబుల్ అలా గంజవీ' మున్నగు కవివరేణ్యులితని సభ నలంకరించెడివారు. ఇతడు స్వయముగా నిజామీ కవివర్యునకు లేఖ వ్రాసి లైలా మజ్నూను యొక్క గాథను కావ్యగ్రథిత మొనర్చుటకై కోరెను. కొండ నేలలు ఇసుక దిబ్బలు గల

అరబ్బు దేశమునకు జెందిన లైలా మజ్నూన్ కథ నే విధముగా కావ్యమున గ్రుచ్చవలెననియు, కవితా సామగ్రి, వర్ణనాలంకారములకు తావే లేదేమోననియు కొంతవడి శంకించియు, తన కుమారుని ప్రోత్సాహము వలన, రాజాజ్ఞను పరి పాలించుటకు ఈ కవి ఎట్టకేలకు అంగీకరించెను. ఈ సంగతి కవియే స్వయముగా వ్రాసికొనియున్నాడు. బహుశః రసభరితమగు నీ గాధను ఈ కారణము వలననే నిజామీకంటె పూర్వీకులు కావ్యముగా నల్లుటకు పూనుకొనలేదేమో; ఇతడు నాలుగు నెలల కాలమున పూర్తిజేసి రాజునకు సమర్పించెను. ఇతర కృత్యములు లేనిచో పదునాలుగు రాత్రులలో 4000 పంక్తులుగల ఈ కావ్యమును పరిపూర్తి గావించియుందునని నిజామీ స్వయముగా చెప్పికొన్నాడు. హిజ్రీ 584 లో దీనిని రచించినట్లు కూడ ఇతడే తెలిపియున్నాడు.

నిజామీ 593 హిజ్రీలో సుల్తాన్ గియాసుద్దీన్ యొక్క ప్రోత్సాహముచే 'హఫ్తపైకర్' అను కావ్యమును రచించెను. ఇతడు పై కావ్యముల నన్నింటిని రాజుల కోరికపైననే రచించి వారికంకితమిచ్చెను. కాని తన కావ్య రాజమగు 'సికిందర్ నామా'ను మాత్రము స్వయం ప్రేరితుడై రచించి 'అజల్ బకర్ నసుతొద్దీన్'కు అంకితముగా సమర్పించెను. ఈ కావ్యము 599 హిజ్రీలో పరిపూర్ణమయ్యెను. తద్రచనానంతరమే కవి జీవితమును అంతమొందెను.

ఈ కవి స్వయముగా రాజసభలకు వెళ్ళి వారిని స్తుతించి వారి యనుగ్రహ ప్రాప్తికై పరితపించినవాడు కాడు. కాని రాజులే స్వయముగా నతనిని ప్రోత్స హించి, తమ పేర కృతులనందిరి. అయినను వారికి కృతి నిచ్చిన కావ్యములందు మాత్రము తన కృతి భర్తలను ప్రశంసా పూర్వకముగా ఇతర కవులవలెనే అతిశయోక్తిగా పొగడుచూ 'కసీదా'ల కంటే ఎక్కువ స్తుతి ప్రశంసలను గావించియున్నాడు. పై కావ్యములే గాక నిజామీ వ్రాసిన కావ్యములనేకము లుపలభ్యములు కాలేదు. గజళ్ళు, కసీదాలు మున్నగునవి వ్రాసెనని కొందరు గ్రంధకర్తలు పేర్కొనియున్నారు. కాని అవి దొరకలేదు. దొరికిన కసీదాలలో నైతికాధ్యాత్మిక విషయాలను పురస్కరించుకొని వ్రాసినవి కలవు. హకీం సనాయీ యొక్క పద్ధతి నవలంబించినటుల గనపడును. తన కావ్యములలో కృతిపతులైన ప్రభువులను ప్రశంసించినను, కసీదాలను ప్రభువు స్తుతికై యుప యోగింపక యొక కొత్త మార్గమును జూపెట్టెను. కాని ఇతరులెవ్వరును అతనిని అనుసరింపకపోవుట శోచనీయము.

నిజామీ కవి అన్ని విధములగు కావ్యములందును తన ప్రావీణ్యతను గనపరిచెను. ఫర్దూసీ కవి వీరగానమందు నిపుణుడు. శృంగారమందతని కభి నివేశములేదు. 'సాదీ' శృంగార, నైతిక కావ్యములు వ్రాసి వన్నెకెక్కెను. కాని వీరగాథలు వ్రాయలేదు. కనుక చప్పని కవిత అని కొందరనుకొందురు. ఖయ్యాం ఆధ్యాత్మిక కావ్యములు రచించి ప్రశస్తిగాంచెను. హాఫిజుది గజల్సు (శృంగార గీతములు) వ్రాయుట యందు పెట్టినది పేరు. నిజామీ కవి అన్ని విధములగు కావ్యములను వ్రాసి అన్నిటి యందును తన నైపుణ్యమును ప్రాశస్త్యమును నిరూపించెను.

'మఖ్జన్ అస్రార్', 'హఫ్తపైకర్' మున్నగు మస్నవీలను క్రొత్త వృత్తము లందు రచించి కవితా కన్నియకు వన్నెల గూర్చెను. నిజామీ కవి యొక్క శబ్ద సౌష్ఠవము, వాక్యముల పొందిక వలన గలుగు జవసత్వములు, భాషకొక గాంభీర్యమును విశిష్టతను గూర్చుచున్నవి. ఇతని గాంభీర్యమే 'ఉర్ఫీ' కవి యొక్క కావ్యమందును, అబుల్ ఫజల్ పండితుని వచనమునందును పరిపూర్ణత నందినది.

ఫర్దూసీవలె నిజామీ కేవల ఫారసీ పదజాలమునే యుపయోగించుటకై ప్రయత్నింపలేదు. తన కాలమున శిష్టులందరిచే వాడబడు. అరబ్బీ ఫారసీ మిశ్రితమైన విశిష్ట భాషనుపయోగించి పక్షపాతము లేకుండా పదసౌష్ఠవమును, అర్థ గాంభీర్యమును దృష్టియందుంచుకుని గ్రథనమొనర్చినాడు. అందువలన నతడు వాడిన పదములను మార్చినచో నేదో యొక లోపము కలిగి గాంభీర్యము తగ్గిపోవును. ఫర్దూసీ, సాదీ, నిజామీ - ఈ ముగ్గురు కవులను పోల్చినచో భావ గాంభీర్యమునందును, పదబంధములోను నిజామీయే పై ఇద్దరికన్నా మిన్నయని తెల్లమగును. తిక్కనను బోలిన వాగ్ధార, పదగుంఫనము, గాంభీర్యము ఇతని కవితలో కనబడును.

భావనాశక్తిని ప్రకటించుటయందును, అలంకారముల నుపయోగించుట యందును నిజామీ కవి క్రొత్త పోకడలతో కవితకు నూతన లావణ్యమును చేకూర్చెను. రాజు కిరీటము నలంకరించుకొనుటకు ఆణిముత్యములు కావలసి నప్పుడు కవి యా రాజుకు వశులైయున్న సూర్యుని, మేఘములను హెచ్చరించి

సకాలమున వర్షింపించి చిప్పలందు ముత్యములను పుట్టించును. ఒకచో నస్తం గతుడగు సూర్యుని యరుణ బింబమును మాణిక్యముతో బోల్చి వెంటనే దర్శన మిచ్చు చంద్రుని మాణిక్యమును (ముచ్చిలించిన దొంగయని పట్టుకొన నుంకించును అలంకార ప్రయోగములందు ప్రత్యేక ప్రతిభను జూపించును. కొన్ని యుపమాలంకారములు, ఉత్ప్రేక్షలు కేవల భాషా సౌందర్యమును పెంపొందించునవి గాక కావ్య విషయమునే శక్తివంతముగా నొనర్చును. శబ్ద బాహుళ్యమునకు తావొసంగక, కొన్ని పుటలందు తెల్పబడజాలు భావార్థములను కేవలము కొన్ని శబ్దములందే విస్పష్టముగా వ్యక్తపరుపజాలును. ఇతర పారసీక కవులందు ఉపమా, ఉత్ప్రేక్షాలంకారముల యొక్క యిట్టి విశిష్టమైన ప్రయోగము కానరాదు. నిజామీ యొక్క ఈ ప్రత్యేకత, నూతనత్వము తర్వాతి కవులకు మార్గదర్శకమై, యర్థాలంకారములందు తమ భావ గాంభీర్యము ప్రకటించుట కుత్తేజ మొసంగెను.

'సికిందర్ నామా' యను కావ్యమునందు అలెగ్జాండర్ చరిత్రను గ్రథిత మొనర్చెను. ఈ కావ్యము యొక్క రెండు భాగములందొకదానియందు సికిందర్ యొక్క వీరగాథలను, రెండవదానిలో ప్రత్యేకముగా శాంతి, శృంగార గాథలను కవనించెను. రెండవ భాగమున యవన పండితులతనితో నాధ్యాత్మిక విషయములపై చర్చలు సలుపునెడ గహనమైన నీ విషయములను వారి సంవాదములందు సులభమగు పారసీ శబ్దముల నుపయోగించి తేటతెల్లముగా దెలిపియున్నాడు.

నిజామీ యొక్క కవితయందు ముఖ్యమగు భాగము నైతికమగు కవిత. 'మఖ్జన్ అస్రార్', 'పంజు గంజు' అను రెండు గ్రంథములు నీతి శాస్త్రమును గురించినవే. ఇతర మస్నవీలందును విరివిగా నీతి రత్నములను గుప్పించి యున్నాడు. మానవ స్వభావమును చిత్రీకరించుటలోను, శక్తివంతమగు భావోద్రేకమును వ్యక్తీకరించుటలోను ఫర్దూసీకి ఏ మాత్రము తీసిపోడు. స్థూల భావములను, సూక్ష్మ భావములను వాని వైలక్షణ్య మిసుమంతయేని లోపము గాకుండా గ్రహించి పాత్రౌచిత్యమును గాపాడుచు వ్యక్త పరచుటలో నిపుణుడు. ప్రకృతి వర్ణనలలో నితర కవుల కన్నా నిజామీ మిన్న. శృంగార కవితకు స్వరూపమైన గజల్ 'సాదీ' తో నారంభమైనట్లు పరిగణింపబడు చున్నను, తత్పరిణతి మాత్రము నిజామీ వలననే జరిగినది. శృంగార పథ మనేకములు

నిజామీ కంటె పూర్వము వ్రాయబడినను, నిజామీ రచించిన మస్నవీల యందు, మూర్తీభవించిన శృంగార రసాతిరేకము లేక దానికొక ప్రత్యేక పరిభాష ఏర్పరుపబడినది. ప్రేయసియొక్క సౌందర్య విలాస విభ్రమములను వర్ణించుట కును, నాయికా నాయకుల వివిధ ప్రేమ కలాపములు, విరహవేదనలు, విప్ర లంభములు మున్నగు శృంగార చేష్టలను చిత్రీకరించుటకును ప్రత్యేక భాషా సామగ్రి యవసరము. ఈ సామగ్రిని పరిణత స్థితికి దెచ్చి, తన కావ్యములందు అత్యంత లావణ్యము తోడను మనోహర-పదగుంభనము తోడను శృంగార రసోపలబ్ధికాలంబనము గావించినాడు. ఒక్కొక్క పంక్తి యనేక గజళ్ళ సంప త్తిని గలిగి విరాజిల్లు చుండును. 'ఖుస్రోషగ్గీన్'అను కావ్యము నందీ యుదాహర ణము లనేకములు కనపడును. 'సికిందర్‌నామా' లోను శృంగార సంఘటనలం దీశక్తిని గనపరచినాడు. 'షాహనామా' రచన తర్వాత నొక శతాబ్దమునకు భాషలో ననేక మార్పులు జరిగి యనేక శబ్దములు వాడుకనుండి పడిపోయినవి. ఆ గాథలు మరుగున పడజొచ్చెను. అందువలన జాతియొక్క వీర భావములను జీవ వంతముగా నుంచుటకై నిజామీ 'సికిందర్‌నామా'ను రచించిన యా పని యందు కృత కృత్యుడయ్యెను. కాని ఈ కావ్యము యొక్క ముఖ్యనాయకుడు 'సికిందర్' (అలెగ్జాండర్) ఈరానీయుడు కాక ఇతర దేశీయుడైనందుచే ఈరానీ యుల కంత గౌరవాభిమానములు కలుగజాలక పోయినవి. ఒకే నాయకుని గాథలు చదివి చదివి విసుగు కలుగును. అయినను ఆరు వందల సంవత్సరము లలో ఎన్ని కావ్యము లిట్టివి రచింపబడినను 'సికిందర్‌నామా' యొక్క ప్రశస్తి తగ్గలేదు. యుద్ధ గాథలు, వర్ణనలు మున్నగునవి మిగుల నిపుణతతో సంగ్రధిత మొనర్చినందున చదువరుల నాకర్షించుచున్నది. ఫర్దూసీ యొక్క 'షాహనామా'తో పోల్చి చూచిన నిజామీ యొక్క 'సికిందర్‌నామా' భాషా గాంభీర్యమునను, భావ సౌందర్యమునను మిన్న యని స్ఫురింపక మానదు. అయినను మొత్తముపై నిజామీ ఫర్దూసీ తుల్యుడని మాత్రము చెప్పరాదు.

## హిజ్రీ 7 వ శతాబ్దము నుండి 900 హిజ్రీ వరకు

ముస్లిం విజ్ఞానమును, సాహిత్యమును సంపూర్ణ వికాసము నొందుచున్న కాలమున 617 హిజ్రీ సంవత్సరములో చంఘీజ్ ఖానుడు 'తాతార్' నుండి దండయాత్ర నారంభించెను. ఆ సంక్షోభము ప్రపంచ శాంతినెల్ల భంగపరచినది.

దాదాపు 40 లక్షల ప్రజల రక్తపాతమైనది. వందల నగరములు, వేల గ్రామములు మట్టిలో గలిసిపోయినవి. పాఠశాలలు, మతములు మున్నగునవి పాడైపోయినవి. విజ్ఞాన సాధనములు చెడినవి. ఇస్లాం మతము మాత్రము ఈ మొత్తిడికి తట్టుకొనుటయేగాక ఈ ప్రవాహ మాగుటతోడనే దాగియున్న తేజః-కణములు ప్రజ్వరిల్లజేసి దిగంత విశ్రాంతమగు కాంతిని వెదజల్లెను.

చంఘీజ్ ఖానుడొక మహత్తరమగు దోపిడిగానివలె బయలుదేరి ప్రబలమగు రాజ్యస్థాపన మొనర్చెను. అప్పుడు రాజవంశస్థులకు ముసల్మానుల సహాయ మవసరమయ్యెను. చంఘీజ్ ఖాన్ తరువాత అతని కొడుకు 'ఉక్తాయి' వాని పిదప మనుమడు 'హలాకూ' పీఠాధిష్ఠులైరి. హలాకూ మంత్రి పదవిని 'మొతకిక్ తూసీ' యను సుప్రసిద్ధ ముస్లిం పండితునకిచ్చెను. అందువలన ముసల్మానుల ప్రాబల్యము దర్బారునందు హెచ్చుటయే గాక రాజులును కొందరీమతము నవలంభించిరి. హిజ్రీ 694 లో 'గాజింఖాన్' అనువాడు 60,000 తుర్కి ప్రజల సహితముగా ఇస్లాం మతమును స్వీకరించెను. ఈ వంశమువారిలో 'అబూ సయీద్' అను రాజు మిగుల న్యాయప్రవర్తి కలవాడేకాక పాఠశాలలను, మసీదులను కట్టించి సప్త సంతానముల నెలకొలిపి యశో విరాజితుడయ్యెను, ఇతనికి పిల్లలు లేనందున వంశమంతమొంది సర్దారులనేకులు చిన్న చిన్న సామంత రాజ్యము లేర్పరచుకొని ఒకరితోనొకరు కలహించుచు శాంతిలేని యరాజకమునకు దారితీసిరి. తుదకు తైమూరు ప్రబలుడై వీరందరిని రూపుమాపి తన రాజ్యమును నెలకొల్పెను.

ఈ కాలములో ఫారసీక కవితకు మాత్రము దెబ్బ తగులలేదు. కావ్య రచనయొక్క వివిధ రంగములందభివృద్ధి కలుగుటయే గాక ప్రపంచ విఖ్యాతులైన మహా కవులనేకులీ కాలముననే వర్ధిల్లిరి. విప్లవ సంక్షోభములకు గురియై 40-50 లక్షల ప్రజలు, నగరములు, గ్రామములు, రాజులు, శిల్పములు, కట్టడములు నాశనము నొంది స్తంభించిన కాలమున సహజముగా వైరాగ్య భావములు ప్రజల నావరించును. సాహితీపరులు తద్వాతావరణము యొక్క పరిణామమే తమ సాహిత్యమున గనపరుచుచుందురు. ఫరీదుద్దీన్ అత్తార్ మౌలానా రూమీ, అవహదీ, ఇరాకీ, సాదీ, మగ్రబీ మున్నగు తత్త్వవేత్తలు, వేదాంత కవులు ఈ కాలమువారే. ప్రపంచము క్షణ భంగురమను భావము గట్టిగా నాటుకొనుటచే

ప్రజలు స్వయముగా చూచిన దృశ్యములే ముఖ్యకారణములు. తాము స్వయముగా ననుభవించని తర్వాతివారును ఈ భావములనే మరింత స్పష్టముగాను, విరివిగాను తమ కావ్యములందు వ్యక్తపరచి వైరాగ్య ప్రచార మొనర్చిరి.

## ఖ్వాజా ఫరీదుద్దీన్ అత్తార్

### హిజ్రి 513-627

ఇతని పూర్తిపేరు అబూతాలిబ్ మహమ్మద్. నైషాపూర్ జిల్లాలో కద్గన్ అను గ్రామ వాస్తవ్యుడు. ఇతని తండ్రి 'ఇబ్రాహీం' పరిమళ ద్రవ్యముల వ్యాపారము చేయుచుండెను. తండ్రి వ్యాపారము మరింత యభివృద్ధికి తెచ్చి నైషాపురములోనుండు కార్ఖానాలలో నన్నింటిని గూడ నితడే వశము గావించుకొనెను. ఇతడు పరిమళ వస్తువుల, అత్తరుల వర్తకుడేగాక వైద్యుడు కూడా. ప్రతిరోజు 500 రోగులను పరీక్షించి వారి కుపచారములు గావించువాడట. ఖ్వాజా ఫరీదుద్దీన్ అత్తార్ యొక్క తండ్రి, కుత్బుద్దీన్ హైదర్ అను పేరుగల గొప్ప తత్త్వజ్ఞుని శిష్యుడు. ఆ గురువర్యుని యొద్దనే ఖ్వాజా ఆధ్యాత్మిక విద్యల నభ్యసించి వైరాగ్యమునందెను. కాని ఇస్లామ్ మతము సన్యాసము నొప్పుకొనదు. గనుక గృహ జీవితమును వదలక వాణిజ్య వైద్యము లొనర్చుచునే తన యోగమునం దభివృద్ధి గాంచెను. అనేక దేశముల యాత్ర గావించినటులను, హిందూస్థానమునకు వచ్చినటులను స్వయముగా వ్రాసికొన్నాడు. ఒకసారి ఇతడు తన కొట్టునందుండ నొక ఫకీరు ప్రవేశించి యనేకములగు సరుకుల నూరక పరీక్షించుచు కాలము వ్యర్థపరచెనట. "ఏమి? యూరక వృధాకాలక్షేపము చేయుచున్నావు? నీ తోవనబొమ్మ"ని ఖ్వాజా సాహేబ్ హెచ్చరించెనట. "సరే! నా విషయమేమి? నేనిప్పుడే పోవుచున్నాను. కాని నీవు నీ త్రోవను చూచుకొమ్మ"ని బదులు పలుకుచూ ఆ ఫకీరు అచ్చటనే పరుండి ప్రాణములు వదలెనట. తక్షణమే ఇతడు సరుకులను పంచిపెట్టి వ్యాపారమును వదలివేసి ఫకీరుగా మారిపోయినాడని 'తజుకిరా' గ్రంథములో కలదు. బహుశ ఈ యుదంతమతని జీవితము యొక్క చరమదశయందు జరిగి మొదటినుండి వైరాగ్యభావములచే నిండిన యతని నొక్కుమ్మడిగా మార్చియుండును. విరాగియైన ఈ కవి నైషాపురమునందే చంఘీజుఖానుని దోపిడీ జరుగుచున్నప్పుడు నుండెను. ఒక మొఘల్ సైనికు డితనిని చెరబట్టి చంపుటకై యత్నించుచుండ మరియొకడు

వేయిరూకలకు నతనిని కొనుటకు సంసిద్ధుడై యుండెనట. అప్పుడు "నా విలువ యింతకంటె నెక్కువ గావున, నితని కమ్మవల"దని వారించెనట. మరియొక మొగలాయి వచ్చి "ఈ ముదుసలిని నాకొక గడ్డిమోపుకు బదులు విక్రయించెదవా" యని యీ సైనికు నడుగగా ఖ్వాజాసాహెబ్ "ఇతనికి నన్ను విక్రయించవలసినది. నా విలువ ఇంతకంటె తక్కువయే" యని పలికెనట. "ఈ పరస్పర విరుద్ధాలాపములచే నన్ను వెక్కిరించుచున్నా"వని సైనికు డితనిని తన కరవాలమున కెర గావించెను. ఇట్టితడు 114వ ఏట మరణించెను.

ఇతడు బహుగ్రంథ నిర్మాత అస్రార్ నామా - ఇలాహీనామా - ముసీబత్‌నామా - జవాహర్ రుబ్బాత్ - వసీయత్‌నామా - మంతకుత్తయర్ - బుల్‌బుల్‌నామా - హైదర్‌నామా - గుల్‌వహుర్మజు - సియాః నామా - షతుర్ నామా - ముక్తార్‌నామా మున్నగు గ్రంథములు కాక గజల్సు, రుబాయీలు మున్నగు ఖండకావ్యము లనేకములు లక్ష పంక్తులు రచించెను. 'తజకిరతుల్ అవులియా' యను పేరుగల భక్త విజయమువంటి భక్తుల జీవిత చరిత్రము నొకదానిని రచించెను. దీనిని బ్రౌను దొరగారు ప్రచురించిరి.

సూఫీ కవులలో నగ్రగణ్యులగు వారు నలువురు. సనాయీ - అవహదీ - మౌలానా రూమీ - ఖ్వాజాఫరీదుద్దీన్ అత్తార్. అందరికంటె ప్రపంచ విఖ్యాతిని గడించిన మౌలానా రూమీ సమకాలికుడైనను తాను సనాయీ అత్తార్ వీరి తర్వాతివాడననియు, అత్తార్ ఏడు నగరములను విహరించిన నేనొక వీథినైనను తిరుగలేదనియు ప్రశంసించినాడు. అత్తార్ యొక్క శైలి అతి సులభమై దుర్గ్రాహ్యమగు తాత్వికాధ్యాత్మిక విషయములను గద్యమున కంటె సులభముగా పద్యము లందిమిడ్చి వ్యక్తపరిచెను. ఈ రకమునకు చెందిన సాహిత్యము నందింతటి సులభశైలిని రచించిన మరియొక మహాకవి లేడని చెప్పవచ్చును.

'మంత కుత్తయర్' అను గ్రంథమందీ కవి విచిత్రముగా జీవాత్మలు పరమాత్మ సందర్శనార్థము చేయవలసిన యాత్రను పక్షి సంవాదరూపమున వర్ణించెను. పక్షులన్నియు పౌరాణికమగు 'సీముర్గ' అను మహాపక్షిని వెదకి సందర్శించుటకై బయలు వెడలును. పక్షులన్నియు సమావేశమై తాము తల పెట్టిన యన్వేషణోద్యమమున కొక మార్గదర్శకుడగు నాయకునెన్నుకొనుటకు

నిశ్చయించును. హూపో (Hoopoe) అనునొక పక్షిని నాయకునిగా నెన్ను కుని యన్వేషణ మారంభింపగనే ప్రతి పక్షియు దనకుగల ఇబ్బందులను తెలియపరచుచు వెనుకంజవేయును. నాయకపక్షి వీరుచెప్పిన యాటంకము లన్నింటికి బదులుచెప్పి ఒప్పించును. మార్గ మధ్యమున మరల నీ పక్షులన్నియు 22 సార్లు హూపో (Hoopoe)తో తమ కష్టములను చెప్పుకొనగా వీరందరి కనేక కథలను గాథలను చెప్పుచూ సమాధానపరచి ప్రయాణము కొనసాగించు టకు ప్రోత్సహించును. తుదకు మహాపక్షి సందర్శనమగును. ముప్పది పక్షులు ప్రయాణము చేసిన నవియే నొక యద్దమునందు వలె కనబడియెను. ఆ స్వరూ పమే మహాపక్షి. ఇందులో జీవాత్మ పరమాత్మల భేదము లేక భేదరాహిత్యము శుద్ధాద్వైత తత్వానుసారముగా నిరూపింపబడినది. సూఫీ తత్వములో శుద్ధా ద్వైతము ముఖ్య సిద్ధాంతము. ఈ సిద్ధాంతమును వ్యాపింపజేసిన మహాకవులలో ముఖ్యుడీ ఫరీదుద్దీన్ అత్తార్'.

## 'మౌలానా రూమీ'

ఇతనిపేరు జలాలుద్దీన్ మహమ్మద్. రూమ్ అనగా ఆసియా మైనరులో (Asia Minor) నితని జీవితభాగ మెక్కువగా గడచినందున నితనికి 'రూమీ' యను కారణ నామము కలిగినది. ఈ మహాకవి పర్షియాలో దేశభక్త కవులు లేక సూఫీ కవులందరికి మకుటాయమానుడై 'మౌలానా' అనగా ప్రభువు లేక గురువు అను బిరుదమునకు పాత్రుడైనాడు. ఈతని సుప్రసిద్ధమగు కావ్యము మస్నవీ, మన ఆది కావ్యము వలె అమరత్వము గాంచినది. దీనిని 'ఖురానుల్ అజమ్' అనగా పారసీ భాష యొక్క 'ఖురాన్' అని గౌరవింతురు.

ఈ మహాకవి క్రీ.శ. 1207 లో బల్ఖ్ పట్టణమందు జన్మించి క్రీ.శ. 1273 లో కొన్యా నగరమందు మరణించెను. ఇతని తండ్రి 'మహమ్మద్' బల్ఖీ పట్టణము నుండి కొమారుని వెంటనిడుకొని వెడలి పోవలసి వచ్చెను. మార్గ మధ్యమున నైషాపూర్ నగరమున వీరు ఖ్వాజా ఫరీదుద్దీన్‌ను, అత్తారును సందర్శించిరి. ఐదేండ్ల బాలుడగు జలాలుద్దీన్‌ను చూసి వీడు మహా ప్రశస్తిగాంచునని అత్తార్ దీవించి పంపెను. శాస్త్రములను తండ్రి వద్ద నేర్చుకుని పిదప ఇతరులకు శిష్యుడయ్యెను. కొన్యా పట్టణము నందు ఉండు

కాలమున క్రీ.శ. 1244 లో 'షంషెతబ్రీజ్' అను మరియొక భక్తాగ్రేసరుని సాన్నిధ్యము లభించెను. జలాలుద్దీన్ అతని శిష్యుడై తత్వ జ్ఞానమును, యోగమును అభ్యసించెను. ఈ 'షంషె తబ్రీజ్' అను మహామహుడు సూఫీ తత్వ వేత్తల సమూహములో ఒక విచిత్రమైన వ్యక్తి. మహా విజ్ఞానవంతుడు, శాస్త్రజ్ఞుడును కాకపోయినను తన యాధ్యాత్మిక శక్తిపై గట్టి విశ్వాసము కలిగి పట్టుదలతో తన విశ్వాసములను వెల్లడించి ఇతరులను నమ్మించు ధీనైపుణి గలవాడు. సోక్రటీసు (Socrates) వలె ప్రశ్న పరంపరను గుప్పించి వివాద మొనర్చువాడు. అతని వలెనే నితడును చంపబడి బలవన్మరణమందెను. గురువు గారిపై జలాలుద్దీన్‌కు భక్తిమెండు. అతని పేర 'దివానె షంషె తబ్రీజ్' అను కావ్య సంపుటమును ఇతడే రచించెనని పండితుల యభిప్రాయము.

ఈ మహాకవి రచించిన 'మస్నవీ' పది సంవత్సరముల కాలములో పూర్తియైనది. ఆరు భాగములలో 26,660 ద్విపాద పంక్తులీ కావ్యమునందు గలవు. మహాకవి స్వయముగా పీఠికయందు తన గ్రంథము యోగశాస్త్రమనియు బ్రహ్మవిద్యను బోధించుననియు భక్తులకుపాసనా మార్గమును, జ్ఞానులకు యోగ మార్గమును తెలుపుననియు మతము యొక్క మూల సూత్రములను విశదీకరించుననియు వక్కాణించియున్నాడు

ఈ గ్రంథమంచనేక ఇతిహాసములును, ఉపాఖ్యానములును కలవు. ఇందులో కొన్ని విసుగును, ఏవగింపును కూడా కలిగించును. ఐనను తాత్విక విషయములు, దివ్యజ్ఞాన సమస్యలనేకములు చర్చించి సూఫీ సిద్ధాంతముల స్పష్టీకరణమొనర్చెను. ఈతని 'మస్నవీ' సూఫీలకు మహాభాష్యము వంటిది. పామర్, సర్‌జేమ్స్, రెడ్‌హౌలేజ్, నికల్సన్ మున్నగువారితని మస్నవీ భాగముల నతి సమర్థతతో ననువదించి పాశ్చాత్య పండిత లోకమునందితని ప్రతిభను చాటి విస్తరింపజేసిరి. సాహిత్య దృష్టిచే నితని 'మస్నవీ', 'దీవాన్' అను రెండునూ గొప్ప కావ్యములే. ఎక్బాల్ మహాకవి ఇతనిని మతద్రష్టగాను గురువుగాను భావించును.

# కమాల్ ఇస్మాయీల్

'కమాల్' అను కవితానామము గల ఈ కవి తండ్రి అబ్దుర్రజాక్ గూడ సుప్రసిద్ధ కవియే. కొంతకాలము ప్రభువుల దర్బారులో స్తుతిపాఠములు గావించి విసుగుజెంది సుప్రసిద్ధ మత గురువగు 'షహాబుద్దీన్ సహర్ వర్దీ' గారి శిష్యుడయ్యెను. 635 హిజ్రీలో చంఘీజ్‌ఖాను కుమారుడు ఉక్తాయెఖానుడు' అస్ఫహాన్ నగరమునకు వచ్చి పౌరులను చంపుట కాజ్ఞాపించెను. అప్పటివరకీ కవి సన్యసించి ఊరిబయట గుడిసెలో నుండెను. ప్రజలీతని యందు గాఢవిశ్వాసమును, గౌరవమును కలిగియుండిరిగాన వారు తమ ధనమును తీసుకొనివచ్చి ఇతని కుటీరమునందు దాచియుండిరి. ప్రజలను చంపి నగరమును దోచుకొనుచుండగా నొక తురుష్కుడు కమాల్ కుటీరమువైపు దాడి వెడలెను. ఒక పక్షిని వేటాడుటకై బాణమును సంధించివేయగా నా పక్షి దెబ్బతిని కుటీరములో జొచ్చి అక్కడి బావిలో పడినది. ఆ తురుష్కుడు బావిలోనికి దిగి చూడగా అందులో ననేక ధనభాండారములు దాచిపెట్టబడి యుండెను. దీని రహస్యమేమని యడుగగా నా కవి ముమ్మాటికి నాకు తెలియదని చెప్పెను. ఆ తురుష్కుడు కోపించి యతనిని చంపివేసెను. ప్రాణములు విడుచునప్పుడొక గీతమును పాడి చచ్చెను. ఇది 626 హిజ్రీలో జరిగిన ఉదంతమని కూడా నొక గ్రంథమున కలదు.

ఈ కమాల్ పూర్వీకులకును, అధునాతనులకును మధ్య సరిహద్దు వంటివాడు. పూర్వీకుల గాంభీర్యము, వాక్పటిమ, అధునాతనుల విశిష్ట భావనాసంపత్తు పద లాలిత్య సౌకుమార్యములు ఇతడు మేళవించి రచించెను, ఖ్వాజా హాఫీజ్ మహాకవి అందువలననే ఇతనికి జోహారు లర్పించుచున్నాడు.

'కమాల్', 'జమాల్' అను ఇరువురు కవులలో మిన్న యెవరను ప్రశ్న వచ్చి కవి సంఘములలో పోటీ పడినపుడు 'హజీన్' అను నా కాలపు విద్వత్కవిని పరిష్కరించుటకై కోరగా నతడు కమాలే అన్ని విధముల గొప్పయని తీర్మానించెను. 'మెహక్కి-కెతూసీ' యను గొప్ప పండిత ప్రకాండుస కీతడు సమకాలికుడు. ఈ పండితుడు తన గ్రంథమున కమాల్‌ను ప్రశంసించెను.

ఈ కవి (కమాల్) లలిత హాస్య రసము సేవగింపు కలుగకుండ నుపయోగించుటలో సమర్థుడు. పిసినిగొట్టుల వెక్కిరించి యేడిపించినాడు.

"చెడ్డవాడను నేనని చెప్పుచుండె
జనుల కొక్కడు నను గూర్చి సజ్జనుండు
మంచివాడని వాని స్తుతించుచుంటి
ఇరువురము సత్యదూరుల మిందు నిజము."

అని తనను నిందించినవానిని బహూకరించినాడు. 'గజల్' కవిత ఫక్కిని ఏర్పరచినవాడు మొదట 'కమాల్'. తర్వాత షేక్ సాదీ దానిని పూర్తి గావించి గజల్ కవితా పితామహుడని పేరుగాంచెను. హాఫిజు మున్నగువారు దానికి మరింత వన్నె గూర్చిరి.

ఉ. రాతిరి నన్నుగాంచి పలురంగుల మాటలఁ దిట్టుచుండెఁ దాఁ
జేతులు మోడ్చి వందనము చేయగ వీడు వినంగ లేద టం
చాతత కోపరాగ జనితారుణ కాంతులఁ జిమ్ము మోవిచే
బూతులు వల్కెఁ దేనియలపుట్టగు వాతెర తీపు లూరగన్.

'ఈ తెర గెన్నడున్ రుచుల నింపగు భాష వినంగలేదిలన్' అని ప్రేయసి యొక్క దుర్భాషలకు చొక్కుచున్నాడు.

ఉ. మత్తుడు బాణమున్ గుటిని మార్కొని వేయగలేడటంచ్రడు, ఆ
బిత్తరి చూపు మత్తిలిన బిట్టుగ సూటి శరంబులన్‌దెగన్
మొత్తును; నాపయిన్ విడుచు ముల్కులు నా యెదలోన దాచినన్
హత్తును బైపయిన్ గఱుసుటమ్ములు నొక్కటి వెన్క నొక్కటిన్.

అని ప్రేయసీ తీక్ష్ణ దృక్శరంపరల కోడుచున్నాడు.

తే॥ చాన మొగమున కెనయేది గాననగునెః
యైన నెలుగెత్తి పలుకుము (యౌ) నటంచు,
నింత మృదు మధురంబునై యెసఁగు మోవి
కలదె భువి యందు నది కలకంద గాని!

అని చాలెంజి జేయుచున్నాడు-

ఉ॥ కాలమె యొక్క కన్నుగవఁ గార్చవలెన్ దడికంటి నీరు; లే
దా లభియింపఁ గావలెను దాలిమి, దుఃఖభరంబు నోర్వ గా;
చాలని యాయువున్ వలె విషాన్విత కీటకజాల మట్టులన్
జాలెడు జీవితమ్మనెనె సంకటముల్ భరియింప వీలగున్.

అనునది కవి సిద్ధాంతము.

## షేఖు సాదీ

'షేఖు ముస్లిహుద్దీన్' అను పేరుగల 'సాదీ' మహాకవి సుప్రసిద్ధులగు ఫారసీ 'కవితా ప్రవక్త' త్రయములో నొకడు. 'ఫర్దూసీ', 'అన్వరీ' లతో పాటు 'సాదీ'కి గూడ ఆ గౌరవ స్థానమున్నది. ఇతని జన్మభూమి 'షీరాజు' పట్టణము. సుమారు క్రీ. శ. 1184 ప్రాంతమున జన్మించి 1291 లో తన 107 వ ఏట మరణించినట్లు నిశ్చయింపబడినది.

ఏ ఫారసీ కవికిని సాదీకి గల ప్రచారము లేదు. జన్మభూమి యందే గాక ఫారసీభాష ప్రచారములోకి వచ్చిన ప్రతి దేశమునను సాదీ కృతులను చదువని వాడును, నతనిని ప్రశంసించని వాడును గానరాడు. అతని 'గులిస్తాన్' (గులాబితోట), 'బోస్తాన్'. (పరిమళవనము) అను రెండు కావ్యములును ఫారసీ విద్యార్థులందరికిని కావ్య పరిచయము గావించు పాఠ్య గ్రంథములు. సాదీ యొక్క గజళ్ళు (Lyrics) ప్రపంచ విఖ్యాతి గాంచినవి. హాఫిజు గజళ్ళ తర్వాత వీనికే ప్రాశస్త్య మొసగబడినది. సూఫీతత్వము పరిణతినంది, ఫారసీ సాహిత్యమున ముఖ్యస్థానము నాక్రమించి యున్నందున సాదీ రచనలందును నా తత్వభావములే స్పష్టముగా గన్పట్టునుగాని, సమగ్ర దృష్టిచే జూచినచో సాదీ మహాకవి యుత్తమాదర్శమును, సంపూర్ణ లౌకిక జ్ఞానమును గలిగియును గృహస్థ నీతిని బోధించిన నైతిక ప్రవక్తయని చెప్పవచ్చును.

చిన్న తనముననే తండ్రి గతించెను. తొలుత విద్యాభ్యాసము తండ్రి వద్దనే జరిగినందున మొదటినుండియే దైవ, బుధజన భక్తి కలిగెను. 'అతాబుక్ సాద్ జంగీ' అను గవర్నర్ పరిపాలన నుండి 'సాదీ' యను కవితా నామమును స్వీకరించెను. ఈ గవర్నరే సాదీని బగ్దాద్ విశ్వవిద్యాలయమున విద్యాభ్యాస

మొనర్చుటకు బంపెను. దాదాపు క్రీ. శ. 1226 వరకు బాగ్దాదులో గురుకుల వాసము గావించెను. కాని యంతకు ముందే క్రీ.శ. 1210 లో కాష్గర్ పట్టణమునకు ప్రయాణమొనర్చెననియూ అప్పటి వరకే 'సాదీ' యశోలతలు ప్రాకియుండి నటులనూ 'బోస్తాన్' గ్రంథము వలన దెలియుచున్నది. బాగ్దాదున నివసించు కాలమందే సుప్రసిద్ధ భక్తుడును, సూఫీ తత్వజ్ఞుడునగు 'షేక్ షహాబుద్దీన్ సహార్ వర్దీ' యొక్క సాహచర్యమును, శిష్యరికమును లభించినది. మరియొక గొప్ప పండితుడగు 'షంసోద్దీన్ ఇబ్నుల్ జౌజీ' వద్దను విజ్ఞానమును సంపాదించెను.

ఈ మహాకవి దీర్ఘాయుష్యమును బొంది, జీవితము యొక్క మంచి చెడ్డలను, సంసారములోని యచ్చ నీచములను ప్రపంచము యొక్క వైవిధ్యమును సంపూర్ణముగా తిలకించిన యనుభవశాలి. క్రీ. శ. 1226 వఱకు గురుకుల వాసకాలము, అప్పటికే మహా మేధావియగు పండితుడని ప్రశస్తి గాంచినను' నిజమగు జీవితానుభవమును తర్వాతి ముప్పది సంవత్సరముల కాలములో నితడు సంపాదించెను.

క్రీ.శ. 1226 ప్రాంతమందు పర్షియాదేశపు రాజకీయ పరిస్థితి మిక్కిలి దుర్భరముగానుండెను. తార్తాదుల (Tartars) యాక్రమణమున భయానక పరిస్థితులు గలిగియున్నను 'షీరాజ్' నగర పాలకుడగు 'అతాబుక్‌సాద్ జంగీ' న్యాయ పరిపాలనమునే చేయుచుండెను. అయినను 'సాదీ' జన్మభూమిని వీడి ముప్పది సంవత్సరముల కాలము దేశాటన గావింపవలసివచ్చెను. క్రీ.శ. 1256 లో అతాబుక్ సాదీజంగీ కుమారుడగు 'అతాబుక్ అబూబకర్ బిన్ సాదీ జంగీ' పరిపాలించునపుడు దేశమునందలి యల్లకల్లోలము మారి శాంతి నెలకొల్పబడెను. అప్పుడీ కవి జన్మస్థానమునకు తిరిగివచ్చెను. ఈ యంశమును 'గులిస్తాన్' కావ్య పీఠికలో కవి తానే స్వయముగ వివరించియున్నాడు. తురుష్కుల యన్యాయము, ప్రజాహింస, దోపిడి మున్నగు పాశవిక వృత్తులను తీవ్రముగా నిందించుచు వానిని జూడలేక మాతృభూమిని వీడి ప్రపంచ మెల్లెడల ననేక క్లేశములు భరించుచు భ్రమించి వచ్చితినని చెప్పికొన్నాడు.

'సాదీ' గావించిన దేశ భ్రమణమునకు ప్రత్యేకమైన యుద్దేశములేదు. ఇతనిలో నెన్నియో శక్తులు కేంద్రీకృతమైయుండెను. కవి, సూఫీ, శాస్త్రజ్ఞుడు,

బోధకుడు, సౌందర్యారాధకుడు. విలాస పురుషుడు. కనుక ప్రపంచము నీ పలు దృక్పథములచే జూచి యనుభవము సంపాదించుటేగాక విమర్శించియున్నాడు. ఒకప్పుడు విరాగియై కాలి నడకన దూరదూరములకు నడిచి చెట్టు గుట్టలనక ప్రయాణము గావించి కరకురాళ్ళపై పరుండి నిద్రించెను. మఱియొకప్పుడు పాలస్తీనులో నీటి సంచులను భుజముపై మోయుచు యాత్రికులకు నీటినందించుచు సేవ జేసెను. ఎక్కడనో మహాత్ముడగు యోగిగలడని విని 'రూమి' (Constantinople) నగరమునకు ప్రయాణమయ్యెను. మఱొకసారి 'రూం' నగర ప్రజలను చూచి చూచి విసిగి యడవిలో దిరుగుచుండ క్రైస్తవులచే పట్టువడి యొక యజమాని కమ్మబడి బానిసత్వమున నుండెను. ఇట్లనేక విధానుభవముల నందిన యిమ్మహాకవి తన 'గులిస్తాన్', 'బోస్తాన్' కావ్యములందు రసవంతమగు చక్కని కథలతో ప్రపంచమునకు నీతిబోధ గావించియున్నాడు.

ఈ పర్యాటనమున నితడు ఆసియా మైనరు, ఇరాకు, అరబ్బు, అబిసీనియా, ఉత్తర ఆఫ్రికా మున్నగు దేశములేగాక హిందూస్థానమును గూడ దర్శించినాడు. పంజాబ్, గుజరాతు ప్రాంతములకు వచ్చి సోమనాథ దేవాలయములను గూడ దర్శించినాడట. బోస్తాన్ కావ్యమున తాను సోమనాథాలయమునకు వచ్చి, అక్కడి పూజారులతో చెలిమి సంపాదించి తుదకొక రహస్యము కనుగొన్నట్లు కథ వ్రాసికొన్నాడు. ఒకానొక బ్రాహ్మణునితో తాను, 'ఈ రాతి ప్రతిమ నెందుకు పూజించెద'రని యడిగెనట. అతడు కోపించి వాగ్వివాదానంతరమా ప్రతిమ యందు మహా మహిమ గలదని మరునాడు చూపించెనట. ప్రొద్దున పూజా సమయమున విగ్రహము నమస్కారము గావించెననియు, ఆయుదంతము చూచినతర్వాత రహస్యమును కనుగొనవలెనని యెంచి మారువేసమున నుండి యవకాశము లభింపగా దేవాలయమున జొచ్చి ద్వారములను బంధించి నలుదిక్కుల జూడగా మూల విరాట్టు వెనుక నొక యవనిక గనుపట్టినదట. దాని వెనుకనుండి దూరిపోగా నచట నొక మనుష్యుడు త్రాడుచేత దంతపు విగ్రహము యొక్క హస్తములను పైకి లాగుచుండెనట. తనను గాంచివాడు పరుగెత్తగా వాని వెంటబడి వానిని బావిలో త్రోసి తాను పరుగెత్తెనట. ఈ కథ నిజమో అబద్ధమో చెప్పలేము గాని, సాదీ వర్ణించిన దంతపు విగ్రహము పారసీలయొక్క 'పాజంద్' (జందె అవస్తా) యొక్క అధ్యయనము - ఇంత గొప్ప దేవస్థానము

నందితని కిట్టి యవకాశము లభించుటవంటి విషయము లవిశ్వసనీయములుగా గనపడుచున్నవి. మౌలానా షిబ్లీగారును దీనిని విమర్శించినారు. ఆ కాలమున నెంతవఱకు వచ్చి యే దేవాలయమును చూచెనో, యే విషయము నెట్లు తెలిసి కొనెనో యా పొరపాట్లన్నియు నితని కథలో కనపడుచున్నవని షిబ్లీ గారి యభిప్రాయము. కథలలో స్వకపోల కల్పితములైన గాథ లనేకములుండవచ్చును గాని, సాదీ బహుదేశ పర్యటన గావించినది మాత్రము నిర్వివాదాంశము. హిందూ స్థానమున 'అమీర్ ఖుస్రూ' మహాకవిని గూడా కలిసి కొనెనని కొందఱు 'తజ్కిరా'లలో వ్రాసియున్నారు. కాని రెండు సారులు బైరంఖానుడు ఆహ్వానించినను వృద్ధుడను రాలేనని బదులు పంపెనని కొందఱు గ్రంథకర్తలు వ్రాయుచున్నారు.

షీరాజు పట్టణమునకు తిరిగివచ్చిన తర్వాత దర్బారుతో సంబంధము తప్పలేదు. 'అబూబకర్ బిన్ సాద్'ను ప్రశంసించు కొన్ని స్తుతి రచనలు గావించెను. 'గులిస్తాన్', బోస్తాన్' అను రెండు సుప్రసిద్ధ రచన నితనికే యంకితము గావించెను. అయాచితముగా పారితోషికములు, ధనాదులు కూడ లభించెను. కాని, స్వతంత్ర భావనలు గలవాడనియు, సత్యము వచించుటలో వెనుదీయడనియు, నతని స్తుతి కావ్యముల వలన దెలియుచున్నది. ప్రశంసాపద్యములు, అతిశయోక్తి రహితములుగా ఉపదేశపూరితములుగా నున్నవి. ప్రభువులు అదివరకు వినుట కలవాటు పడిన స్తోత్ర పాఠముల నితడు చేయలేదు. అందు వలన ప్రభువుల దర్బారులలో దగినంత గౌరవము లభింపలేదు. కాని విద్యాధికులు, విజ్ఞులగు అమీర్లు, ధనవంతులనేకులు షేఖు సాదీకి భక్తులై యుండిరి.

'హలకూ ఖాను'ని పరిపాలన కాలమున ఖ్వాజా షంసుద్దీన్, అలాఉద్దీన్ అను ఇరువురు సోదరులు మంత్రి పదవిని నిర్వహించుచుండిరి. వీరిరువురును మంచి విజ్ఞులును, రసికులు సారస్వత ప్రియులు, ధర్మపరాయణులును. షేఖు సాదీని వీరత్యంత గౌరవముతో పూజించుచుండిరి. ఒకనాడు సాదీ 'హజ్జు' నుండి తిరిగివచ్చుచు రాజధానియగు 'తబ్రీజు' నగరమునకు వచ్చెను. ప్రభువగు 'హలకూఖాను'ని కుమారుడు స్వారి చేయుచుండెను. పరిజనముతో వీరిద్దరు మంత్రులును ఉండిరి. మార్గమున షేఖు గారది చూచి పలుకరించుట కిది సమయము కాదని తప్పించుకో యత్నించిరి. కాని దూరమునుండియే యానవాలుం పట్టిన మంత్రులిద్దరు గుఱ్ఱములనుండి దిగి జనసమ్మర్దమున షేఖుగారిని కలిసి

కొని పాదాభివందనము గావించి తిరిగి రాజుగారిని చేరుకొనిరి. ప్రభువీ యుదంతమును గాంచి మీరింతగా గౌరవించిన మనుష్యుడెవరని విచారింతగా నతడు మా గురువని బదులు చెప్పిరి. తనవద్దకు పిల్చుకొని రమ్మన బలవంత ముగా షేఖు సాదీ దర్బారున కేగవలసి వచ్చెను. తగిన గౌరవమును గావించి, వెడలునప్పుడు నాకేదేని యుపదేశము గావించుమని వేడగా మంచిచెడ్డలే వెంట వచ్చును గనుక మంచి కార్యములనే చేయుము"ని ప్రబోధించెను. అతని కోరికపై రాజధర్మమును గూర్చి చెప్పినవీ క్రింది పద్యములు:

చ॥ ప్రజలను కంటి రెప్పవలె పాలన చేయుచు గాచు రాజెపో
నిజముగ రాజు, సుంకముల నీతిమెయిన్ గొనజాలు; కావరై
ప్రజలను గావ నట్టి ప్రభుపట్ల నవన్ని విషంబులే యగున్,
భుజబల వేతనంబులను భుక్తము జేయుట పాపమిద్ధరన్.

ఇవ్విధముగా ప్రభువులకు సందేశమును, ఉపదేశము నొసంగి స్తుతి కావ్యములందు వాని నిమిడ్చి వేలకువేలు వరహాలు బహుమతుల నందెను. కాని దబ్బుకై యాసపడి వారిని బట్టువలె పొగడి ప్రతిఫలమునకై కవిత నమ్ము కోలేదు.

షేఖు సాదీ చిన్నతనమునుండియే తండ్రి వలన విద్యాబుద్ధులను, దైవ భక్తిని, బుధజన సాంగత్యముల లాభమును బడసినను నిశిత కుశాగ్రబుద్ధి యగు టచే నందరిని విమర్శించుట కలవాటు పడెను.అంతేకాక కొన్ని సమయములందు తీవ్రవాద వివాదములందు జంపూముష్టికి సిద్ధమైనట్లతని రచనల వలన తెలియు చున్నది. ఇతడు యవ్వనమందు విలాసపురుషుడై వర్తించి, రానురాను వైరాగ్యము నవలంబించినట్లు తెలియుచున్నది.

సాదీ యొక్క రచనలలో నతని కావ్యసంపుటి యొక్క వ్రాతప్రతి యతని మరణానంతరము 36 సంవత్సరముల తర్వాత లభ్యమైనది. ఇండియా ఆఫీసు లైబ్రరీలో నెంబరు 1117 గల గ్రంథము. అందులో 18 వివిధ కావ్య ములు గలవు. అరబ్బీ, పారసీ, తుర్కీ అను మూడు భాషలలోను వివిధ కావ్య ములు రచింపబడియున్నవి. యిరోపియా పండితులీ మహాకవి ముఖ్య కావ్యము

లగు గులిస్తాన్, బోస్తాన్‌లను సవిమర్శగా పరిశోధించి ఆంగ్లేయ, జర్మన్, ఫ్రెంచి భాషలలో ననువదించి ప్రకటించిరి. రష్యన్, పోలిష్ భాషలలో గూడా ఈ కవి కావ్యములు కొన్ని యనువదింపబడి ప్రచురితమైనవి.

ఫర్దూసీ, అన్వరీ తో పాటు సాదీకి ఫారసీ కవితా వాఙ్మయమున మూడవ స్థానమీయపడినది. గజల్ తెగకు చెందిన కవిత యందితడు ప్రజ్ఞా విశేషములు గలవాడనియు, ఈ రకపు కవితకు వన్నెవెట్టిన ప్రథమ సుప్రసిద్ధ కవి యైనందున నీరకపు కవిత (గజల్)కు ప్రవక్తయని పేరు వడసెను. ఇతని కవితయొక్క ముఖ్య గుణము భావోద్రేక పూరితమైన భావప్రకటనము. హృద యమందు ఆవేశము జనించనిదే ఇతడు రచనకు పూనుకొనడు. ప్రభు స్తుతి గావించినపుడును వారి ప్రత్యేక గుణమేదో తన నాకర్షించినపుడే రచనకు పూను కొనును.

సాదీ కవి నీతి శాస్త్రమునకు మనోరంజకమగు స్వరూపము నొసంగి మరపురాని కథలందును భావపూరితములగు విభాషితములకు జొప్పించును. న్యాయము, దండనీతి, పరోపకారము, ప్రణయము, మర్యాద, వైరాగ్యము, నిశ్చలమైన భగవన్నిర్భరత్వము, సంతృప్తి, శ్రద్ధ, పశ్చాత్తాపము, దైవభక్తి, మున్నగు నైతిక విషయములపై ఉదాహరణములను కల్పించి కథలను వ్రాసి మనోహరమగు బోధలను గావించెను; సాదీ రచించిన 18 గ్రంథములలో నందరి వలన జదువబడుచు లోక ప్రశస్తి గాంచినవి గులిస్తాన్, బోస్తాన్ అనునవియని పైన వచించియుంటిని. వీనిలో గులిస్తాన్ గద్యపద్యాత్మకము. ఎనిమిదధ్యాయము లందులో కలవు. (ఒకటి) రాజుల గుణములు (రెండు) సాధువుల వర్తనము. (మూడు) సంతృప్తి యొక్క ప్రభావము, (నాలుగు) మౌనము యొక్క ఫలము (ఐదు) శృంగార విలాసములు (ఆరు) వార్ధక్యము. (ఏడు) శుశ్రూషా ఫలితము. (ఎనిమిది) సహవాసము అనునవి. వీనిలో ప్రతి యధ్యాయమునందును కొన్ని కథలు గలవు. కథా సందర్భములును వర్ణన భాగములును వచనమునందును, ముఖ్యమగు నీతిసారమును బోధించు భాగములు పద్య రూపమునను, రచింపబడి యున్నవి. పై యెనిమిది శీర్షికలను నీతి, శృంగారము, వైరాగ్యములను మూడు భాగములందిమిడ్చ వచ్చును. ఈ విషయము ననిసి భర్తృహరి యొక్క శతక త్రయమునకు బోల్చనగును.

బోస్తాన్ కేవల పద్యాత్మకము. పది యధ్యాయముల గ్రంథము. (ఒకటి) రాజనీతి (రెండు) ఉపకారము (మూడు) ప్రేమ (నాలుగు) సత్కారము (ఐదు) శాంతత (ఆరు) తృప్తి (ఏడు) బోధనము (ఎనిమిది) కృతజ్ఞత (తొమ్మిది) పశ్చాత్తాపము (పది) పరివేదనము. గులిస్తాన్ నందువలె కథలుండి నను కథా భాగము తక్కువ కలిగి ఉపదేశభాగ మెక్కువగా దీనితో నున్నది. ఈ రెండు కావ్యములలో గులిస్తానున కెక్కువ ప్రశస్తి కలదని చెప్పవచ్చును.

సాదీ కాలమున రాజాశ్రయము తప్ప కవులకు గత్యంతరము లేదు. పైన వివరించినట్టుల ఈ కవి గూడా ప్రభుస్తుతి గావించినను వారికి హితబోధ గావించి మిగుల నుపకృతి నొనర్చెను. కొన్ని సందర్భములందు ఈ మహాకవి పలికిన వాక్కులను శ్రీ మాడపాటి హనుమంతరావుగారు తెలుగులో ననుదివంచి "సుజాత" యను మాస ప్రతిక యందు ప్రకటించియుండిరి. వారిచే ననువదిత మగు పద్యములను మచ్చునకు పొందుపరచుచున్నాను.

'అంకియాను' అను ప్రభువును గూర్చి సాదీ రచించిన స్తుతి పద్యము లలో నొకచోట నిట్లున్నది:

"ఎంత నీవెరుంగుదొ సాది యంతె పల్కు;
సత్యమును చాటవలయు విస్పష్టముగను;
ఆశయు ప్రభుత్వ భయము లేనట్టి కవికి
ఎంతపాటిది తార్తార్ః ఎంత 'ఖుతను'
న్యాయమూర్తి! సత్కీర్తి! మహావనీశః
మానితౌన్నత్య! అంకియాన్ మానవేంద్ర!

మరియొక సందర్భమున ఇట్లు సంబోధించెనుః

ఎదుటను పొగడ్త, చాటుననేవగింపు
నందు, నృపతిని తుచ్ఛుండటంచునెరుగ;
'వేలము' 'సిరాఖు' ను తురుష్కమేలునట్టి
అసమవీర! న్యాయాధీశః అంకియాను!!

జనకునీతి వాక్యమ్ముల వినకపోతె
మానె; బుద్ధితో పినతండ్రి మాటవినుము!
ప్రతినరుడు నిజము ముఖాన పలుకలేడు
సుమ్ము! 'సాదీకె' యది సుసాధ్యమ్ము; నమ్ము!!

కవితాకాంత యొక్క పావిత్ర్యమును అబద్ధమను స్తోత్ర పాఠమను కళంకమునుండి కాపాడిన మహానుభావులలో ముఖ్యుడని సాదీ పేరొంది యున్నాడు. ఈ విషయమున శ్రీనాథాదులు ప్రోత్సహించినను సరకుగొనక దారిద్ర్యమున కాలమును గడిపిన మన పోతనామాత్యుని స్మరణకు దెచ్చు చున్నాడు.

కాలమీ రీం వృథ చేసెదేల సాదిః
వచ్చుబడి కొంచమేయైన నొచ్చుకొనకు
స్తుతులు రచియింతువేని నీ వెతలు బాయు.
ధనము లేనట్టి విబుధ జీవనము వమ్ముః
హితుల కోర్కెలు ధనహీనుడెట్లు తీర్చు
తీర్పులేకున్న నరి గెల్పు స్థిరమటండ్రు!
చచ్చు మాంసము గ్రద్ద మెసంగి బ్రతుకు
పర్వతాగ్రాన సంతృప్తి బడయునట్లు
అధములను జేరి, చేజాచి యర్థినగుట
కాదు నాచేత; కాదు బికారి పోల్కి!!

సాదీ కథలలో నొకటి సాధు వర్తనము గురించి కలదు.

సుర నొకడు త్రాగి తనదు తంబురను సాధు
వరుని తల మీద నొక రాత్రి పగులగొట్టె
మరుసటి దినాన సాధువా మత్తు కడకు
పిడికెడు ధనంబు గొనిపోయి పిలిచిచెప్పె
"రాత్రి యొడలెరుగక సగర్వముగ నుంటి
వపుడు నా తల తంబుర యటులె పగిలె,
నాదు గాయము నయమయ్యె; లేదు భయము
తంబురకు గాయమెటుమాను ధనములేకః"

జనుల వలన నిరంతర శ్రమల గాంత్రు
కనుకనే దైవ భక్తుల ఘనత హెచ్చు.

ఇటువంటి కథలు నీతిబోధను గావించునవనేకములు గలవు. ప్రభువుల నిరంకుశత్వమును వారి దౌర్జన్యమును నిరసించుచు వారికి సద్బోధన గావించి న్యాయవర్తనము ప్రోత్సహించుచు నెన్నియో కథలను గల్పించి వ్రాసెను. ఆ కాలపు ప్రభువులకు వారి సహచరులు, మంత్రులు అందరును భయపడు చుండెడివారు. సాదీ వాక్యములందు రాజానుచరులు—

"పగలు రాతిరి యని రాజు బలుకెనేని
యదిగొ చంద్రుడు, నవి చుక్కలనుచు బల్కు"

అను నీతిని పాలించుచుండిరి. అట్టి పరిస్థితులందు షేఖ్‌సాదీ యనేక విధముల ప్రతి పౌరునికి రాజును విమర్శించు నధికారము కలదని ఘంటాపథమున చాటెను. ఒక దుష్టుడైన రాజుకథ ఇట్లు వ్రాసెను. "వాడు తన ప్రజలను పశువులవలె నిర్బంధముగా పట్టుకొని వారిచే పని చేయించుకొనుచుండెను. ఒకరోజు అకస్మాత్తుగ వేటకు వెళ్ళినప్పుడనుచర సైనికులును, రాజును విడిపోయిరి. రాజు ఒక గ్రామమునందా రాత్రి గడపవలసి వచ్చెను. ఆ రాత్రి యొకడు తన గాడిద నూరకయే దాని కాలుచేతులు విరిగిపోవు వరకు బాదుచుండ జూచి రాజు వానిని వారింపగా వాడు 'నేనీ గాడిదను పనికిరాకుండా చేయుచున్నాను. అట్లైనచో మా రాజు దానిని వెట్టిచాకిరికై పట్టుకొనడు" అని బదులు చెప్పుచు రాజును గూర్చి ఇష్టమువచ్చినట్లు తిట్టెను. ప్రొద్దున సైనికులు వెదకుచు నా పల్లెనుజేరిరి. రాజు తన యాస్థానమునకు వచ్చి వానిని కట్టి తెప్పించి రాత్రి వాడు తనకు గావించిన యవమానమునకై వానిని శిక్షింప గడగినప్పుడు వాని వాక్యములివి;

శా॥ నేనొక్కండనె తిట్టినాడ ననుచున్ నీ వెంచకో రాజ నీ
మానం బంతియె ? లోకమెల్ల నిను దుర్మార్గుండటంచెంచగా
నేనే దోషినె క్రోధమూని పెలుచన్ నిర్జించి శిక్షింపగన్ ?
నేనో నీ యెదుటాడితిన్, జనులనన్ నిందింత్రు నీ చాటుగన్ !

శా॥ అన్యాయం బొనరించి లోకమున నీవాసింతు వెట్లొక్కొ ని
న్నన్యుల్ మంచిగ జెర్కొనంగ వినగా నా కోర్కె నీ కున్నచో
నన్యాయంబును వీడి నీ ప్రజలకు న్యాయించి పాలింపుమా
ధన్యుండయ్యెద తప్పులేని మనుజున్ దండింపగా బాడియే ?

ఉ॥ నీవొనరించు దుర్నయము నిండె జగాన, ప్రజాళి సంతతా
రావము మారుమ్రోగె నిల,రాజవు వృద్ధుడవింక నాపయిన్
జావు విధించితేని వడి జంపుము నేనొకరుండనుగాను నీ
వే విధి వందనార్హమగు నెల్లప్రజన్ బరిమార్చువిద్ధరన్ ?

ఉ॥ నీదు సమక్షమందునను నిత్యము కొందరు నిన్ స్తుతింపగా
నౌదువె లోక వంద్యుడవు నౌదల జేర్తురె నీప్రజల్ నినున్
బేదలు సాధులున్ పిదప పిన్నలు పెద్దలు నింద సేయగన్ ?
వాదనయేల ? వేయు కరవాలము నాశిరమున్నదిచ్చెదన్ ॥

ఒక రాజత్యంత సాత్విక ప్రవృత్తి గలవాడు. నిరాడంబరజీవి. సభికులలో నొకడు "ప్రభూ ! తాము చీని చీనాంబరములను ధరించుట సమంజసమ" ని మనవి చేసెనట. రాజీ విధముగా ప్రత్యుత్తర మొసంగెను.

"ప్రజల వలనను సుంకముల్ ప్రభువు గొనుట
నిజ సుఖాప్తికి గాదది నిక్కమముగ
భూషణంబులు మకుటముల్ వేషములును
ప్రియములే నాకు నైన దెప్పింపలేను.
సొమ్ము నాయదిగాదు రాజ్యమ్ము నూవె
రాజ్య భండారములు దేశరక్ష కొరకె
తొడవులకు గావు ప్రభువు సంతోషపడగ
పల్లెవారల పశువుల పరుడుపట్ట
దశమ భాగంబుగొని రాజు దక్కుటెట్లు ?"

తృప్తిని గుఱించి ఇట్లు పలికియున్నాడు.

తృప్తినొందుము హృదయమా తెచ్చినంత
ఇంచుకయె చాలు నాశల మించబోకు
బిచ్చగాడని రాజని భేదమరయ
రేడు సంతృప్తుడైనట్టి వాడు జగతి ॥

ఉ॥ ఆసనడంచి కోరికల నవ్వల దోలితివేని రాజునున్
దోసిలి యొగ్గి వేడ పనిదోపదు పొట్టను గొట్టియాత్మ సం
వాసము జేసి సర్వముని వంద్యుని శ్రీహరి గూర్చి మ్రొక్కినన్
భాసిలు నీ శిరంబు రవిభాతిని తృప్తి వికాస సంపదన్

గీ॥ ఆసనడు గంటుగా ద్రొక్కివేసి తేని
'సేవకుండను భృత్యుడకావు' మనుచు
వ్రాయ పనిలేదు నెవ్వనికీ యుగాన
మానవుని క్రింద గూల్చు నీ మానసంబు
తెలివి గలదేని మనమును మలచిపట్టు !
నీవు స్వాతంత్ర్యమే గోర నేలపైన
ప్రక్కవేసి పరుండుము పట్టు పరుపు
గోరి పరునింట భూ చుంబకుడవు గాకు
రెక్క బలముండ కష్టించి బుక్క దినుము
పరుల మృష్టాన్నమున కంటె బాగు గాదె ?

ఈ విధముగా స్వయంకృషి, ఉద్యోగ లక్షణము, నిరాడంబర జీవనము, నిష్పక్షపాతము మున్నగు ననేక నీతులను బోధించియున్నాడు.

నింద :

చ॥ మనుజుని మంచిచెడ్డల విమర్శనతో పనియేమి నీకు ? స
జ్జనుడు దురాత్ముడంచు విరసంబుగ బల్కగనేల యూరకే ?
వినుమటు నించజేయ నవివేకియు దుష్టుడెయైన శత్రువై
కనలును, సజ్జనుండయిన కాపురుషుండుగ మారిపోయెడిన్॥

మౌనము :

ఉ॥ నీవు వివేకివేని గణనీయుడవౌదువు మౌన వృత్తిచే,
నీ వవివేకి వేని మఱి నీదగు తప్పుల గప్పి పుచ్చెడిన్
గావున మౌనమే గుణము కష్టము దక్కను జ్ఞానివైనచో
నే వగలేదు! పామఱుడవేని మునుంగది చింపబోకుమా !

సత్సహవాసము :

స్నాన గృహమున నొకనాడు సకియ వదలె
మంచి గంధము కెనయైన మంటి ముద్ద
చేతగొని "నీవు కస్తూరి చిప్పవో, జ
వాజి ముద్దవో ? నీ దివ్య వాసనాళి
మోహన పరిమళంబుల ముగ్ధుడనయి
యుంటి మత్తుడనై" యన మంటి ముద్ద
పలికె నిట్టుల "నేనొక విలువ లేని
మట్టిగా నుంటి, కొన్నాళ్ళు మాన్యత గల
నా గులాబి తో సహవాసమబ్బె నాకు;
జతగ నుండుటచే దాని సద్గుణంబు
నలవడియె, లేనిచో నేను విలువ లేని
మట్టినేగాని నాకేమి మాన్యత" యని,

మ రి యు—

రాతిరొకనాడు నిద్దుర రాక యుంటె
శలభ మిటు దీపమును జూచి పలుక వింటి
"నేను పాంథుడ కాలుట నీతియగును
కాని నీవేల వేదనన్ గాలుచుంటి"
వనగ దీపంబు బలికె "నో యనుగు మిత్ర :
ఎంత బేలవు నా ప్రియు చింత బాసి
మధుర సహవాసమే లేక క్రమ్మగియుంటి
నీవు దీపార్చి పైబడి త్రోవ దీసి
ఇటుల నటులను సల్లడ నెగిరిపోదు
వేను పూర్ణాహుతిన్ బొందగాను నిలిచి
యుంటి; ప్రణయాగ్ని నీ రెక్కనంటి కాల్చు
నన్ను గాంచుము తల, తోక, నన్ని గాల్చు"

విషయములను మనోరంజకములుగా చిత్రించుట సాదీ యొక్క కళా కౌశలతను చాటుచున్నది. ఉక్తవ్యమగు భావమును చదువరుల మనంబుల గాఢముగ నెట్లు నాటవలెనో, నేవిధముగ బలికినచో జనుల హృదయము నాకర్షించునో తన వాక్కులకు శక్తి, ప్రభావములెట్లు కలుగునో యా రీతి నవలంబించుట యందు సాదీకి గల ప్రతిభ మరొక కవికి లేదు. ఆ కారణముననే నీతిపరములైన కావ్యములనేకములున్నను సాదీ యొక్క గులిస్తాన్, బోస్తాన్ గ్రంథములకు గలిగిన జనాదరణము మరే గ్రంథమునకు లభింపలేదు. ప్రకృతి వర్ణనము నందును సాదీ కవి ఇతరులకంటె మిగుల చమత్కృతిని చూపించెను.

**గజల్ కవిత :**

ఫారసీ కవితా వాఙ్మయమునందు గజల్ అను సీస మాలికవంటి పద్య జాలమునకు మిగుల ప్రాముఖ్యము గలదు. అనేక వృత్తములందు రచింపబడు నీ గజల్ కవితయొక్క విశిష్టత యిప్పటికిని తగ్గలేదు. అరబ్బి భాషలో 'రాగా లాపన' యను నర్థముగల గజల్ మిగుల రసవంతమై మనోరంజకముగా నుండును. ఇందులో కవి తన మనోభావములను సంగ్రథిత మొనర్చును. విషయము ప్రతిపాదమునకు మారవచ్చును. పది పన్నెండు చరణములు గల ఒక గజల్ నందు కావ్యవిషయము లేక భావ మొకటియేయై యుండనవసరము లేదు. కవి తన భావపరంపరలను, వాక్ చమత్కృతిని, కల్పనా వైలక్షణ్యమును వ్యక్తపరచు చుండును. వివిధ భావములకే సంబంధమును యుండనవసరము లేదు. ఒక చరణములో నొక భావమును, వేరొక చరణములో మరియొక భావ మును ఉండవచ్చును. శృంగార వైరాగ్యాది సవసరములను గుప్పించవచ్చును. గణ, ప్రాస నియమములు మాత్రము కలిగియుండును. పారసీక కవితా వాఙ్మ యమునందు నూటికి తొంబది వంతులు ఈ గజల్ కవితయే. సాదీ కంటె పూర్వమే ఖసీదా కవులగు అన్వరీ, జహీర్, కమాల్, యిస్మాయిల్, గజళ్ళు వ్రాసియుండిరి. ఈ కవితా భాషయు తగిన సంస్కారమొంది యుండెను. అయినను సాదీ మహాకవియే 'గజల్'ను కవితా ప్రపంచమున అగ్రాసన మలంక రింప జేసెను. ఇతనిని గజల్ కవితా పితామహునిగా పరిగణింతురు. ఇతని పూర్వకవుల గజళ్ళందు శృంగార రసము కేవలము వాక్ చమత్కృతి యందే గాన్పించును. కాని సాధీ కాలమువరకు వీర రసాత్మకమైన జీవన మంతమొంది

సంఘమున శృంగార రసాత్మకమగు జీవనము విరివిగా సాగుచుండెను. కనుక సహజ శృంగార భావోపేతుడగు సాదీకవి తన గజళ్ళయందు వాక్చమత్కృతి కంటె స్వానుభవజనితములగు శృంగారభావములను అత్యంతాకర్షణీయముగను, సూటిగను భావుకుల మనస్సులకు హత్తుకొనుసట్లుగను చిత్రించెను. పూర్వ కవులు ప్రణయోదంతములను, స్వానుభవములను చిత్రింపకుండిరి. సాది జంకు గొంకు లేక తన యనుభవములనే సంగ్రథిత మొనర్చెను. నాయికా నాయకుల భావములను సూటిగా, మనోరంజకముగా, శక్తివంతముగా వ్యక్తపరచుటయందారితేరిన వాడగుటచే నతని గజళ్ళు ప్రపంచము నింతగా నాకర్షించినవి. ఇతడు తన గజళ్ళలో శిష్టాచార వ్యవహారములకు బహిరంగముగా ప్రాముఖ్యము నొసంగి రహస్య సుఖలంపట జీవనులగు కుహనా యోగులను నిరసించుట యందును, వారి కుట్రలను ప్రపంచమునకు జాటుటయందును గట్టివాడు. గజళ్ళ యందీశక్తిని చూపించుట ఇతడే యారంభించెను. ఇతర విధములగు కవితా రీతులందును సాదీ తన ప్రతిభను ప్రదర్శించెను. సాదీ మహాకవి, ఖ్వాజా హాఫిజున కొక విధముగా మార్గదర్శకుడయ్యెను.

## అమీర్ ఖుస్రూ

అమీర్ ఖుస్రూ తండ్రి సైఫుద్దీన్ మహమూద్ తుర్కీ దేశవాసి. చంఘీజ్ ఖాను ని యాక్రమణ సమయమున ఆ దేశమును వీడి హిందూ స్థానమునకు వచ్చెను. ఇతనికి ముగ్గురు పుత్రులు. 1. ఇజ్జుదీన్ అలీ 2. హిస్సాముద్దీన్ 3. అమీర్ ఖుస్రూ. సైఫుద్దీన్ హిందూస్థానమునకు వచ్చి మహమ్మద్ తుగ్లక్ చక్రవర్తి కడ గొప్ప యుద్యోగమును పొందెను. అమీర్ ఖుస్రూ తండ్రి చనిపోయినపుడు ఏడు సంవత్సరముల బాలుడై యుండెను. బాల్యమునుండియే ఖుస్రూ కవితారాధనకు గడంగెను. ఇరువది సంవత్సరముల వయస్సు వరకు అరబ్బీ, ఫారసీ భాషలలో కూలంకషమైన పాండిత్యమును గడించి మెప్పు వడసెను.

అమీర్ ఖుస్రూ యువకుడగు వరకు సుల్తాన్ గియాసుద్దీన్ బల్బన్ పీఠాధిష్ఠుడై యుండెను. మొదట బల్బన్ దర్బారులో ముఖ్యుడైన అమీర్ కత్లూ ఖాన్ ఛజ్జూ యొక్క యండ దొరికెను. కత్లూ ఖాన్ సారస్వత ప్రియుడు, కవి

పోషకుడు. దేశ దేశములనుండి పండితులు కవులు, గాయకులు వచ్చి ఇతని వలన సత్కారముల నందుచుండిరి. రెండు సంవత్సరములు అమీర్ ఖుస్రూ గూడా కత్లూ ఖానుని యాస్థాన కవిగా నుండి స్తుతి కావ్యములను రచించెను. తర్వాత బెంగాల్ (లక్షణవతి)లో పరిపాలకుడుగా నియమింపబడిన బొగ్రా ఖాన్ యొక్క ఆస్థానమున కొంత కాలము గడపి పిదప గియాసుద్దీన్ బల్బన్ ప్రథమ పుత్రుడు, విద్వాంసుడును, కళాపోషకుడును నగు మాలిక్ మహమ్మద్ వెంట నతడు గవర్నరుగా నియమింపబడినప్పుడు, ముల్తాన్‌కు వెళ్ళెను. 5 సంవత్సరము లతని యాస్థానమున నుండెను. ఇరాన్‌నుండి తైమూర్ ఖానుడను అమీర్ దండెత్తి వచ్చినప్పుడు యుద్ధములో తార్తారుల చేత మాలిక్ మహమ్మద్ నిహతుడయ్యెను. అప్పుడు అమీర్ ఖుస్రూను మరియు హసన్ దెహ్లవీ యను మరియొక కవిని తార్తారులు చెఱబట్టి బలఖ్ పట్టణమునకు గొనిపోయిరి. ఖుస్రూ 683 హిజ్రీలో జరిగిన ఈ యుదంతముపై విషాదగీతములు వ్రాసి ఢిల్లీకి పంపించెను, ఆ గీతికలింటింట జదువబడి యుద్ధములో నిహతులైన వారి బంధువులకు శాంతి ప్రదములైనవి. రెండు సంవత్సరముల పిదప తార్తారుల చెరనుండి యెట్లో తప్పించుకొని హిందూస్థానము చేరుకొని తన స్వగ్రామమగు, ఇటావ్హా జిల్లాలో నున్న, పటియాలీ వద్ద గంగా తీరమున బసచేసెను. పిదప ఔధ్ (Oudh) యొక్క సుబేదారుగా నియమింపబడిన ఖానె జమాన్ వెంబడి ఆ ప్రాంతమునకు వెళ్ళెను. రెండు సంవత్సరములక్కడ నివసించి తన వియోగమును సహింపని తల్లి ప్రేమ కాగలేక తిరిగి ఢిల్లీ నగరమున ప్రవేశించెను. కైకుబాద్ రాజ్యము నకు వచ్చిన తర్వాత భోగలాలసుడై రాచకార్యముల నుపేక్షింపదొడగెను. తండ్రియగు బొగ్రాఖానుడు బెంగాల్‌లో నుండి ఈ సంగతి విని ఢిల్లీకి తరలి వచ్చెను. కైకుబాదున కిది రుచింపక తండ్రిపై దండెత్తబూనెను. కాని మార్గ మధ్యముననే రాయబారముల ద్వారా రాజీ కుదిరెను. ఈ విషయములన్నియు కైకుబాదు కోరికపై ఖుస్రూ కవి 'కిరాను స్సాదైన్' అను కావ్యమున గ్రంథస్థ మొనర్చెను. మూడు సంవత్సరముల పిదప కైకుబాద్ సుఖజాడ్య పీడితుడై దివంగతుడయ్యెను.

ఈ రాజవంశమందెవ్వరును రాజ్య భారమును వహించుటకు దగినవారు లేనందున ఆ దర్బారున నుండిన 70 సంవత్సరముల వృద్ధుడగు "తుర్కీ అమీర్ ఫైరోజ్ షాయస్తఖాన్ ఖిల్జీ" అనువాడు రాచరికపు గద్దియనెక్కెను.

ఇతడే జలాలుద్దీన్ ఖిల్జీ. ఇతడు గొప్ప విశిష్టత గలిగి మిగుల ప్రశస్తి గాంచెను. ఇతడు సారస్వత ప్రియుడును, కవియును. ఇతని దర్బారులో మలిక్ తాజుద్దీన్, మలిక్ ఫఖ్రుద్దీన్, మలిక్ సాదుద్దీన్ మున్నగు పండితులు, అనేకులగు కవులు పోషింపబడిరి. కవులు, గాయకులు, కళారాధకులు ఇతని దర్బారులో నిండి యుండిరి. అమీర్ ఖుస్రూనకీ సభయందుత్తమ స్థానమొసంగబడెను. అమీర్ అను పదవి లభ్యమైనందున తన్నామముననే వ్యవహరింపబడుచుండెను. జలాలుద్దీన్ ఖిల్జీ యొక్క విజయ యాత్రలన్నింటిని 'తాజుల్ ఫుతూహ్' అను గ్రంథములో వర్ణించెను. జలాలుద్దీన్ ఖిల్జీని యతని తమ్ముని కొడుకగు అల్లాఉద్దీన్ ఖిల్జీ మోసమున జంపించి గద్దియనెక్కెను. నిర్దయత్వమీ అల్లాఉద్దీన్ యొక్క విశిష్ట గుణమైనను ఇతడొక గొప్ప ధైర్యశాలియు శాసన కౌశలము కలిగిన మహారాజు, పరాక్రమశాలియు, విజయ పరంపరలచే నూర్జితుడైన వాడైనను వానితోపాటు విద్యా పోషకత్వము, ఔదార్యమును కలిగి విరాజిల్లెను. అతని దర్బారులో పండితులు, కవులు, గాయకులు, ఉపన్యాసకులు వందకంటె ఎక్కువ సంఖ్యలో పరిపోషింపబడుచుండిరి. వీరందరిలో అమీర్‌ఖుస్రూ ప్రతిభ మిన్నయైనది. సుల్తాన్ అల్లాఉద్దీన్ ఇరువదిరెండు సంవత్సరములు రాజ్యపీఠము నలంకరించెను. ఇతని విజయయాత్రను అమీర్‌ఖుస్రూ 'ఖిజాయనుల్ ఫుతూహ్' అను గ్రంథమున వర్ణించుటయే గాక నిజామీ కవివలె అనేక మస్నవీ కావ్యములను రచించెను. అల్లాఉద్దీన్ కొడుకు 'ఖుతుబుద్దీన్' బుద్ధిహీనుడైనను శృంగార ప్రియుడైనందున అమీర్‌ఖుస్రూ నత్యధికముగా గౌరవించెను. ఒక మస్నవీ కావ్యమును రచించి యంకితమొనర్చినందులకు ఏనుగంతటి ధనమును తూచి పారితోషికమొసంగెను. ఖుతుబుద్దీన్‌ఖిల్జీని మలిక్ గాజీ యను తుర్కీ గులాము వధించి రాజవంశము నిర్మూలమైనందున గియాసుద్దీన్ తుగ్లక్ అను నామము ధరించి పీఠాధిష్టుడయ్యెను. ఈ రాజత్యంత పరాక్రమశాలియు, న్యాయమార్గానువర్తియై విజయ పరంపరలచే ప్రసిద్ధుడయ్యెను. ఢిల్లీ నగరమందలి తుగ్లకాబాద కోట ఇతని పేర కట్టబడినదే. ఇతని కంకితముగా 'తుగ్లక్‌నామా' అను గ్రంథమును అమీర్‌ఖుస్రూ రచించెను. ఇతడు ఢిల్లీలో ప్రఖ్యాతుడైన ఖ్వాజా నిజాముద్దీన్ ఔలియా అను మతగురువు యొక్క శిష్యుడు. తుగ్లక్ వెంట బెంగాల్‌కు వెళ్ళి అక్కడనే యుండిపోయెను. గురు మరణవార్త విని ఢిల్లీకి తిరిగివచ్చి తన సంపదలను ప్రజలకు దానమొసంగి గురు సమాధిపై నారాధించుచు గూర్చుండెను.

అనంతర మారునెలలకు హి|జ్రీ 725 లో దివంగతుడయ్యెను. ఇతని సమాధి నిజాముద్దీన్ ఔలియా సమాధి యొక్క పాద తలముననే నిర్మింపబడినది.

ఈరాన్ దేశమునందును, భారతదేశమునందును గత ఆరు శతాబ్దముల నుండియు అమీర్ ఖుస్రూ వంటి వివిధ విద్యా విశారదులు, భాషాభిజ్ఞులైన కవులు ముగ్గురు నలుగురు కంటె ఎక్కువ జన్మించలేదని అనినచో నతిశయోక్తి గాదు. ఫిర్దూసీ, సాదీ, అన్వరీ, హాఫిజు, ఉరుఫీ, నజీరీ మున్నగు పారసీ కవులు ఒక్కొక్క విధమగు కవితయందే తమ ప్రతిభను ప్రకటించిరి. ఫర్దూసీ మస్నవీ కంటె ముందుకు పోలేదు. సాదీ ఖసీదాలు వ్రాయజాలలేదు. అన్వరీ ఖసీదాలే గాని, మస్నవీ, గజళ్ళను ముట్టలేదు. హాఫిజ్, ఉరుఫీ, నజరీ గజళ్ళుదప్ప మరి దేనినీ స్పృశింపలేదు. కాని ఖుస్రూ తన సారస్వత సార్వభౌమత్వమును గజల్, మస్నవీ, ఖసీదా,రుబాయి మున్నగు సర్వవిధ కవితలపై చెలాయించెను. ఇతంటి వివిధ కావ్యరచనా పటిమ మరెవ్వరిలోనూ కనపడదు. అందరికంటె రచనా బాహుళ్యమున గూడ నితడే మిన్న. ఫర్దూసీ 70,000 పాదములను. సాయబ్ కవి ఒక లక్ష పాదములను రచించిరి. అమీర్ ఖుస్రూ 3,00,000 (మూడు లక్షల) కంటె పైబడిన పాదములను రచించెను. ఇతని భాషాభిజ్ఞత మెండు. ఇంతేకాక యతడనేక భాషలలో పారంగతుడు. తుర్కీ, పారసీ, అరబ్బీ-ఈ మూడు భాషలలో కొమ్ములు దిరిగిన పండితుడు. వ్రజ భాషయగు హిందీలో నితని పాండిత్యము ప్రథమ శ్రేణికి జెందినది. పారసీక రచనలతో పాటు హిందీ కావ్య రచనయు బహుళముగా గావించెను. సంస్కృత భాషా కోవిదుడు. 'నుఃసిపర్' అను మస్నవీలో సంస్కృత భాషయొక్క ప్రాశస్త్యము నుగ్గడించి యున్నాడు. పద్య గద్యాత్మకమైన వాఙ్మయ రచనయేకాక సంగీత కళల యందారితేరిన పాండితి గలిగిన గాయక శిఖామణి. ఆ కాలపు గానకళా సార్వభౌముడును, 1200 మంది శిష్యులుగల గాయనాచార్యుడైన నాయక గోపాలునిచే మెప్పుబడయుటయే గాక రాజసభయందతనికి సాటియని యనిపించు కున్న మేటి. హిందూస్థానీ సంగీతమునందు క్రొత్త రాగములను కొన్ని కనిపెట్టి సంగీత శాస్త్రము నభివృద్ధికి తెచ్చెను. 'రాగదర్పణ'మను పేరుగల పారసీ సంగీతశాస్త్ర గ్రంథమున నీ వివరములు గలవు.

# న వ యు గ ము

## (క్రీ॥శ॥ 1906 నుండి)

క్రీ.శ. 9 వ శతాబ్దము నుండి 19వ శతాబ్దము వరకొక వేయి సంవత్స రముల కాలములో ఫారసీ కవితా వాఙ్మయము ఖసీదా, గజల్, మస్నవీ, రుబా యీల రూపమున శృంగార విలాసములను, దూషణ భూషణములను, ఆధ్యాత్మిక, భౌతిక సౌందర్యాతిశయములను, యుద్ధరంగములను, నృత్యగాన సభలను, భక్తి రసావేశమును, నైతిక బోధకమును. - వేయేల - మనుజ స్వభావముచే వ్యక్తీకరింపబడు సర్వభావ సముచ్చయమును ప్రపంచమునకు అంద చందములతో వెల్లడించి సమర్పించినది. జాతీయత, దేశసేవాభిలాష, సాంఘిక రాజకీయ సంస్కరణము మున్నగు నాధునిక విషయములు మిగిలి యుండెను. ఇరవైయవ శతాబ్దారంభమున గలిగిన రాజకీయ క్రాంతి వలన నీ విషయములు చేర్చుకొనబడి ఫారసీ కవితా వాఙ్మయము పరిపూర్ణతను దాల్చినది.

ఈరాన్‌లో పూర్వము నుండి రాజ్యతంత్రమొక నిరంకుశుడగు ప్రభువు వలననే నెరపబడుచుండెను. కాని పంతొమ్మిదవ శతాబ్దము యొక్క మధ్యభాగ మున కీ.శే. అల్లామా సయ్యద్ జమాలుద్దీన్ అఫ్గానీ (1838-1897) చే ప్రారం భింపబడిన Pan Islamic ముస్లిం స్వాతంత్ర్యోద్యమము యొక్క పరిణామము ఈరాన్‌లో కలిగినది. మొట్టమొదటి విప్లవము వలన 5 ఆగస్టు 1906 నాడు పార్లమెంటరీ (Parliamentary) ప్రభుత్వమేర్పడి 2 అక్టోబరు 1906 నాడు జాతీయ శాసనసభ (National Assembly) స్థాపింపబడెను. కాని ఒక సంవత్సరము తర్వాత తిరిగి మరియొక సంవత్సరము జూన్ 1908 నుండి జూలై 1909 వరకు మహమ్మద్ అలీషాః (పదభ్రష్టుడైన రాజు) యొక్క నిరంకుశ ప్రభుత్వము సాగెను. 16 జూలై 1909 నాడు మహమ్మద్ అలీషాః నాలుగు దినములు యుద్ధము గావించి పలాయనమొందెను. అప్పుడు రెండవ పార్లమెంటరీ ప్రభుత్వము (మష్రూతి యాసానీ) ఏర్పడెను. కాని స్థిరమైన స్వాతంత్ర్యము ప్రజలకింకను లభింపలేదు.

1912 వ సంవత్సరారంభము నుండి రష్యా యొక్క యొత్తిడి ప్రబలమై ఈరాన్ దేశమునందంతట మరియొక విప్లవము బైలుదేరినది. 1914 వ సంవత్సరములో ఐరోపామహా సంగ్రామ మారంభింపబడెను. యుద్ధకాలపు నాల్గు సంవత్సరములీ దేశమున కత్యంతమైన ఆపత్కాలముగా నుండినవి. ప్రతి ప్రబల శక్తియు నీ దేశమును కబళింప జూచుచుండెను. ఆ కాలపు రక్తపాతములు చంఘీజ్‌ఖాన్, హలాకూ ఖాన్ కాలమును సంస్మరింపజేసినవి. యుద్ధానంతరము రష్యా దేశమున గూడ నిరంకుశ ప్రభుత్వ మంతరించెను. కొంత కాలము పిదప నాంగ్లేయులునూ ఈరాన్‌కు తిలోదకములిచ్చి వదలిరి. తుదకపుడు చిరకాలము నుండి బాధించుచున్న యంతఃకలహములు, రక్తపాతములు మున్నగు వాటి నుండి విముక్తులై ఈరాన్ ప్రజలకు శాంతియుతమగు స్వాతంత్ర్య జీవనము ననుభవించు నవకాశము లభించినది. ఆలా హజతురజాషాః పహ్లావీ కాలమందు శాంతి స్థాపనతోపాటు జాతీయ జీవనమును సంస్కరించుకొను యవకాశము కూడా దొరకినది.

ఇరవైయవ శతాబ్దారంభమున ఈరాన్ యొక్క విప్లవమునకు దారితీసిన వాఙ్మయమును మూడు విధములుగా విభజింపవచ్చును. 1. గద్యగ్రంథములు 2. పత్రికలు. 3. కావ్యములు.

**1. గద్య వాఙ్మయము :-** మొదటి తెగకు సంబంధించిన వాఙ్మయములో దేశసేవ, సంఘసంస్కారము, స్వాతంత్ర్యాపేక్ష మున్నగు జాతీయ భావములను కలిగించు గద్య గ్రంథములన్నిటిని చేర్చవచ్చును. ఈ గ్రంథజాలములో నగ్రస్థానము నాజముద్దౌలాషః జాహ మల్కుం ఖానుని రచనల కివ్వబడుచున్నది. ముప్పదికి మించి గ్రంథముల నితడు రచించెను. 'మతతత్త్వములు', 'దేశభక్తియే దైవభక్తి', 'దేశోన్నతికి ప్రాతిపదిక', 'షేఖు వజీరు' మున్నగు అన్ని శీర్షికల వలన నీతని రచనల రంగు బయల్పడును. ఈ వాఙ్మయమునందు రెండవ స్థానము తెహరాన్ అకాడెమీ (దారుల్ ఫునూనె తెహరాన్) వారి ప్రచురణములు. ఇవి ముఖ్యముగా ఈరానీయులచే గాని లేక పాశ్చాత్య పండితులచే గాని గావింపబడిన యనువాదములు. భౌతిక, గణిత, చరిత్ర, భూగోళ, వైద్య శాస్త్రములు, సాహిత్యమీమాంస ముఖ్యములగు విషయ

ములు. వీనివలన ప్రజలందాధునిక శాస్త్ర విషయ పరిజ్ఞానము కలిగి వారి యుత్తేజమునకు దారిబొడమినది. మిర్జా యూసూఫుఖాన్ ముస్తషారుద్దౌలా, మీర్జా అబ్దురహ్రీం తాల్బాపు - హాజీ జైనుల్లాబుద్దీన్, ఆకామురాగీ - మిర్జా హబీబు అస్ఫహాన్, షేఖు అహ్మదురూహీ కిర్మానీ - ముఖ్యులగు ఈరానీ గ్రంథకర్తలు.

## 2. పత్రికలు :-

పార్లమెంటరీ ప్రభుత్వ స్థాపనకు పూర్వ మీరాన్‌లో రాజకీయముగా ప్రాముఖ్యత నివ్వదగిన ఏ వార్తాపత్రికలూ ప్రకటింపబడుచుండలేదు. 1906 వ సంవత్సరమున ప్రజాస్వామ్య ప్రభుత్వ స్థాపనతో ననేక పత్రికలు బయలు దేరెను. అందులో తెహరాన్ నుండి వెలువడు పత్రికంలో 'మజ్లిసు', 'నిదాయె వతన్' (దేశపు పిలుపు) సూరె అస్రాఫీల్ - హబ్లుల్ మతీన్ - 'సుబహె సాదిక్' (సూర్యోదయము)- 'ఈరాన్ నౌ' (నవ్య ఈరాన్) పత్రికలు పేర్కొన తగినవి. 'తులూ', ఆజుర్ బాయిజాన్ మున్నగు పత్రికలు 'పంచు' (Punch) మాదిరి హాస్యరసము నుపయోగించి జాతీయోద్యమ ప్రచారము గావించినవి. 'కష్కోల్', 'బహలూల్', 'షేఖుచుగంద్' మున్నగు పత్రికలనేకములీ తెగకు చేరినవి బయలుదేరి సంఘ దురాచారములను ఇతర లోపములను వెక్కిరించుచు సంస్కారమునకు దారి జూపినవి.[7] ఈరాన్‌లో పత్రికలకు స్వాతంత్ర్యము లభించుటకు పూర్వమితర దేశములనుండి కొందరు ఫారసీ పత్రికలను ప్రచురించి నిర్వహించిరి. వీనిలో ముఖ్యస్థానము ప్రిన్స్ మాల్కం ఖాన్ (Prince Malcolm Khan)చే లండన్ నగరమునుండి ప్రకటింపబడుచున్న 'ఖానూన్' అను పత్రికా రాజమున కివ్వబడుచున్నది. రెండవది 'అఖ్తర్' అనుపేర 'కాన్‌స్టాంటినోపులు, (Constantinople) పట్టణము నుండి వెలువడుచుండెను. మూడవది కలకత్తా నగరమునుండి 'హబ్లుక్ మతన్' అను ఫారసీ పత్రిక యనేక సంవత్సరములు ప్రకటింపబడినది. 'సురయ్యా'. 'పర్‌వరిష' అనుపేర కైరో (Cairo) నుండి రెండు పత్రికలు నిర్వహింపబడుచుండెను. ఇట్లనేక పత్రికలు విదేశముల నుండి వెలువడి ప్రజా ప్రబోధము గావించి ఈ దేశ ప్రజలను చిరకాల సుషుప్తావస్థ నుండి మేల్కొలుపుటయే గాక ఫారసీ వాఙ్మయ సాహిత్యమునకును చక్కని తోడ్పాటు గావించినవి. క్రొత్త క్రొత్త పారిభాషిక పదజాలమును నిర్మించుకొని నవీన ఫారసీ భాషయొక్క శబ్ద సంపత్తి నభివృద్ధి

గావించుకొనుటకీ పత్రికలెంతో సహాయపడినవి. పైన పేర్కొనబడిన పత్రికల పిదప ననేక వార్తాపత్రికలు ఈరాన్ నుండి బయలుదేరినవి. దేశమంతటా జాతీయ భావములు చిచ్చుబెట్టుచుండెను. ప్రతి నగరము నుండి పత్రికలు బయలుదేరెను. ఒక తెహరాన్ నుండి వెలువడు పత్రికలలో

'యిస్తెక్లాల్' (పట్టుదల), 'ఈరాన్', 'బర్ఖ్' (పిడుగు) 'బేదారీ' (మేలుకొలుపు) 'దానిష్' (బుద్ధి), 'ఆఫ్తాబీ' (సూర్యుడు) 'జిష్తుజెబా' (మంచిచెడ్డలు), 'షర్క్' (ప్రాచ్యము) 'షరాఫత్' (సౌజన్యము), 'మసావాత్' (సమానత) అనునవి ముఖ్యములు. తబ్రేజు నుండి 'ఇత్తెహాద్' (ఐక్యత), 'అఖువ్వత్' (సోదరత్వము) 'ఉమ్మీద్' (ఆశ) మున్నగునవి వెలువడుచుండెను. ఇట్లే అస్ఫహాన్-షీరాజు మున్నగు నగరముల నుండియు 'ఫర్హంగ్', 'అసరెజదీద్' (నవయుగము) 'నసీమెషుమాల్' (ఉత్తరవాయువు) మున్నగు పత్రికలు వెలువడి దేశసేవ భాషాసేవ, సాహిత్యసేవ నపారముగా గావించినవి. అట్టి పత్రికల సంఖ్యను చూపెట్టుటకై కొన్ని పుటలు గావలసియుండును గనుక నిచ్చట ముఖ్యమగునవి మాత్ర ముదాహరణముగా పేర్కొనబడినవి. ఆంధ్ర దేశమందలి ఆ కాలపు వార్తాపత్రికల స్వల్ప సంఖ్యను పోల్చిచూచిన తారతమ్యము గోచరించి మనకు సిగ్గు గలుగజేయుచున్నది.

## 3. కావ్యములు :-

దేశమును నిద్రావస్థ నుండి మేల్కొలిపి జాతీయ భావముల చేతనూ స్వాతంత్ర్యాపేక్షచేత నుద్రిక్తమొనర్చి యావేశమును కలిగించుటను శక్తిసామర్థ్యములు గల కవుల కావ్యములత్యంత సహకార మొనర్చెననుటకు అరబ్బు, గ్రీకు, రోము మున్నగు దేశముల పూర్వకవితా వాఙ్మయములే యుదాహరణములు. ఇరవైయవ శతాబ్దమున ఈరానీ కవులును తమ దేశమును, జాతిని ప్రబోధించుటకు తమ వాక్శక్తిని, కళా కుశలతను ధారవోసి, మొదటి పదునైదు సంవత్సరములలో కలిగిన విప్లవ భావములకు సహకారులగుటయేగాక ప్రజా ప్రభుత్వ నిర్మాణముతో జనించిన యాత్మపరీక్ష, సంస్కారాపేక్ష, స్వాతంత్ర్యావేశము-ఆశ-నైరాశ్యము-కార్యదీక్ష-ఉత్సాహము-ఆందోళన, సుఖ దుఃఖములు, సంతోష విషాదములు మున్నగు వివిధ భావములను చిత్రించి జాతీయ పునర్ని

ర్మాణమున నిమగ్నమగు ఈరాన్ ప్రజలయొక్క యుద్రిక్తావస్థను ప్రతిబింబింపజేసి కృతకృత్యులైరి. వీరి కవితలు ఖండ కావ్యముల రూపమున, 'నసీ మెషుమార్', 'గీలాన్', 'కంగాష్', 'సదాయెరుష్త' 'బహార్', 'నూరె అస్రాఫీల్', 'ఈరానెనౌ' మున్నగు వార్తాపత్రికలందు ప్రకటింపబడి జాతీయతా నిర్మాణమున కుపకరించెను. కళాదృష్టిచే నీ కావ్యములొక ప్రత్యేకమగు తెగకు జెందక 'మస్నవీ', 'కితా', 'గజల్', 'ముసమ్మత్' మున్నగు ఛందో విభాగములందు రచింపబడియెను. వీనివలననే ఈరాన్ యొక్క నవ్యసాహిత్యపు పునాదులు గట్టిపడి శక్తివంతమగు సాహిత్యాభ్యుదయము నేడు జరుగుచున్నది. ఈ విప్లవ సాహిత్యకారులలో ప్రముఖులైనవారి నామములను పేర్కొని సంక్షిప్తముగా కొన్ని వాక్యములలో వాని పరిచయము గావింతును.

1. మలికుష్షె అరా (కవిసార్వభౌముడు) బహార్
2. సయ్యద్ అష్రఫ్ రష్తీ
3. ఆరిఫ్ - ఖుజువీనీ
4. ఫసీ హుల్ ముత్క (వాగ్విశారద) - షోరీదా
5. బదీ ఉజ్జమాన్ - షీరాజీ
6. జాఫర్ - ఖుమ్నాయీ
7. మీర్జా ముర్తుజా - ఫర్‌హంగ్
8. అదీబ్ - నైషాపూరీ
9. హుసేన్ ఖాన్ - దానిష్
10. అహ్మద్ సుహేలీ - తబ్రేజీ
11. హీసాయుస్లలాం - దానిష్
12. షోర్ దావూద్
13. మలిక్ సాసానీ
14. ఇతరులను గ్రంథ విస్తర భీతితో పేర్కొనుట లేదు.

## నవయుగ కావ్యగుణము

ఈరాన్ యొక్క నవయుగ కవులను రెండు తెగలుగా విభజింపవచ్చును. ఒక తెగ 'మనూఛెహ్రీ' - 'ఫర్దూసీ', 'సాదీ', 'హాఫీజు' మున్నగు పూర్వకవుల ననుకరించు వారిది. వీరు పూర్వ కవుల ఛందో వ్యాకరణ నియమములనే

పాటింతురు. కావ్య విషయ దృష్టిచే వీరి కావ్యములందు శృంగారమునే గాక యీ హద్దు నతిక్రమించి ఆధ్యాత్మిక - నైతిక - జాతీయ - రాజకీయ విషయము లను స్వీకరింతురు. ఈ తెగకు చెందినవారు 'ఆదీబే పెషావరీ' 'అదీబ్ నైషా పూరీ', 'సాలార్ షీరాజీ' 'షోరీదా షీరాజీ', 'షహాబ్ కిర్మాన్ షాహీ', 'రాదీ', 'గమాం హందానీ' , ఫిరోగీ అస్ఫహానీ', 'బదీ ఉజ్జమాన్' 'నాచరీ', 'యష్‌హదీ' మున్నగు కవులు. రెండవ తెగకుచెందినవారు ఒకప్పుడు పూర్వ కావ్య నియమము లను పాటింతురు. మరియొకప్పుడు పాశ్చాత్య సాహిత్య పరిచయమువలన కలిగిన నవీన భావముల వలన క్రొత్త ఛందో రీతులందునూ క్రొత్త క్రొత్త విధానముల నవలంబించి నూతన సంస్కారముల గావించెదరు. వీరి కావ్య విషయములు ముఖ్యముగా జాతీయత - రాజకీయములు - దేశోద్ధరణము-సంఘ సంస్కారము. నేటి కాలమున నీ తెగకు చెందిన కవులకే ప్రాముఖ్యతయు జనరంజకత్వమును మిక్కిలి గలదు. ఈ తెగకు చేరినవారు, షఃజాదా ఈరజు మిర్జా మలికుషోరా బహార్-ఆరిఫు ఖజువీనీ - షోర్ దావూద్-హబీబ్ యగ్మాయీ- ఫర్రుఖీ యజ్దీ - కమాలీ అస్ఫహానీ - దెహ్‌ఖుదా - అష్రఫ్ రష్తీ - ఫర్‌హంగ్ తెహరానీ - రజాజాదా షఫఖ్-మహమూద్ ఖాన్ అఫ్షా సావత్ నూరీ-మున్నగు కవులు.

పూర్వ ఫారసీ కవుల యొక్క కావ్య విషయముల నేడు విధములుగా విభజింపవచ్చును. శృంగారము-స్తోత్రనిందలు-భక్తి-ఆధ్యాత్మిక విజ్ఞానము- నీతి-యుద్ధము-విషాదము. నేటి కావ్యజాలమును పరిశీలించినచో నిందు శృంగార మును, ఆధ్యాత్మికమును బాగుగా కన్పించుచున్నవి. ప్రభువుల స్తోత్రములు చాలా తక్కువగా గన్పించును. ఉన్నవాని యందును పూర్వ కావ్యములందువలె నిరర్థకమగు యతిశయోక్తులు గాన్పింపవు. సూఫీ కావ్యములతి స్వల్పములు. నీతిపర కావ్యములందు జాతీయత-దేశభక్తి-ఆత్మగౌరవము - స్వాతంత్ర్యము- క్షమ-దాక్షిణ్యము-పట్టుదల-స్థిర సంకల్పము-త్యాగము-సానుభూతి-దౌష్ట్య నిర సనము మున్నగు గుణములు పూర్వముకంటె నెక్కువ వర్ణితములైనవి. యుద్ధ కావ్యములు బొత్తిగా వ్రాయబడలేదు. విషాద కావ్యములు గలవు. పెక్కిరింత, నిందా కావ్యము లనేకములు వెలువడినవి.

నేటి కాలపు పారసీ కవిత సులభ శైలితో గూడి అలంకార బాహుళ్యము లేక మృదుమధుర పదబంధురమై రాగసహితయై భావోద్రేకమును గలిగించునదై అలరారుచుండును. అలంకార రాహిత్యము, సులభ శైలితోపాటు పూర్వాంత్య ప్రాసల యొక్క వికాసము. ఛందో విభ్రమముల నుండి వెలువడు రాగము-విషయములందలి యర్థ గాంభీర్యముతో పాటు పదమార్దవము చదువరుల భావముల నుద్రిక్తమొనర్చు శక్తి సామర్థ్యము ప్రశంసనీయముగా గనపడుచున్నవి. భావములు ప్రకృతి సిద్ధములై కృత్రిమత్వము లేక మనోరంజకముగా నుండును. సూక్ష్మ దృష్టికి లేక తార్కిక శక్తికి గోచరించు భావములుగాక సామాన్యముగా నందర కర్థమగు భావములు చిత్రింపబడినవి. బుద్ధికంటె హృదయమునే కవు లెక్కువ ప్రదర్శించిరి. కృత్రిమత్వముపై సహజత్వమునకు, కృషిపై యావేశమునకు, ఆచ్ఛాదనముపై యనుభూతి ప్రకటనకును ప్రాధాన్యత నొసంగిరి.

ఈ నవ కవులందు పదునారుగురు కవుల నామములను వారి కావ్య విషయ గుణములను పేర్కొనిన నీ సమీక్షపూర్తియగును. ఈ పదునారుగురు కవులీ కాలపు పారసీ కవితా ప్రపంచముయొక్క ప్రతినిధులని తలంచవచ్చును. వీరి సాహిత్యము, కళా కుశలత దేశ ప్రజలచే వేనోళ్ళ కీర్తింపబడుచు సుప్రసిద్ధమైనది. వీరి కవితా రసమును గ్రోలుటకు పారసీ భాషను నేర్చుకొని కవితా మాధుర్యము ననుభవించు శక్తిని సంపాదించిన వారికే వీలుపడును. చప్పని యనువాదముల వలన ఇతర భాషా కవుల శక్తి సామర్థ్యము లెరుంగలేము. అనువాదకుడెంత సమర్థుడైనను కవి యొక్క పరిపూర్ణ భావమును గాని, భాష యొక్క నుపకారము వలన గలుగు సొంపులను గాని భాషాంతరీకరింపలేడు గదా!

## 1. బహార్ ఖురాసానీ

ఇతని పేరు మిర్జా మహమ్మద్ తఖీ. ఇతని కవితా నామము 'బహార్' (వసంతుడు). మీర్ మహమ్మద్ కాజం మలికుషోఅరా సుబూరీ యొక్క పుత్రుడు. క్రీ.శ. 1887లో మషహద్ పట్టణమున జన్మించెను. అప్పుడే తన తండ్రి కడను, మరి యితర పండితుల వద్దను అరబ్బి, పారసీ భాషల నభ్యసించెను.

క్రీ.శ. 1904లో తండ్రి చనిపోయిన పిదప అదీబు నైషాపూరీ మరియు మిర్జా అబ్దుర్రహమాన్ బదరీకి శిష్యుడై విద్యాభ్యాసమొనర్చెను. తరువాత ఖురాసాన్ గవర్నరుగా నుండిన గులాం రాజాఖాన్ ఆసపుద్దౌలా దర్బారునందు చేరి అతని సిఫారసు వలననే ముజఫరుద్దీన్ భాటారు ప్రభువుచే 'మలికుష్షోరా' (కవిసార్వభౌమ) బిరుదమును వర్షాశనమును బొందెను. క్రీ.శ. 1906 వ సంవత్సరమున ప్రజా ప్రభుత్వోద్యమ మారంభింపబడినవుడే నితడందు పాల్గొన మొదలిడెను. 1909 వరకూ ప్రవాసియు, కార్యరంగమున పనిచేసియు ఉద్యమమందు పాల్గొనెను. కలకత్తా, ఖురాసాన్ పట్టణములనుండి వెలువడు పత్రికలందు తన పేరుతోను కృత్రిమ నామములతోను వ్యాసములు, కావ్యములు ప్రకటించుచుండెను. కావ్య ప్రకటనవలన నీతడు విదేశమందంతట విఖ్యాతుడయ్యెను. 1911లో మషీహద్ నగరమునుండి 'నౌబహార్' (నవ వసంతము) అను పత్రికను దీసి జాతీయోద్యమమందు పాల్గొనిన కారణమున రెండుసార్లు పత్రిక నాపివేయవలసివచ్చెను. రెండుసార్లా దేశము నుండి వెడలగొట్టబడెను. అనేక శారీరక, మానసిక, ఆర్థిక కష్టముల పాలబడియు తన యుద్యమ ప్రయత్నముల కంతరాయము కలుగనివ్వలేదు. 1916 సంవత్సరములో జాతీయవాదులు తెహరాన్ నుండి బాగ్దాద్, కాన్‌స్టాంటి నోపలు, కిర్మాను పట్టణములవైపు వలస వెళ్ళినపుడితడును వారితో కలసి వెళ్ళెను. తిరిగి వచ్చిన పిదప తెహరాన్ నుండి 'నౌబహార్' పత్రికను నడపుచుండెను. కొంతకాలమితడు జాతీయ శాసనసభా సభ్యుడుగ కూడా నుండెను. 'నౌబహారు' కాక 'దానిష్కదా', 'ఈరాన్' పత్రికలకు గూడ సంపాదకుడుగా నుండెను. ఇతని రచనలలో నైరంగెసిపాః, 'తారీఖెసీఖెస్తాన్' ప్రత్యేకముగా పేర్కొనదగినవై యున్నవి.

## 2. ఈరజు మీర్జా

జలాలతుల్ ముల్క్ (His Majesty) షాఃజాదా ఈరజు మీర్జా, ఈరాన్ ప్రభువగు పతెహ అలీషాఃఖాచారు యొక్క మునిమనమడు. తబ్రీజులో క్రీ. శ. 1874 లో జన్మించెను. రాకుమారుల వలె ప్రత్యేకముగా విద్యాభ్యాస మొనరించెను. విద్యా వైదుష్యముల వలనను, సహజమగు కౌశలము, ప్రతిభయు కలిగి యున్నందుననూ యువరాజగు ముజీఫ్ఫరుద్దీన్ ఖాచారు యొక్క అనుగ్రహమును సంపాదించెను. యువరాజీతని బుద్ధి కుశలతను మెచ్చి, తాను రాజ్య

పదవి నధిష్టించిన తర్వాత నితనిని బాధ్యత గల యనేక పదవుల నొసంగి గౌర వించెను. ప్రజా ప్రభుత్వ మేర్పడిన పిదప నితడు భూహ్యూదాయ శాఖ (హోమ్ డిపార్టు) విద్యాశాఖలలో గొప్ప యుద్యోగములందుండి తన కార్యదీక్ష, బుద్ధి కుశ లత, నిరంతర కృషి వలన మెప్పువడసెను. ఐనను ఈ యుద్యోగ భారమెన్న డీతని సాహితీ సేవ కంతరాయము కలిగింపలేదు. ఇతడు క్రీ. శ. 1925 లో హృదయ స్పందనమాగి అకస్మాత్తుగా మరణించెను,

## 3. ఫరోనీ అస్ఫహానీ

ఇతని పేరు మీర్జా అబుల్ హసన్‌ఖాన్. కవితా నామము ఫరోగీ - తండ్రి మీర్జా మహమ్మద్ హుసేన్ ఖాన్. జకాఉల్ ముల్కు ఫరోగీ గత శతాబ్దము యొక్క పేరు వడసిన సాహిత్యకారుడు. ఇతని అన్నయగు మీర్జా మహమ్మద్ అలీఖాన్ జకాఉల్ ముల్కు నేటికాలపు ప్రముఖ రాజకీయవేత్త. విదేశ రాజ్యాంగ మంత్రిగా పనిచేసిన వాడు.

ఫరోగీ క్రీ. శ. 1883 లో తెహరాన్ నందు జన్మించెను. పాఠశాలలోను మరియు పండితుల యొద్దను విద్యాభ్యాస మొనర్చెను. ఫారసీ, అరబ్బీ, ఫ్రెంచి భాషలను పరిపూర్ణముగా నభ్యసించెను. సాహిత్యము - చరిత్రము - భూగోళము, వేదాంత విజ్ఞానము మున్నగు వాని యందు సంపూర్ణ పాండిత్యము గలదు. తెహరాన్ యొక్క 'బోధనాభ్యసన' పాఠశాలకు ప్రధానాచార్యుడై యుండి బోధ నాభ్యసన కళను గురించి గ్రంథములు వ్రాసెను. క్రీ. శ. 1897 లో ఈరాన్ ప్రతినిధిగా Tolstoy Festival కై రష్యాదేశము వెళ్ళెను. 1899 లో ప్రాచ్య వైజ్ఞానిక మహాసభకు ప్రతినిధిగా వెళ్ళి ఐరోపా ఖండము యొక్క పండిత ప్రకాండులతో కలిసి వారి మెప్పు వడసెను. ఇతని రచనలలో 'వైదోష్ వనాహీద్', 'సర్మాయె సాదత్', 'అవరాఖె ముషవ్విష్' ప్రచురింపబడినవి. ఇతని ఖండ కావ్యములు, వ్యాసము లనేకములు పాఠ్యగ్రంథములలో చేర్చబడినవి.

## 4. కమాలీ అస్ఫహానీ

ఇతని పేరు హైదరలీ, కవితా నామము కమాలీ. క్రీ.శ. 1871లో అస్ఫహాన్‌లోని యొక కస్బా (పెద్ద గ్రామం) లో జన్మించెను. తండ్రి చిన్న తనముననే కమ్మరి పనిలో ప్రవేశపెట్టెను. 15 వ యేట తెహరాన్ వచ్చి తిరిగి అస్ఫహాన్ చేరెను. కొన్ని సంవత్సరముల పిదప సకుటుంబముగా తెహరాన్‌లో నివాసమేర్పరచుకొనియెను. విద్యాభ్యాసము యొక్క సంకల్పము బొడమి స్వయంకృషితో భాషా పాండిత్యము నలవరచుకొని తన విజ్ఞాన పిపాసను దీర్చుకొనియెను. దైవమిచ్చిన కవితాశక్తిని గలిగినవాడు గావున కావ్య రచన నారంభించి సాహిత్యకారులలో నగ్రగణ్యులైన ఈరజు మీర్జా. అదీబుల్‌ము మాలిక్ మున్నగు వారి ప్రశంసకును పాత్రుడై, యశంబు గాంచెను. మశ్రూతియా కాలమునందు 'అహ్రార్' పార్టీలో చేరియుండెను. ఇతని రచనలలో దీవాన్ (కావ్యసంపుటి) గాక 'మజాలియెతుర్కానె ఖాతూన్', 'యుంతఖబాలె అషారె సాయబు' అను గ్రంథములు ప్రకటితములు.

## 5. బదీ ఉజ్జమాన్ ఖురాసానీ

ఇతని తండ్రిపేరు షేఖుఅలీ క్రీ.శ. 1900 లో జన్మించెను. తెహరాన్, మష్హద్ నగరములలో అదీబిన్ నైషాపూరీ, షేఖుహుసేన్ నజూమా బాదీ, అఖా సయ్యద్ కాజిం, మున్నగు పండితులవద్ద ఫారసీ, అరబ్బీ భాషల నభ్యసించెను. సాహిత్యము- మీమాంస-వైద్యము-వేదాంతము నందు పరిపూర్ణ పాండిత్యము గలదు. క్రీ.శ. 1923 లో తెహరాన్ నగరమునకు వచ్చి విద్యాశాఖ యందుద్యోగిగా చేరెను. తెహరాన్ విశ్వవిద్యాలయమునందు సాహిత్యాచార్యుడుగా నియమింపబడెను. ఇతడత్యంత మేధావి. ధారణా శక్తి మెండు-మహోపన్యాసకుడు. ఉద్గ్రంథములను రచించెను. సుఖ్‌వసుఖ్‌వరాన్, 'తారీఖె అదబియ్యాతె ఈరాన్' అను వాఙ్మయ చరిత్ర గ్రంథమును రచించెను. ఇతర శాస్త్ర గ్రథములనేకములు రచించెను. కొన్ని ప్రకటింపబడలేదు.

## 6. దేఃఖుదా

ఇతని పేరు మీర్జా అలీ అక్బరు ఖాన్. కవితా నామము 'దేఃఖుదా'. ఈ పేరుతో నీతని కావ్య ఖండికలు పత్రికలలో ప్రకటింపబడుచుండెను. ఈతని తండ్రి మధ్యతరగతికి చెందిన కుటుంబీకుడు. తెహరాన్‌లో నితడు క్రీ.శ. 1880 లో జన్మించెను. చిన్నతనమున తండ్రి గతించినందున తల్లియే కష్టపడి విద్యాబుద్ధుల నేర్పించి ప్రబుద్ధుని గావించినది. 'షేఖు గులాం హుసేన్', 'షేఖు హాదీ నజుముద్దీన్' అను నిరువురు పండితోత్తముల కడ జదువుల నేర్చుకొనుట కవకాశము లభించెను. తెహరాన్‌లో రాజకీయ పాఠశాల (మదరసె సియాసీ) స్థాపింపబడినపు డందులో జేరెను. విద్యార్థిదశలోనే 'ము ఆవినుద్దౌలా' అను ప్రముఖుడు ఈరాన్ యొక్క ప్రతినిధిగా పంపబడినప్పుడు ఐరోపా ఖండమున కతని వెంబడి వెళ్ళి రెండు సంవత్సరములచట నుండుటకు దేఃఖుదాకు వీలు కలిగెను. ఈ కాలముననే ఈరాన్‌లో స్వాతంత్ర్యోద్యమ మారంభింపబడెను. ఇతడందులో చేరి 'సూరె అస్రాఫీల్' అను పత్రికా రాజమునకు సంపాదకుడుగా నుండెను. మహమ్మదలీ షాః ఖాచారు జాతీయ సభను తొలగించి జాతీయ వాదుల నణచివేసినప్పు డితర దేశభక్తులతో పాటితనిని గూడ దేశమునుండి వెడలగొట్టెను. మొదట ప్యారిస్ (Paris) వెళ్ళి కాన్‌స్టాంటి నోపిలు నగరము జేరి యటనుండి 'సుర్ఖూష్' అను పత్రికను ప్రకటింప దొడంగెను. రెండవసారి ప్రజా ప్రభుత్వ మేర్పడిన పిదప జాతీయవాదు లితనిని స్వదేశమునకు తిరిగి రావించిరి. 'మజ్లిసె మిల్లీ' జాతీయ సభయొక్క సభ్యుడుగా పనిచేసి ఐరోపా సంగ్రామ మారంభమైనపుడు ఉద్యమములనుండి విరమించుకొని కొన్నాళ్ళ తర్వాత రాజకీయ పాఠశాల (మదరసె సియాసీ) యొక్క ప్రధానాచార్యత్వ పదవిని స్వీకరించెను. "రోమక సామ్రాజ్యోన్నతి - పతనము", 'రూహుల్ ఖవానీన్' అను అనువాద ములు, ఫారసీ- ఫ్రెంచి భాషా నిఘంటువులను, మరికొన్ని
రచించెను.

## 7. పర్వీన్ ఏ తెసామ్

ఈ కవయిత్రి పేరు పర్వీన్ ఖానమ్. ఈమె ఏ తెసాముల్ ముల్కు మిర్జా. యూసుఫు ఖాన్ కొమరిత. క్రీ॥శ॥ 1910 లో తెహరాన్ పట్టణమున జన్మించెను. తండ్రి గారు ప్రత్యేక శ్రద్ధవహించి బాలికా పాఠశాలకు పంపుటయే గాక స్వయముగా పాఠములొసంగు చుండిరి. కొలది కాలముననే ప్రతిభాశాలియగునీ బాలిక అరబ్బీ, ఫారసీ, ఆంగ్లేయ భాషా సారస్వతములందు పాండిత్యమును సంపాదించుకొనెను. దైవదత్తమగు కవితాశక్తి గలిగి జాతీయ గీతములను వ్రాయుచుండెను. ఈ కవయిత్రి రచనలను పత్రికలు ప్రకటించుట గౌరవముగా భావించియుండిరి. జాతీయ భావములతో నిండి సంస్కారమునకు దారిదీయు కావ్యముల నీమె వ్రాయుచుండెను.

## 8. పోర్ దావూద్

పేరు మీర్జా యిబ్రాహీం ఖాన్. రష్త నగరము యొక్క ముఖ్య వర్తక కుటుంబమునకు చెందిన వాడు. క్రీ. శ. 1886 లో జననమంది తెహరాన్ వెళ్ళి యునానీ వైద్యశాస్త్రము నభ్యసించెను. 1909 లో బగ్దాద్, బేరూత్ (Beirut) నగరములకు వెళ్ళి అక్కడినుండి ప్యారిస్ (Paris) నగరముజేరి విశ్వ విద్యాలయములో న్యాయశాస్త్రము నభ్యసించెను. ఐరోపా మహాసంగ్రామము 1914 లోనారంభము కాగానే ఫ్రాన్సు నుండి వెడలి బర్లిన్, బాగ్దాదు మార్గంగా కిర్మాన్‌షాః పట్టణము జేరుకొనెను. 'రస్తు ఖీజు' అను పత్రికను ప్రకటింప దొడంగెను. 1916 లో తిరిగి బర్లిన్ వెళ్ళి కొన్ని సంవత్సరముల తర్వాత 1923 లో నింటికి రష్త నగరమునకు మరలి వచ్చెను.

'పోర్ దావూద్' కఠినమైన గట్టి దేశభక్తి గలవాడు. ఇతనికి అరబ్బుల యెడ ద్వేషము. అరబ్బీ భాషను సంస్కృతిని ఈరాన్ నుండి తరిమివేసి శుద్ధమైన ఈరానీ ఫారసీక భాషా సంస్కృతులను పునరుద్ధరింపవలెనను పట్టుదల గలవాడు. ఫ్రాన్సులో నొక ఈరానీ సంఘమును స్థాపించెను. బర్లిన్‌లో చిర

కాల ముండునపుడును దేశసేవ గావించుచు ప్రచారము జేయుచునే యుండెను. ఈతని కావ్యములలో దేశమునందలి విప్లవ స్థితులను గురించిన జాతీయ గీతము లనేకములు సుస్థిరముగా నిలచిపోయినవి. రష్యలో కొంత కాలము నివసించి బొంబాయికిని తిరిగి బర్లిన్ కును వెళ్ళెను. ఈ కాలమునందితడు జరతుష్ట్రి మత గ్రంథములను, 'అవెస్తా' గ్రంథముల భాషాంతరీకరణ, వ్యాఖ్యానరచన యందు నిమగ్నుడై యుండెను. రవీంద్రుని శాంతినికేతన, విశ్వభారతి యందా చార్యుడుగా పని* చేయుచున్నాడు. ఇతని కావ్య సంపుటి, మరియొక గ్రంథము బొంబాయిలో ప్రకటింపబడినది.

## 9. మహామూద్ ఖాన్ యిఫ్షార్

క్రీ. శ. 1895 లో యజ్డు నగరమునందు జన్మించెను. 13 వ యేట బొంబాయికి వచ్చి మూడు సంవత్సరములుండిన పిదప తిరిగి తెహరాన్ లోని 'మద్రసె సియా సియాత్' లో జేరెను. 30 వ యేట ఐరోపా పర్యటనము గావించెను. 8 సంవత్సరముల తర్వాత కాలములో జర్మనీ, స్విడ్జరుల్యాండు-ఫ్రాన్సు-యింగ్లాండు దేశములన్నిటిని చుట్టివచ్చెను. లూజాన్ (Laussane) విశ్వవిద్యాలయము నుండి రాజకీయ శాస్త్రము (Politics) నందు డాక్టరేట్ పట్టముపొంది 1921 లో తెహరాన్‌కు తిరిగివచ్చెను. తాను విద్యార్థిగా నుండిన 'మద్రసె సియాసియాత్' లో రాజకీయార్థ శాస్త్రముల బోధన గావించెను. వాణిజ్య పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడుగను, న్యాయాధీశుడగను కొంత కాలము పనిచేసెను. ఐరోపాఖండ పర్యటన కాలమునుండి రాజకీయములతో పాటు సారస్వతము నందితనికి మిక్కిలి యభినివేశము కలిగియుండి 'హబ్లుల్ మతీన్' - 'ఈరాన్-షఫఖు' మున్నగు ముఖ్య పత్రికలందు వ్యాసములను, కావ్యములను ప్రకటించుచుండెను. ఆ కాలముననే నితడు ఫ్రెంచ్ భాషలో

* ఈ పుస్తక రచన సమయమందుగాన, వర్తమాన కాలముపయోగింప బడినది.

"యూరోపీయ ప్రభుత్వములు ఈరాన్‌లో కలిగించు రాజకీయాందోళనము" అను శీర్షికతో నొక గ్రంథమును రచించి బర్లిన్‌లో అచ్చు వేయించి ప్రకటించెను. టెహరాన్ నుండి 'ఆయిందా' (భవిష్యత్తు) అను పేర నొక పత్రిక ననేక సంవత్సరముల వరకు ప్రకటించుచుండెను. ఇతడు కవితాప్రియుడేగాక ఈరాన్‌యొక్క నవీనయుగ కవులలో నుత్తమశ్రేణికి జెందిన కవిగా పరిగణింపబడుచున్నాడు.

## 10. రజాజాదా షఫుఖ

ఆఖాయి రజాజాదా షఫుఖ తబ్రీజులో జన్మించెను. అక్కడనే అరబ్బీ, ఫారసీ, యింగ్లీషు భాషలందు త్తమమగు పాండిత్యము గడించుకొని పిమ్మట యూరోపు వెళ్ళి జర్మనీ, ఫ్రాన్సు మున్నగు దేశముల పర్యటనము గావించుచుయే గాక ఉన్నత విద్యల నభ్యసించి పి.హెచ్.డి. పట్టమును బొందెను. సహజమగు భావనాశక్తి, మార్దవమగు హృదయము గలిగిన కవి. సాహిత్య విమర్శకుడు. ప్రస్తుత మీరాన్‌లోగల సాహిత్యకారులందునూ, కవులందునూ ఉచ్చశ్రేణికి జెందిన వాడగుట నితడు తెహరాన్ యూనివర్సిటీలో ఆచార్యుడుగా *పనిచేయుచున్నాడు. దేశముయొక్క విఖ్యాత పండితులలో జేరినవాడు.

## 11. అష్రఫ్ రష్తి

పేరు సయ్యదు అష్రఫుద్దీన్ అల్ హుసేనీ. 'నసీ మెషుమాల్' (ఉత్తర వాయువు) అను నామముతో విఖ్యాతుడయ్యెను. క్రీ.శ. 1871 లో జననమందె అరబ్బీ, పారసీ భాషలు నభ్యసించి 1882 వ సంవత్సరములో మషీహద్ నగరమునకు విద్యను సంపూర్తి గావించుటకై వెళ్ళెను. 5 సంవత్సరములు ప్రచలిత విద్యల నభ్యసించి తిరిగివచ్చి 'ఖుష్‌నవీసీ' (చక్కని దస్తూరి వ్రాయుట) వలన జీవితము గడుపుచుండెను. కొన్నాళ్ళకు 'నసీమె షుమాల్' అను పత్రికను ప్రకటింపదొడంగెను. ప్రజా ప్రభుత్వము స్థాపింపబడిన పిదప

* రచనా కాలమునందుగాన వర్తమానకాలముపయోగింపబడినది.

నా పత్రికను తెహ్రాన్‌కు మార్చివేసెను. అపుడతని పత్రికకు మిక్కిలి ప్రజ మోదము గలిగెను. 1926 లో ఉన్మాదము వలన మతిచెడి మిక్కిలి దుఃఖమయ జీవితమును గడపవలసి వచ్చెను. ఇతడు 20 వేలు పద్యములు వ్రాసెను. ఇతని రెండు కావ్య సంపుటములు 'జానె బెహిష్త', 'నసీమె షుమాల్' అను పేర ప్రకటింపబడి ఫారసీ వాఙ్మయమున చిరస్థాయిత్వమును సంపాదించుకున్నవి.

## 12 హబీబ్ యగ్మాయి

ఇతనిపేరు మీర్జా హబీబు. ఖాచారీ రాజుల కాలములోని విఖ్యాతుడైన కవి. 'హజల్' అనగా వెక్కిరింతలు, అపహాస్యము ముఖ్యమగు విషయము. తెహరాన్ దగ్గర నొక గ్రామమందు జనించెను. విద్యాశాఖలో ఉద్యోగిగా నుండెను. తరువాత తెహరాన్ యూనివర్సిటీలో ఫారసీ సాహిత్యమును బోధించు ప్రొఫెసరుగా నియమింపబడెను. ఇతని గ్రంథము లనేకము లముద్రితములు. వేల పద్యములు, ఖండ కావ్యములు పత్రికలలో ప్రజటింపబడి జనామోదమును వడసి పాఠ్యగ్రంథములలోను చేర్చబడినవి. ఈరాన్ యొక్క సమగ్రమగు వాఙ్మయ చరిత్రను రచించియున్నాడు కాని యది ముద్రింపబడలేదు.

## 13. సాలార్ షిరాజీ

ఇతని పూర్వీకులలో 'యిమాం కులీఖాన్' విఖ్యాతుడు. 'ఫారస్' పరిపాలకుడు. ఇతని తండ్రి పేరు మీర్జా అలీఖాన్. షాఃనాసరుద్దీన్ ఖాచారు జన్మదినోత్సవమునాడు 1884 లో 'షీరాజ్' పట్టణమున జన్మించెను. అందువలన 'నాసరుద్దీన్' అని నామకరణము గావించిరి. అరబ్బీ, ఫారసీ భాషల నభ్యసించి 'షీరాజు' నుండి భారతదేశమునకు వచ్చెను. చిన్నతనము నుండే గుర్రపు సవారి, విలువిద్య మున్నగు శస్త్ర విద్యలందు కుశలత గడించెను. కివాముల్ ముల్క్-మీర్జా హబీబుల్లాఖాన్ యొక్క కార్యదర్శిగానుండి అతనికిని 'నిజాము స్సల్తనత్'కును యుద్ధము జరిగినప్పుడితడు 'కివాముల్ ముల్క్' యొక్క సేనాపతిగా నుండెను. విజయానంతరము 'సాలార్ జంగ్' అను ఖితాబు

దొరకెను. చాలా కాలము రాజకీయ సాహిత్యరంగములందు పనిచేసిన తరువాత దన స్వంత రాజ్యము 'ఫారస్' నందుండి సాహిత్య సేవయందు నిమగ్నుడయ్యెను. షీరాజు యొక్క సాహిత్య సమితి కధ్యక్షుడు. ఇతని కావ్యములనేకములు పత్రికా ముఖమున ప్రకటింపబడినవి. నేటి యుగపు ఉత్తమ కవులలో నితనిని గణించుచున్నారు.

## 14. సాదత్ నూరీ

ఆఖాయెమీ మీర్జా హుసేన్ ఖాన్ సాదత్ నూరీ అను నితడు ఈరాన్ యొక్క నవ యుగ పుత్రులలో సుప్రసిద్ధుడు. చిన్నతనమందే సాహిత్యమునందు, కవిత్వమునందును విఖ్యాత యశోసిద్ధుడయ్యెను. సమకాలీనులగు కవుల కావ్యముల నేరికూర్చి 'గులహాయి అదబ్' (సాహితీ గుచ్ఛము) అను పేరుతో ప్రకటించెను. ఇతని కావ్యములు- ముఖ్యముగా గజళ్ళు, జాతీయ గీతములు. ఫారసీ, అరబ్బీ భాషలే గాక నితడు పాశ్చాత్య భాషలందును పాండితిని సంపాదించెను. ఆంగ్లేయ కవి వర్డ్సు వర్తు (Wordsworth) యొక్క కొన్ని కావ్యములను ఫారసీ భాషలోని కనువదించి టీకా సహితముగా ప్రకటించినాడు.

## 15. షబాబ్ కిర్మాన్ షాహి

ఆఖాయె మహమ్మద్ జివ్వార్ కిర్మాన్ షాహి షబాబ్. క్రీ. శ. 1853 లో జనించెను. ప్రచలిత విద్యలతో పాటు విలువిద్య మున్నగు శస్త్ర విద్యల నభ్యసించెను. కొంతకాలము కిర్మానుషాః పట్టణమున నుంచి 'ఫసాహాత్' అను పత్రికను ప్రకటించుచుండెను. గొప్ప ధారాశుద్ధి, భావసౌష్ఠవము, సాహిత్యానుభవము గల ప్రతిభావంతుడగు కవి. ఖసీదా - గజల్ ఈ రెంటి యందు ప్రత్యేకముగా కృషి సల్పెను. ఇతని ఈ క్రింది రచనలలో తుది రెండు మాత్రము ముద్రితములు. 'నిషాతే షబాబ్' - 'లిసానుల్ ఆషకీన్' - 'బుస్తానె మారిఫత్' - 'కీమియాయె సాదత్' - 'ముజ్మాయె ఖసాయద్' - 'చష్మనోషీ' - తీరెషహాబ్' - 'పరేషాన్' - 'షకరిస్తాన్' - 'మఖ్జనెలాలీ'.

# 16. షోరీదా షీరాజీ

'హాజీ మహమ్మద్ ఫసీహుత్ ముల్కా షోరీదా' షీరాజు పట్టణమందు 1857వ సంవత్సరములో జన్మించెను. ఇతడు గొప్ప విద్వద్వంశమునకు జెందినవాడు. 7 వ యేట మశూచికము వలన కన్నులు పోయెను. 9 వ యేట తండ్రి మరణించెను. గ్రుడ్డివాడగు నీ యనాథ బాలకుడు మేనమామ వద్ద విద్యాబుద్ధులను గడించి దైవదత్తమగు ప్రతిభా విశేషము వలన సుస్థిరమగు యశస్సును గడించి వాఙ్మయ ప్రపంచమున కమరత్వమును సంపాదించెను. చిన్నతనముననే మేనమామ వెంబడి హజుయాత్ర జరిపెను. 1898లో నిజాముస్సల్తనత్ 'హుసేన్ ఖులీఖాన్' ద్వారా షహజాదా 'అమీనుస్సల్తనత్' దర్బారులో చేరెను. నాసరుద్దీన్‌షాః ముజఫరుద్దీన్‌షాః ఖాచారు ప్రభువుల దర్బారులో స్థలము సంపాదించుకొనెను. నాసరుద్దీన్ ఖాచారు ప్రభువు ఆజ్ఞవుగా నీ కవి వచించిన ఒక రుబాయిని విని 'ఫసీహత్ ముల్కా' అను బిరుదము నొసంగెను.

ఆ రుబాయీ అనువాదము :-

రాజసభను జేరి రంజిల్ల గీర్తించి
బుధులు మెచ్చ బాడి పూజలొంది
విభుని పల్కులెల్ల వినుటయే గానినే
కనుల పండువుగను గాంచనైతి.

నాడు పూజ్యుడు ముస్తఫా నాథుడెలమి
భువిని విడనాడి యే రాజు పుణ్యరాత్రి
దివికి నేగంగ నచటనే దేవుగాంచెః
పలుకు వినవచ్చె నంతియె ఫలముగాదె !

షోరీదా షిరాజీ తెహరాన్ నుండి 'షీరాజు'నకు వచ్చి పెండ్లియాడెను. ఇతని సంతతిలో నిరువురు కుమారులు ఆఖాహసేన్ 'షేఫ్తా' ఆఖాహసన్ ఎహ్సాన్' వీరును విఖ్యాత సాహితీపరులే. షోరీదా కవి 1926 లో షీరాజు పట్టణమున పరమ పదమునందెను. ఇతని కావ్యములు ఫారసీ వాఙ్మయమున Classical అనగా అత్యుచ్ఛమగు పూర్వ కావ్య శ్రేణిలో చేరినవిగా పరిగణింప బడుచున్నవి. ఇతడు మరణించుటకు చిరకాలము పూర్వమే తన మరణ సంవత్స రమును దెలుపు తారీఖీ కితాను రచించియుంచెను.

